# చతుర

జనవరి 2010

రూ.10/-

గూండా
నెంబర్ వన్
122..

హోతా పద్మినీదేవి
సంఘర్షణ
10 లో...




## డా॥ పద్మజ సంతాన సాఫల్య కేంద్రం

నవ్య నర్సింగ్‌హోం. భువనగిరి. 98483 43244 99480 44665

web: www.drpadmajaivf.com e-mail: drpadmajaivf@yahoo.co.in



- IUI - ఇంజెక్షన్ విధానం
- IVF - టెస్ట్‌ట్యూబ్ బేబి
- ICSI - మైక్రో ఇంజెక్షన్ పద్ధతి
- HSG - అండవాహికల పరీక్ష
- ల్యాపరోస్కోపి / హిస్టరోస్కోపీ
- అవసరమైన ఇతర పరీక్షలు - పద్ధతులు
- Recanalisation - మళ్లీ పిల్లల కోసం రివర్స్ ట్యూబెక్టమీ
- అందరికీ అందుబాటైన ఖర్చులో...



ప్రపంచ స్థాయి ఆధునిక ల్యాబ్ & యంత్ర పరికరాలతో...
మీ కలలు సాకారం చేసుకోండి...



డా॥ పద్మజా దివాకర్
సంతాన సాఫల్య వైద్యనిపుణులు

# కేన్సర్ – CANCER-ల్యుకేమియా BLOOD CANCER వారికి శుభవార్త

* మెదడు * నోరు * థైరాయిడ్ గ్రంథి * స్తనములు * ఊపిరితిత్తులు * అన్నవాహిక * జీర్ణాశయము * పసరుతిత్తి * కాలేయము * పాన్‌క్రియాసిస్ * మూత్రపిండములు * ప్రాస్టేటు గ్రంథి * మూత్రకోశము * జీర్ణకోశము * ప్రేగులు * గర్భాశయ కంఠము (సెర్విక్స్) * గర్భాశయము * అండములు * పురుషాంగము * వృషణములు * న్యూరోబ్లాస్టోమా * కండరములు * ఎముకలు * చర్మము * లింఫ్ గ్రంథులు * ఎక్యూట్ లింఫోబ్లాస్టిక్ ల్యుకేమియా * ఎక్యూట్ మైలాయిడ్ ల్యుకేమియా * క్రానిక్ లింఫోసైటిక్ ల్యుకేమియా * క్రానిక్ మైలాయిడ్ ల్యుకేమియా ఎంతో మంది క్యాన్సర్, ల్యుకేమియా వ్యాధిగ్రస్తులను బాగుచేస్తున్నటువంటి ఆంధ్రప్రదేశ్‌లోని ప్రప్రథమ కేరళ ఆయుర్వేద వైద్యశాల, రేడియేషన్ థెరఫి, కీమోథెరపి, హార్మోన్ థెరపి, బయోలాజికల్ థెరపి, మరియు ఇతర వైద్య పద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగరు (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త

35 సం॥రాల సుదీర్ఘకాల పరిశోధనా ఫలితం! అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE-II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) 30 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE-1 DIABETES INSULIN DEPENDENT DIABETES MELLITUS (IDDM) 60 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత ఆహార నియమాలు యోగ, నడక, శరీర, వ్యాయామాలు లేకుండా పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషెంట్లకు మానని పుళ్ళు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs. 2000/-) TYPE-II COURSE 3 MONTHS. TYPE-1 COURSE 6 MONTHS

## త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!

మీరు అనుకోకుండా బానిసలుగా మారిన త్రాగుడును ఆల్కహాల్‌ను (Alcohol), గంజాయి (Bang), నల్లమందు (Opium) (Morphine), బీడి, సిగరెట్, గుట్కా, కల్లు, సారాయి, మైకం పొగ (Cannabis), (Heroin) మొదలగు మత్తుమందులు (Tobacco-Pipe) పొగాకు పొగ పీల్చుట మా ఆయుర్వేద మందు ద్వారా మాన వచ్చును. లేదా వ్యసనపరుడైన వ్యక్తిని తీసుకురాకుండా మరియు అతనికి తెలియకుండా మాన్పించవచ్చును. (Per Month Rs. 1200/-) Course : 2 Months

## బట్టతల!! Baldness! నెరసిన జుట్టు!! Grey Hair!

చుండ్రు, జుట్టురాలుట, పేను కొరుకుడు, జలుబు, కళ్ళ మంటలు, దీర్ఘకాల తలపోటు, మాడు పోటు, పార్శ్వపు నొప్పి, మెదడును చల్లబరుచుట, సుఖనిద్రను కలిగించి జ్ఞాపకశక్తిని వృద్ధిపరిచి తలలోని పేలను వదలగొట్టి, జుట్టును నల్లగా ఒత్తుగా, పొడువుగా పెంచి బట్టతల నెరసిన జుట్టును శాశ్వతంగా నివారించును. Kerala Herbal Hair Tonic (Oil) 100 ml. Rs. 400/-, 250 ml Rs. 900/-, Kerala Herbal Shampoo - 100 ml. Rs. 50/-; 250 ml Rs. 120/-; Herbal Hair Capsules 60 - Rs. 300/- (Per Month Rs. 750) Course: 6 Months.

## సంతానం లేని (Infertillity-Sterillity) దంపతులకు శుభవార్త!!

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న మగవారికి కణాలలో కదలిక లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoosperimia) వెరికోసిల్ వీన్స్ (Varicoseviens) (Per month Rs. 3000/-) Course : 3 months, స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాకపోవుట, అండవాహికలు మూసుకొనిపోవుట (Fallopian Tubes Block), గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రోలాక్టిన్ హార్మోన్ ఎక్కువ శాతములో ఉన్నా, లోపలి ద్రవాల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా, ఎండోమెట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును. (Per Month Rs. 3000/-) Course : 3 months

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కళ్ళు, ముక్కు నుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇసినోఫీలియా (Eosinophilia) దుమ్ము, ధూళి, ఏసి, ఐస్‌వాటర్, మంచు, చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు Asthma Sanjivini 200 ml Rs. 300/- (Per month Rs. 600/-) Course: 9 months.

❖ **నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్కలనము, హస్తప్రయోగము** (Masturbation): నపుంసకత్వము (impotency) అంగస్తంభన సరిగా లేకపోవుట, లైంగిక వాంఛ లేకపోవుట (Libido), రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొనిపోవుట, వృషణములు కుష్షించి పోవుట (Atrophy of Tests), ప్రోస్టేటు గ్రంధి వాపు (Enlarge Prostate) per month Rs. 2000/- Course: 3 months ❖ **సుఖ వ్యాధులు** (Venereal Diseases): వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు గనేరియా సిఫిలిస్, గ్రీట్, షాంక్రాయిడ్ (per month Rs. 1000/-) Course: 3 Months ❖ హెర్పిస్ సింప్లెక్స్ (Herpes Simplex) హెర్పిస్ జోష్టర్ (Herpes Zoster) (Per month Rs. 2000/-) Course : 3 months ❖ **స్తనములు పెరుగుటకు**: జారిన (వాలిన) స్తనములను చిన్నగా, మెత్తగా వున్న స్తనములను సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా చేసి స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును, స్తనముల సైజును తగ్గించుటకు (Decrease) (Per month Rs. 750/-)Course: 3 months ❖ **స్త్రీలకు పొత్తికడుపు మీద గాలిన గీతలు, చారలు పోవుటకు** (Screch Marks): (Per month Rs. 1000/-) Course : 3 months ❖ **మలబద్దకము** (Constipation) (Per month Rs. 3,00/-) Course : 1 month. **గ్యాస్ట్రబుల్, ఎసిడిటీ, అల్సర్, అజీర్ణము** (Dispepsia), ఆకలి లేకపోవుట, కడుపులో నొప్పి, మంట (Gastritis) జీర్ణాశయములో ఆసిడ్ ఎక్కువై ఛాతిలో మంట (Acidity), జీర్ణాశయములో పుండు (Peptic Ulcer) అంత్రమూలములో పుండు (Duodenal Ulcer) (Per month Rs. 750/-) Course : 3 months. ❖ **రక్తమొలలు, అర్శమొలలు** (Piles) Haemoroids, ఆసనములో చీలిక పుండు (Fissers) (ఆపరేషన్ లేకుండా) (Per month Rs. 750/-) Course : 3 months ❖ **పులిపిర్లు** (Warts) ఆనెలు (Corns) Rs. 300/- ❖ **సోరియాసిస్** (Psoriasis) (Per month Rs. 2000/-) Course : 3 months: బొల్లి (Leucoderma), (Per month Rs.2000/-) Course : 3 months ❖ **స్థూలకాయము** (Obesity) : **అధిక బరువును, లావును తగ్గించుటకు** (No Diet, No Exercise) (Per month Rs. 2000/-) Course: 3 months ❖ **సన్నగా బలహీనముగా నుండు వారు బరువు పెరిగి, లావుగాపటిష్టంగా, ఎత్తు పెరుగుటకు, (21 సం॥లోపు వారు)** (Per month Rs. 2000/-) Course: 3 months ❖ **కీళ్ళు కండరాల నొప్పులకు** (Rheumatis arthritis) నరముల వాపు (Neurities) (Backache), **నడుము నొప్పి** (Lumbago), **మెడనొప్పి, వెన్నునొప్పి** (Spinalcord), **తుంటినొప్పి, సయాటిక ఆపరేషన్ లేకుండా** (Per month Rs. 750/-) Course : 3 months ❖ **పక్షవాతము** (Paralysis) (Per month Rs. 5000/-) Course : 3 months. ❖ **మూర్ఛ, అపస్మారకము** (Fits) (Epilepsy) పిచ్చి ఉన్మాదము (Mania) హిస్టీరియా (Hysteria) జ్ఞాపకశక్తి తగ్గిపోవుట (Loss of Memory) నిద్రపట్టకపోవుట (Insomnia), (Per month Rs.2000/-) Course : 3 months ❖ **చెవిపోటు** (Ear ache) : **చెవి నుండి చీముకారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము ఆపరేషన్‌లేకుండా,** (Per month Rs. 750/-) Course : 3 months. ❖ **నత్తిని తగ్గించుటకు** (Stammering) : (Per month Rs. 1500/-) Course : 3 months ❖ **స్త్రీల శరీరంపై వచ్చు అవాంఛిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు** (Per month Rs. 3,000/-) Course : 1 month

**అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

**HIV/ AIDS, FITS, PSORIASIS, OBESITY, PARALYSIS, HEPATITIS, HERPES.**




# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70 ఎంఎం థియేటర్ ఎదురుగా, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్‌పైన,
చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్ - 20. ఫోన్: 65526109, 9866155109, 9392355590

Note: పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ. 80/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించు వారు 10 A.M. - 2 P.M. & 5 P.M. - 8 P.M.



పాఠకులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు

# చతుర

సంపుటి -32
సంచిక - 12
జనవరి 2010
384వ సంచిక



'ప్రభా' తల్లిని పేరుపెట్టి పిలిచింది యుక్తవయసులోని కూతురు రమ్య.
'దొంగ భడవా.. అమ్మని పేరు పెట్టి పిలుస్తావేంటే? ' అంది బామ్మ.
'అలాంటావిడను అమ్మా అనాలంటే కంపరం' అంది రమ్య నిరసనగా.
ఆ తర్వాత-
'అంకుల్! నోట్ బుక్స్ కొనుక్కోవాలి. డబ్బులివ్వండి' అంది సాక్షాత్తు సొంత తండ్రిని.
ఆమె తీరుకు నిర్ఘాంతపోయిన ఇంటిల్లిపాదీ 'ఏమిటే పెద్దా చిన్నా లేకుండా.. నీ వాగుడు? ' అన్నారు.

కూతురి ధిక్కారానికి గురైన ఆ తల్లిదండ్రులు చేసిన తప్పేమిటి? వయసొచ్చిన కూతురు అమ్మానాన్నలను అంత లేసి మాటలనడానికి అసలు కారణం ఏమిటి? ఆద్యంతం ఉత్కంఠగా సాగే హోతా పద్మినీదేవి నవల

**సంఘర్షణ** *10* పేజీలో..

బొమ్మలు : ఆనంద్



సేకరణ : **పాణ్యం రామశేషశాస్త్రి**
ముఖచిత్రం : **కాజల్**
ముఖపత్రాలంకరణ : **రాజుయాట**

# మరాఠీ సాహిత్య 'రుషి'



విష్ణుసఖారాం ఖాండేకర్
(1898–1976)

**విశ్వ శ్రేయస్సు కోసమే సాహితీసృష్టి జరగాలని గాఢంగా విశ్వసించి, తదనుగుణంగా జీవిత పర్యంతం రచనలు చేసిన ఆదర్శ సాహితీ నిధి విష్ణుసఖారాం ఖాండేకర్. బడుగు వర్గాలు, మధ్యతరగతి ప్రజల స్థితిగతుల్ని సమగ్రంగా పరిశీలించి, వారి జీవిత గాథలే కేంద్రబిందువులుగా సాహితీ సృజన చేయడంతోపాటు, శాయశక్తులా వారికి చేయూతనందించిన ఖాండేకర్ గురించి ప్రముఖ రచయిత బి.బి.బోర్కర్ 'మరాఠీ సాహితీ లోకంలో కడపటి రుషితుల్యుడు' అన్నాడు. శతాధిక గ్రంథకర్త ఖాండేకర్ 'యయాతి' నవలకు 1974 జ్ఞానపీఠ పురస్కారం లభించింది.**

విష్ణుసఖారాం ఖాండేకర్ 1898 జనవరి 19న మహారాష్ట్రలోని సాంగ్లీలో జన్మించాడు. తండ్రి ఆత్మారాం పంత్ సాంగ్లీ మున్సిఫ్‌గా పని చేశారు. ఖాండేకర్ తొలినామం గణేశ్ ఆత్మారాం. బాల్యంలో తండ్రిని పోగొట్టుకున్న గణేశ్‌ను సఖారాం ఖాండేకర్ దత్తత తీసుకుని విష్ణు సఖారాం ఖాండేకర్‌గా పునర్నామకరణం చేశారు. ఖాండేకర్ చిన్నతనంలో మలేరియా జ్వరంతో బాధపడేవాడు. సాంగ్లీలో చదివి ముంబయ్ విశ్వ విద్యాలయం మెట్రిక్యులేషన్ పరీక్ష ఉత్తీర్ణుడయ్యాడు. విశ్వవిద్యాలయం మొత్తంలో ఎనిమిదో స్థానం చేజిక్కించుకున్నాడు. బాల్యంలో ఆటలు, నాటకాలపై అభిమానం చూపేవాడు. అన్నిరకాల పాత్రల్లో నటించేవాడు. విపరీతంగా చదివేవాడు. నవలలంటే చాలా ఇష్టం. పూనా ఫెర్గ్యుసన్ కళాశాలలో ఉన్నతవిద్య కోసం చేరాడు. ఇతర ఖర్చుల నిమిత్తం ట్యూషన్లు చెప్పేవాడు. హైకోర్టు ప్లీడరు పరీక్ష రాసి, సావంతవాడిలో న్యాయవాద వృత్తి చేపట్టే అవకాశముంది. అయితే ప్రముఖ సామాజిక కార్యకర్త, జి.జి.అగార్కర్ సేవాంకిత జీవనంతో ప్రభావితుడయ్యాడు. ధన సంపాదన కంటే సంఘసేవే ఉత్తమ మార్గమని నిశ్చయించుకున్నాడు. ఉన్నత విద్యకు స్వస్తి చెప్పి 'శిరోద్' అనే గ్రామంలో వున్న పాఠశాలలో ఉపాధ్యాయ వృత్తిని 1920లో చేపట్టాడు. అది కొంకణి ప్రాంతంలోని పల్లె. కేవలం నిర్ణీత పాఠాలే కాక, రామాయణ, భారతాది గ్రంథాల నుంచి కథలు చెప్పి విద్యార్థుల్లో ఉత్తమాదర్శాలు వర్ధిల్ల చేసేవాడాయన. గ్రామ ప్రజలకు సేవలందించేవాడు. సాహితీ వ్యాసంగంతో అనారోగ్యాన్ని సైతం విస్మరించేవాడు. సుప్రసిద్ధ మరాఠీ సాహితీవేత్తలు శ్రీపద్ కృష్ణ కోలాట్కర్, రామ్‌గణేశ్ గడ్కరీ రచనలు ఖాండేకర్‌ను విశేషంగా ప్రభావితం చేశాయి. రచన, బోధన, సాంఘికసేవ ఆయన ముఖ్య వ్యాపకాలు. ఆయనకు మనుతాయ్‌తో వివాహమయింది. పద్దెనిమిది సంవత్సరాలు శిరోద్‌లో పనిచేసి 1938లో ఆరోగ్య కారణాలపై కొల్లాపూర్ వెళ్లారు. ప్రముఖ చలనచిత్ర దర్శకులు వినాయక్ కోరికపై సినిమాలకు మాటలు సమకూర్చాడు. వాటితోపాటు వివిధ ప్రక్రియల్లో రచనలు కూడా కొనసాగించాడు.




విష్ణుసఖారాం ఖాండేకర్ అసాధారణ సాహితీవేత్త. రామాయణం, అరేబియన్ నైట్స్ కథలు, కోలాట్కర్ 'సుదామ్యాచె పోహే' రచనలు, శిరోద్ గ్రామం- ఈ నాలుగు తన జీవితానికి స్ఫూర్తిదాయకాలని ప్రకటించాడు. శిరోద్ గ్రామ ప్రజల పేదరికం, ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం మానవాళి మనోభావాలు, పెరుగుతున్న భౌతిక

విలువలు, మార్క్సిజం వ్యాప్తి, రష్యా విప్లవం, గాంధీజీ నాయకత్వాన స్వరాజ్యోద్యమం, స్వార్థప రుల కార్యకలాపాలు, దోపిడీ వ్యవస్థ వంటి అనే కాంశాలు ఆయన దృష్టిని ఆకర్షించాయి. ఈ నేప థ్యాలతో తన ఆదర్శాలకు, ఆశయాలకు, ఆలోచన లకు అక్షరరూపం కల్పించాడు. మంచి శైలి, సమున్నత భావుకత ఆయన ప్రత్యేకతలు. విద్యా ర్థిగా జీర్ణించుకున్న హరిభావ్ ఆప్టే నవలల్లోని అభినివేశం, కేశవసుత్ కవితల విప్లవభావాలు, అగార్కర్ వ్యాసాల్లోని సంస్కరణస్ఫూర్తి, కోలా ట్కర్-గడ్కరీ శైలీ వైదుష్యం మనసులో మెదులు తూనే ఉండేవి. వ్యక్తిత్వాన్ని, సాహితీమూర్తిమ త్వాన్ని సమాంతరంగా పెంచుకున్న మనీషి ఖాండేకర్. 1919లో తొలిరచన కోలాట్కర్ ఆమోదం పొందింది. 'శ్రీమత్ కలి పురాణం' నుంచి 1974లో 'యయాతి' వరకు నిరంతరంగా ఈ రచనా వ్యాసంగం సాగింది. ఒక నాటకం, 15 నవలలు, 29 కథా సంపుటాలు, 6 నీతికథా సం పుటాలు, 14 వ్యాస సంపుటాలు, 5 సాహిత్య విమర్శన గ్రంథాలు, 3 ప్రసంగ సంపుటాలు, 9 విమర్శనాత్మక వ్యాస సంపుటాలు, 2 జీవిత చరి త్రలు, ఒక అనువాదం (3 భాగాలు), 18 చలన చిత్రాలకు మాటలు - ఖాండేకర్ కలం నుంచి జాలువారాయి. ఆయన రాసిన 250 పైగా కథలు మరాఠీ కథాసాహిత్యంలో మణిపూసలుగా ఖ్యాతి గాంచాయి.

వీటి రచన మూడు దశల్లో సాగింది. మొదటి దశలో ఆదర్శవాదం, రెండోదశలో యుద్ధానంతర వాతావరణం, చివరి దశలో స్వతంత్ర భారతంలో స్థితిగతులు చోటుచేసుకున్నాయి. 'నవమల్లిక', 'సూర్యకమలె', 'పహిలీలత', 'స్త్రీ అని పురుష' మొదలైన సంపుటాలు అత్యంత పాఠకాదరణ పొందాయి. సంవిధానంలోను, ఇతివృత్తంలోను ఆయన నవలలు విలక్షణమైనవి. 'పల్లె జీవనస్ఫూ ర్తిని నింపుకోగానే నా రచనా వస్తువులో మార్పు వచ్చింది' అన్నాడాయన. తొలి నవల 'హృద యాంచి హాంక్'కు ఆధారం శిరోద్‌లోని ఒక సంఘటనే. ధనదాహాన్ని నిరసించే నవల 'కాంచ న మృగ్', 'ఉల్కా', 'దోనే ధ్రువ్' నవలల్లో మధ్య తరగతి జీవన సరళి చూపాడు. ఆదర్శాలకు, ఆచ రణకు మధ్య అంతరం 'క్రౌంచవధ' వివరిస్తుంది. సంప్రదాయ విలువల చుట్టూ అల్లిన నవల 'అశ్రు' . వ్యాస ప్రక్రియ పితామహుడిగా ఖాండేకర్ ప్రసి ద్ధుడు. వస్తు వైవిధ్యంతోపాటు విషయ పరిజ్ఞా నంతో అవి నిండి ఉంటాయి. జీబ్రాన్, టాగూర్ ల స్ఫూర్తితో నీతికథలు రాశాడు. సాహిత్యంపైన, నాటకరంగంపైన ఆయన విమర్శన గ్రంథాలు ప్రామాణికాలు. 'మరాఠీ నాట్య సంసార్' మరాఠీ నాటకరంగంపై సాధికారిక గ్రంథం. ఆయన గొప్ప వక్త. చలనచిత్ర రచనను ఆయన వృత్తిగా పరిగణించలేదు.

'యయాతి' నవలలోని పాత్రలు పౌరాణికా లైనా ఖాండేకర్ వాటిని అద్భుత ప్రతీకలుగా మలిచాడు. అది సందేశాత్మక రచన. ఆధునిక సమాజంలో మితిమీరుతున్న భోగలాలసతను దుయ్యబట్టాడు. ధనార్తిని, విధ్వంసక ప్రవృత్తిని, బల ప్రదర్శనను రచనల్లో నిరసించాడు. కామ మోహాల కంటే త్యాగమే గొప్పదని నిరూపించా డు. ఇందుకు 'కచ-దేవయాని' వృత్తాంతంలో మార్పులు చేశాడు. కచుని పాత్ర ఆదర్శ ప్రా యంగా ఉండేటట్లు తీర్చిదిద్దాడు. సమాజంపట్ల వ్యక్తి బాధ్యతల్ని ఈ నవల గుర్తు చేస్తుంది. భార తీయ సాంస్కృతిక, తాత్విక విలువలకు నవల పెద్దపీట వేసింది. యయాతి, శర్మిష్ఠ, కచుడు, దేవయాని పాత్రలకు ఆధునికాన్వయం చేకూర్చ డంలో ఖాండేకర్ చూపిన ప్రతిభ అసాధారణం. అందుకే ఈ నవల ప్రతిష్ఠాత్మక జ్ఞానపీఠ పుర స్కారం పొందగలిగింది.

అనారోగ్యంతోపాటు ఆయనకు వృద్ధాప్యంలో కంటిచూపు మందగించింది. చివరి రోజులు కొల్హాపూర్ సమీపంలో ఉన్న ఇస్లాం పూర్‌లో తన మూడో కుమార్తె సులభ కపాడి వద్ద గడుపుతూ నే 1976 సెప్టెంబరు 2న తుదిశ్వాస విడిచారాయ న. ఖాండేకర్‌కు 1960లో సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. 1968లో కేంద్ర ప్ర భుత్వం పద్మభూషణ్ గౌరవం ప్రదానం చేసింది. 1970లో సాహిత్య అకాడమీ 'ఫెలోషిప్' ఇచ్చి సత్కరించింది. కొల్లాపూర్‌లో శివాజీ విశ్వవిద్యా లయం ఖాండేకర్‌కు గౌరవ డాక్టరేట్ పట్టం ఇచ్చింది. 1998లో భారత ప్రభుత్వం ఆయన గౌరవార్థం తపాలా బిళ్ల విడుదల చేయడం విశేషం.

ఆయన రచనలు గుజరాత్, తమిళం, హిందీ, సింధీ, కన్నడం, మలయాళం, బెంగాలీ భాషల్లోకి అనువాదమయ్యాయి. ఆధునిక సాహిత్యంలో విష్ణుసఖారాం ఖాండేకర్ పేరు శాశ్వతంగా వెలు గొందుతుందనడంలో సందేహం లేదు.

*(ఖాండేకర్ జయంతి 19న)*

*-గోవిందరాజు రామకృష్ణారావు*

# శరణ్య

'ఓకే.. ఇక్కడ బైక్ ఆపు సుధా!'

'ఇక్కడా?' ట్యాంక్‌బండ్‌పై శ్రీశ్రీ విగ్రహం దగ్గర బండాపుతూ ఆశ్చర్యంగా అడిగాడు సుధాకర్.

'య్యా.. ఓకే! మనం రేపు సాయంత్రం కలుద్దాం.. బబాయ్' అంటూ నవ్వుతూ అతని వీపుపై తట్టి బండి దిగేసింది శరణ్య. ఇంజన్ ఆఫ్‌చేసి అతనేదో అంటున్నా విన్పించుకోకుండా రోడ్‌క్రాస్ చేసిందామె.

పళ్లు కొరుకుతూ ఆ కసిని కిక్‌రాడ్‌పై చూపించాడు సుధాకర్. బండి స్టార్ట్ అవగానే యాక్సిలేటర్ రైజ్ చేసి ముందుకు దూకించాడతను.




బండి దూసుకుపోతోంది కానీ ఆలోచనలు మాత్రం శరణ్య చుట్టూనే తిరుగుతున్నాయి. కొన్ని నిముషాల క్రితం ఉల్లాసంగా ఉరకలెత్తిన అతని మనసు ఇప్పుడు కోపంతో ఉడికిపోతోంది. సాయంత్రం ఆఫీసు అయ్యాక బండెక్కుతూ 'ఇవ్వాళ ఇంటికొద్దు సుధా..' అని తను అనగానే, అయితే కాసేపు ఏ పార్కులోనో కబుర్లాడుకోవచ్చు అనుకున్నాడు. బండిని ట్యాంక్ బండ్‌పైకి పోనిమ్మనే సరికి మరింత సంతోషించాడు. అందమైన శరణ్యతో కలిసి ట్యాంక్‌బండ్‌పై చల్లగాలిలో షికారు కొట్టొచ్చు అనుకున్నాడు. కానీ చివరికి ఏమైంది? తనను ఇక్కడ వదిలేసి పొమ్మని ఆర్డరేసింది. ఏమనుకుంటోంది తన గురించి? తనేమైనా ఆవిడగారి కారు డ్రైవర్‌ను అనుకుంటోందా? లేక టాక్సీ డ్రైవర్‌ను అనుకుంటోందా? అతని మనసు రగిలిపోతోంది.

శరణ్య, సుధాకర్ ఒకే ఆఫీసులో పనిచేస్తున్నారు. మంచి స్నేహితులు. ఆఫీసయ్యాక సుధాకరే రోజూ శరణ్యను తనబండిపై వాళ్లింటి దగ్గర దింపేసి పోతుంటాడు. తన వీక్లీఆఫ్ రోజున కూడా అతను వచ్చి శరణ్యను తీసుకు వెళ్లడం పరిపాటి. ఇద్దరూ కలిసి కాఫీ తాగడం, కబుర్లాడుకోవడం, షాపింగ్ చేయడం కూడా మామూలే.

అయితే చిక్కు ఎక్కడొస్తుందంటే వారిద్దరి మధ్య సాన్నిహిత్యాన్ని ఆమె 'స్నేహం' అనుకుంటుంది.. అతను 'ప్రేమ' అనుకుంటాడు అదే తేడా! తామిద్దరూ కలిసి తిరగడాన్ని సహోద్యోగులు రకరకాలుగా కామెంట్ చేసినా ఆమె పట్టించుకోదు.. సుధాకర్ మాత్రం అంతటి అందమైన శరణ్యకు బాయ్‌ఫ్రెండ్ అన్పించుకోవడాన్ని గర్వంగా ఫీలయ్యేవాడు. అంతేకాదు.. అప్పుడప్పుడూ ఆమె మీద తనకేదో అధికారం ఉన్నట్లు పెత్తనం చేయడానికి చూస్తాడు. అలాంటి సమయాల్లో ఆమె మాటలు బంద్ చేస్తుంది.. అతని బండీ ఎక్కదు. దాంతో రెండు మూడ్రోజులకు సారీ చెబుతూ అతనే దారికొస్తాడు.

'నీలాంటి స్నేహితులే నాకింకా నలుగురు ఉన్నారు. వాళ్లంతా నేను గతంలో పనిచేసిన ఆఫీసుల్లో నా కొలీగ్స్, ఫ్యామిలీ ఫ్రెండ్స్ వగైరా.. వాళ్లూ నాకు ఆప్తులే! నీతో ఉన్నట్లే వాళ్లతోనూ స్నేహంగానే ఉంటాను. నువ్వున్నట్లే వాళ్లూ నాతో చనువుగా ఉంటారు.. అంచేత నా స్నేహాన్ని




నువ్వు మరోలా ఊహించుకుని మనసు కష్టపెట్టుకోకు.. నా మనసు కష్టపెట్టకు' అంటూ వీలు చిక్కినప్పుడల్లా శరణ్యా సుధాకర్‌కు క్లాసు పీకుతూనే ఉంటుంది.

'సరే' అంటాడేగానీ నిజానికి అతనికి శరణ్య వేరెవ్వరితో తనతో ఉన్నంత చనువుగా ఉండడం ఇష్టం ఉండదు. కాదంటే తనకు 'కటీఫ్' చెప్పేస్తుందని భయం. ఆమె తనను వదిలేసినంత తేలిగ్గా తను ఆమెను వదిలి ఉండగలడా? చూడకుండా ఉండగలడా? మాట్లాడకుండా ఉండగలడా? లేడు... ముమ్మాటికీ ఉండలేడు.. అది తన బలహీనత.

ఆ విషయం శరణ్యకూ తెలుసు. అందుకే అతను అలిగినప్పుడల్లా బుజ్జగిస్తుంది.. అలకతీరుస్తుంది!

ఇవ్వాళ సుధాకర్‌కు శరణ్యా మీద చాలా కోపంగా ఉంది.. ఇలా ఇంతకు ముందు చాలాసార్లు జరిగినా ఇవ్వాళ మాత్రం అతని మనసు తీవ్రంగా గాయపడింది. దానికీ ఓ కారణం ఉంది. తన కథకు బహుమతి వచ్చింది. సాయంత్రం ఆ విషయం చెప్పి ఆమెను సర్‌ప్రైజ్ చేద్దామనుకున్నాడు. మినర్వాలో కాఫీతాగుతూ ఈ సంతోషాన్ని ఆమెతో పంచుకోవాలని ప్లాన్ చేసుకున్నాడతను.. కానీ అంతా తలక్రిందులైంది. ఆమె తనకోసంకాక తనస్నేహితుడ్ని ఎవరినో కలవడానికి ట్యాంక్‌బండ్‌కు రావడం గుండె మండించింది. తను

గాక ఎవడో ఆమెతో ఇవ్వాళ ట్యాంక్‌బండ్‌పై షికారు కొడతాడనుకునేసరికి అది మరింత పెరిగింది. అందుకే ఎప్పుడూ లేనిది 'ఆమె ప్రియుడు' ఎవరో తెలుసుకోవాలని అనుకున్నాడు. తర్వాత వాడి అంతు తేల్చాలనుకున్నాడు..

శరణ్యను ట్యాంక్‌బండ్‌పై వదిలి సికింద్రాబాద్ బోట్స్‌క్లబ్‌దాకా వెళ్లినవాడు గిర్రున వెనుతిరిగి అక్కడికే వచ్చాడు. ఏది శరణ్య? తను ఇక్కడే కదా వదిలి వెళ్లింది.. అనుకుంటూ అటూ ఇటూ చూశాడతను.. 'ఆc అదుగో! శ్రీశ్రీ విగ్రహం మెట్టుమీద కూర్చుని ఎవడితోనో బాతాఖానీ వేస్తోంది. ఊc.. ఈ వెధవా ఈవిడగారి ఫ్రెండ్? నా కంటే అందగాడనుకున్నాను. పెద్దముసలోడిలా ఉన్నాడే? సర్లే చావనీ నాకెందుకు? ఇద్దరూ లోకాన్ని మరచి ఏదో రసవత్తర చర్చలో మునిగితేలుతున్నారు. ఈ ముసలోడితో ఈవిడికి ఏంటి కబుర్లు? వాడితో ఏం మాట్లాడుతుందో తెలుసుకోవాలి..' అనుకుని బండిని దూరంగా పార్క్‌చేసి, ఆమె కంట పడకుండా మెల్లగా శ్రీశ్రీ విగ్రహం వెనుకకు చేరాడు సుధాకర్.

తను వ్యవహరిస్తున్న తీరుకు తనకే మరోపక్క ఆశ్చర్యంగానూ ఉందతనికి. ఏమైంది తనకీవేళ? ఎందుకు ఇలాంటి పనులకు పూనుకుంటున్నాడు? తను అమితంగా ఆరాధించే శరణ్యను తనే చాటుగా వెంటాడడమా? ఆమెకి తెలిస్తే తన గురించి ఏమనుకుంటుంది? తల విదిలించాడు.. అంతలోనే విగ్రహం ఆ పక్క నుంచి శరణ్య మాటలు విన్పిస్తున్నాయి..

'కాదు దివాకర్ ప్లీజ్ నా మాట విను. ఆ కుర్రాడు చాలా మంచివాడు. నమ్మకంగా పనిచేస్తాడు..'

'కావచ్చు. కానీ నీకెందుకీ రొష్టు? అసలే డబ్బుతో వ్యవహారం! రేపు వాడో లక్షో రెండులక్షలో వేసుకుని ఉడాయిస్తే ఏంటి మనగతి? సిఫార్సు చేసినందుకు నీకూ, ఉద్యోగం ఇచ్చినందుకు నాకూ తల నొప్పి..' అంటున్నాడతను.

సుధాకర్ భ్రుకుటి ముడిపడింది..

'అతను అలాంటివాడు కాదు దివాకర్.. అతను నా ప్రాణమిత్రుడు సుధాకర్ తమ్ముడు. పీజీచేసి నిరుద్యోగిగా తిరుగుతున్నాడు.. మంచి కుటుంబం. నువ్వీ ఉద్యోగం ఇచ్చావంటే నీ పేరు చెప్పుకుని బతికి పోతాడతను... ప్లీజ్ ఇవి చేతులు కావు, కాళ్లనుకో..'

'ఛఛ.. ఏంటి శరణ్యా? వదులు.. నువ్వు నన్ను అర్థం చేసుకుంది ఇంతేనా? అనవసరంగా మనిద్దరం ఇబ్బందుల్లో పడొద్దనే ఇంతదాకా చెప్పాను. ఓకే.. డన్! ఎల్లుండే ఆ అబ్బాయిని రెజ్యూమె, ఒరిజినల్ సర్టిఫికెట్లు తీసుకుని మా ఆఫీసుకు వచ్చేయమను..'

'థ్యాంక్యూ దివా! నీ మేలీజన్మకు మరువలేను..'

'అదుగో మళ్లీ..'

'మరి వెళ్దామా? అన్నట్లు ఆ ఉద్యోగానికి ఏమైనా సెక్యూరిటీ డిపాజిట్ కట్టాలా? కట్టాలంటే నేను కట్టేస్తాను..'

'రూల్ ప్రకారమైతే కట్టాలి. కానీ నువ్వే కట్టేట్టయితే వద్దు. నేనే కట్టేస్తాను..'

'థ్యాంక్యూ థ్యాంక్యూ థ్యాంక్యూ దివా..'

సుధాకర్‌కు ఆ తర్వాత వాళ్ల మాటలేవీ వినపడలేదు. అప్పటికే పశ్చాత్తాపంతో గుండె చెరువైంది. కళ్లవెంట నీళ్లు.. తమ్ముడి దీనస్థితి గురించి పదిరోజుల క్రితం తనే శరణ్యకు చెప్పాడు. ఆమె వాడి జీవితాన్ని నిలబెట్టడానికి ప్రయత్నిస్తుంటే ఆమె స్నేహభావాన్ని అర్థంచేసుకోకుండా మరోలా యోచించాడు. ఛీఛీ! అసలు తను మనిషేనా? శరణ్య కాలిగోటికి సరిపోతాడా తను? అలా ఆలోచిస్తూ లేచి మెల్లగా చీకట్లో కలిసిపోయాడు సుధాకర్.

—చంద్రప్రతాప్

# సరిహద్దు రైలు కథ



భారతదేశంలోని ప్రఖ్యాత రైళ్లలో ఒకటైన ఫ్రాంటియర్ మెయిల్ 1928 సెప్టెంబర్ ఒకటిన మొదలైంది. బ్రిటిష్ హయాంలో, స్వతంత్రం వచ్చాక కూడా ఇంజన్ డ్రైవర్‌గా ఫెలిక్స్ డిసౌజా దీనిని చాలాకాలం నడిపాడు. అతని కొడుకు జో డిసౌజా కూడా ఈ ట్రైన్‌కే ఇంజన్ డ్రైవర్ అయ్యాడు.

1928లో బాంబేలోని కొలాబా టెర్మినల్ నుంచి మొదటిసారిగా ఇది బయలుదేరినప్పుడు డబ్ల్యు.ఆర్. టక్కర్ ఇంజన్ డ్రైవర్. ఆ రోజుల్లో యూరోపియన్లే ఇంజన్ డ్రైవర్లు. ఫెలిక్స్ డిసౌజా అతనికి సహాయకుడిగా చేరాడు.

అప్పట్లో రైళ్ళు చిన్నవిగా ఆరు నుంచి ఎనిమిది పెట్టెలు మించి ఉండేవి కావు. ప్రతి పెట్టెలో సౌకర్యంగా కూర్చునేందుకు కుర్చీలు, పేకాట ఆడేందుకు టేబుల్, బేటరీతో నడిచే ఫ్యాన్లు, టాయిలెట్, బాత్‌రూమ్‌లాంటి సౌకర్యాలుండేవి. మంచి హోటల్ గదిలా కేటరింగ్ పెట్టె ఉండేది. ఆ రోజుల్లో రైల్వే అధికారులుగా పనిచేసే భారతీయులు తప్ప, మిగిలిన వారంతా ఈ ఫస్ట్‌క్లాస్ పెట్టెలో కాక, థర్డ్ క్లాస్ పెట్టెల్లో ప్రయాణించేవారు. రైలు ప్రయాణానికి భయపడే భారతీయులకి లడ్డూలు ప్రోత్సాహంగా ఇచ్చేవారు.



బాంబేనించి పెషావర్‌కి 233 కిలోమీటర్లు పయనించే ఫ్రాంటియర్ మెయిల్‌ని ది బాంబే బరోడా అండ్ సెంట్రల్ ఇండియా, నార్త్ వెస్ట్రన్ రైల్వే కంపెనీతో కలసి ఢిల్లీ లాహోర్, రావల్పిండి, పెషావర్‌లకి నడిపేది. అప్పట్లో ఇది అమిత వేగంతో నడిచే రైలు. లండన్ టైమ్స్ ఈ రైలుని ఫేమస్ ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్స్ ఇన్ ది బ్రిటిష్ ఎంపైర్ జాబితాలో చేర్చింది.

అప్పటికింకా బాంబే సెంట్రల్ టెర్మినల్ ప్రారంభం కాలేదు. ఇది డిసెంబర్ 18, 1930న మొదలైంది. బాంబేలోని కొలాబా రైల్వేస్టేషన్ నుంచి మధ్యాహ్నం ఒంటి గంటకి బయలుదేరి నలభై మూడున్నర గంటల తర్వాత పెషావర్ చేరేది. గుహల గుండా, కొండలమీద ఈ రైలు ప్రయాణించేది.

దేశ విభజన తర్వాత ఈ రైలు రెండువేల కిలో మీటర్లు మాత్రమే ప్రయాణించి అమృత్‌సర్ మీదుగా జమ్మూకు ఎనిమిది రాష్ట్రాలైన మహారాష్ట్ర, గుజరాత్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, హర్యానా, పంజాబ్, కాశ్మీర్ మీదుగా ప్రయాణిస్తోంది. పాకిస్తాన్‌లో కూడా ఇదే పేరుగల రైలొకటి నడుస్తోంది.

మధురోహలతో పడకగదిలోకి అడుగుపెట్టిన నవవధువు భర్త చెప్పిన 'చేదు నిజం' విని షాక్‌కు గురైంది. కుటుంబ గౌరవం, ఆస్తి సంరక్షణ పేరిట మోసంచేసిన అత్తగారిపై విపరీతమైన ఆగ్రహం కలిగింది. కానీ అమాయకంగా కన్పించిన భర్తముఖం చూసి తనను తాను సంబాళించుకుంది. అదే ఆమెను జీవితంలో ఎన్నో రంపపు కోతలకు గురిచేసింది. కొడుకులాంటి మరిదే ఆమె పొందుకోసం వెంపర్లాడాడు. అమ్మలాంటి అత్తగారే చీకటితప్పుకు పురికొల్పింది.. చిట్టచివరికి అల్లారుముద్దుగా పెంచిన కూతురు తల్లి బతుకులోని చీకటి కోణాన్ని తవ్వితీసి 'కళంకిత'గా ఏవగించుకుంది.. ఇంతకీ అసలేం జరిగింది? ఓ మాతృమూర్తి జీవితేతిహాసంపై పడిన మహాభారత ఛాయలు చివరికామె జీవితాన్ని ఏ తీరానికి నడిపించాయి? ఆద్యంతం ఉత్కంఠగా సాగే హోతా పద్మినీదేవి సంఘర్షణ

చతుర నూతన సంవత్సర కానుక!



"దీర్ఘాయుష్మాన్ భవ! సకల విద్యాప్రాప్తిరస్తు" అంది తన పాదాలకి నమస్కరించిన మనుమరాలి తలపై చెయ్యి వుంచి దీవించిన సూర్యకాంతమ్మ. పట్టు పరికిణీ, ఓణీ ధరించిన మనవరాలు పదహారేళ్ళ రమ్య పుత్తడి బొమ్మలా మెరిసిపోతుంటే కళ్ళ నిండుగా చూసుకుంటోంది.

"నువ్వు నా మనుమరాలివేనుటే! బంగారు బొమ్మలా ఉన్నావు" సంబరంగా ఆమె చెంపలు పుణికి ముద్దు పెట్టుకుంది.

"ప్రభా! నీ కూతురికి కాస్త ఉప్పు దిగతుడిచి పారెయ్యి. నా దిష్టే తగిలేట్టుంది" అంది చిరునవ్వుతో తమనే చూస్తున్న కోడలిని ఉద్దేశించి.

"పో బామ్మా! నీదంతా చాదస్తం" నవ్వింది రమ్య.

"హేపీ బర్త్‌డే అక్కా!" బాబిగాడు బ్రష్ చేసుకుంటూ చెప్పాడు. వాడి అసలు పేరు హరి.

"విష్ యు ది సేమ్. మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" చెప్పింది రమ్య.

"పుట్టిన రోజునాడైనా కాస్త త్వరగా లేవచ్చు కదుట్రా! అక్క చూడు అప్పుడే తలంటు పోసుకుని రెడీ అయిపోయింది" అంది సూర్యకాంతమ్మ.

"నువ్వు ప్రతి పనిలోను లేటేరా! నువ్వో లేట్ లతీఫ్‌వి" చిరుకోపంగా తమ్ముడిని చూస్తూ అంది రమ్య.

"నిజమే అక్కా! నీ కంటే అయిదు నిమిషాలు లేట్‌గా పుట్టినప్పుడే నాకా విషయం తెలిసిపోయింది" హరి బాత్‌రూమ్‌లోకి వెళ్తూ అన్నాడు. వాడి మాటలకి అందరూ నవ్వుకున్నారు.

పది నిమిషాల్లో స్నానం ముగించి కొత్త బట్టలు వేసుకుని బయటకొచ్చిన హరి బామ్మ పాదాలకు నమస్కరించాడు. మనుమడిని దీవించి అప్పుడే అక్కడికి వచ్చిన కొడుకుని చూసి, "మీ అమ్మా నాన్నలకి దణ్ణం పెట్టండి" చెప్పిందావిడ లోగొంతుతో.

"ఇలా రా నాన్నా! వచ్చి అమ్మ పక్కన నిలబడు" రమ్య తండ్రి చేతిని పట్టుకుని అంది.

"దేనికిరా? " నవ్వుతూ అడిగేడు నారాయణరావు.

"ముందు నిలబడు చెబుతాను"

అతను ప్రభ పక్కన నిలబడ్డాడు. రమ్య, హరి ఆ ఇద్దరి పాదాలకి నమస్కరించారు. ఆ ఇద్దరూ పిల్లల్ని మనసులోనే దీవించారు.

ప్రభ చప్పున వంటగదిలోకి వెళ్తూ అంది, "రమ్యా! కాలేజీకి టైమవుతోంది. త్వరగా తెములు"

"అమ్మా! నా గొలుసెక్కడ పెట్టావ్? "

"నా బీర్వా లాకర్‌లో ఉంది చూడు" ప్రభ పాయసంలో పంచదార, ఏలకుల పొడి కలుపుతూ అంది. రమ్య గదిలోకి వెళ్ళి డ్రెస్ మార్చుకుని తల్లి బీర్వా తెరిచింది. లాకర్‌లో నుంచి నగల పెట్టెని తీసింది. గొలుసు తీసుకుని పెట్టెని యథాస్థానంలో పెడుతుంటే దాని పక్కనే ఎర్రటి అట్టతో ఉన్న డైరీ కనిపించింది.

రమ్య మెడలో గొలుసు వేసుకుని ఆ డైరీని మరోసారి చూసింది. ఆమెలో ఏదో తెలియని కుతూహలం కలిగింది. చెయ్యి జాపి డైరీని అందుకుని పేజీలు తిప్పింది. అది తల్లి డైరీ అని దస్తూరీని బట్టి పోల్చుకుందామె. ఆమె ఆసక్తిగా పేజీలను తిరగేస్తోంది.

"నా కుటుంబానికి ఎవరి శాపమో తగిలింది. ఈ తరంతో మా వంశం ఆఖరయిపోతోంది. పాతిక ఎకరాల మాగాణి, ఈ ఇల్లు, డబ్బు అన్నీ ఎవరనుభవిస్తారు? ఏ ధర్మసంస్థలకో రాసెయ్యండి" అంది మా అత్తగారు.

"ఎవరినైనా పెంచుకుంటాం అన్నాను

నేను" ఈ వాక్యాలని చదివిన ఆమె మనసులో ఏదో అనుమానం.

"రమ్యా! త్వరగా రా కాలేజీకి టైమయిపోతోంది" తల్లి పిలుపు.

రమ్య ఉలిక్కిపడి డైరీని యథాస్థానంలో పెట్టేసి బీర్వా తలుపు మూసేసింది. బయటకొచ్చిన కూతురి ముఖంలోని ఉద్విగ్నతని గమనిస్తూ అంది ప్రభ.

"అమ్మలూ! ఎందుకలా ఉన్నావ్? "

"ఏం లేదు" అంది రమ్య డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చుంటూ.

"గొలుసు కొక్కెం గట్టిగా నొక్కి పెట్టేవా? "

"ఊఁ!" ముభావంగా అంది.

ప్రభ స్పూన్‌తో పాయసాన్ని తీసి హరికి, రమ్యకి నోట్లో పెట్టింది. "హేపీ బర్త్‌డేరా" అంది.

"థాంక్ యూ!" అంది రమ్య ముభావంగా. 'ఎవర్నైనా పెంచుకుంటాం' తల్లి డైరీలో రాసిన వాక్యాలపై ఆమె మనసు కేంద్రీకృతమయి ఉంది.

"అంటే! తను వీళ్ళ అమ్మాయి కాదా? తనని వీళ్ళు పెంచుకుంటున్నారా? అందుకేనా చాలామంది తనని కామేశ్వర్రావు గారమ్మాయివా అని అడుగుతారు" ఆమె మనసులో జవాబు దొరకని ప్రశ్నలెన్నో!

★ ★ ★

రమ్య క్లాసులో ఆఖరి బెంచీలో కూర్చుని ఉంది. ఫిజిక్స్ లెక్చరర్ చెబుతున్న పాఠం ఆమె చెవికి ఎక్కడం లేదు. కళ్ళ ముందు తల్లి డైరీ కనిపిస్తోంది.

"నువ్వు కామేశ్వర్రావు గారమ్మాయివా? " చెవులలో ఎవరో అడుగుతున్నారు.

ఆ పీరియడ్ పూర్తయి లెక్చరర్ వెళ్ళిపోయినా, ఆమె అలాగే కూర్చుని ఉంది.

తరువాత లెక్కల క్లాసు.

లెక్చరర్ ట్రిగ్నామెట్రీలో సమ్స్ ఎక్స్‌ప్లెయిన్ చేస్తోంది. రమ్య మనసు డైరీలోని వాక్యాల చుట్టు పరిభ్రమిస్తున్నది.

"ఏం చేస్తున్నావ్ రమ్యా! నిద్రపోతున్నావా? " ఖంగున మోగిన లెక్చరర్ స్వరంతో ఉలిక్కిపడి తల తిప్పింది. క్లాసు మొత్తం తలలు తిప్పి ఆమెవైపు చూసారు.

రమ్య సిగ్గుపడి లేచి నిలబడింది.

"లేదు మేడమ్! లెక్కలు వింటున్నాను"

"వింటున్నావా? చెయ్యడం లేదా? "

"చే... చేస్తున్నాను మేడమ్!" తడబాటుగా అంది.

లెక్చరర్ రమ్య డెస్కు దగ్గరకి వచ్చి చూసింది. ఆమె ముందున్న ఖాళీ నోట్సు వైపు ముడివడిన భ్రుకుటితో చూస్తూ అడిగింది.

"ఎక్కడ చేసావ్? "

రమ్య కళ్ళలో నీళ్లు రాలాయి. దొంగతనం చేస్తూ పట్టుబడిన వ్యక్తిలా, సిగ్గు, అవమానం, దుఃఖం ఒక్కుమ్మడిగా కలిగాయామెకి.

"ఒంట్లో బాగా లేదు మేడమ్" నల్లబడిన ముఖాన్ని దించుకుంటూ అంది.

"ఓకే! వెయిటింగ్ రూమ్‌కి వెళ్ళి రెస్టు తీసుకో!"

రమ్య క్లాసు మధ్య నుంచి తల వంచుకుని వెళ్ళిపోయింది.

★ ★ ★

"మార్కులెందుకు తక్కువ వచ్చాయి నీకు? ఇదివరకు ఎలా చదివేదానివి? ఎప్పుడూ క్లాసు ఫస్టున ఉండేదానివి. ఏమయింది నీకు? " ప్రభ ఆశ్చర్యంగా కూతురి ప్రోగ్రెస్ కార్డు చూస్తూ అడిగింది.

రమ్య ఏడుస్తోంది.

"ఏమయిందమ్మా? కాలేజీలో చెప్పే పాఠాలు అర్థమవడంలేదా? పోనీ ట్యూషన్ పెట్టించనా? "

"అసలు నాకు పాఠం వినబుద్ధికావడంలేదమ్మా"

"ఎందుకని? "

## కొత్తగాలి...

**అవినీతికి**
**మధుమేహం ఉండొచ్చు**
**లేకుంటే**
**ఇంత ఆకలి ఎక్కడిది?**

*– సంబరాజు రవి ప్రకాశరావు, నాగర్‌కర్నూల్*

"నన్ను అందరూ కామేశ్వర్రావు గారమ్మాయివా అని అడుగుతుంటే నాకు సిగ్గేస్తోందమ్మా"

ప్రభ ముఖం ఎర్రబడింది.

"దానికీ, నీకు మార్కులు తక్కువ రావడానికి సంబంధం ఏవిటి"

"నాకు ఊహ తెలిసిన దగ్గర నుంచి అందరూ ఇదే ప్రశ్న అడుగుతున్నారు. నాకు చాలా సిగ్గేస్తోందమ్మా! చాలా అవమానంగా కూడా వుంది. ఏవేవో పిచ్చి ఆలోచనలు వస్తున్నాయి. అందుకే చదువు మీద దృష్టి పెట్టలేకపోతున్నాను. నాకసలు కాలేజీకి వెళ్ళాలనిపించడంలేదు"

నారాయణరావు చదువుతున్న పేపరులోంచి తల ఎత్తి కూతురివైపు చూస్తున్నాడు. కూతురి ముఖం చూస్తే ఆమె ఎంత అవమానంతో దిగ్గుళ్ళి పోతున్నదీ అర్థమయిందతనికి.

"అయినా నేను, స్వప్న ఒకే పోలికలతో ఎందుకు వుంటాం? అందరూ అనుకుంటున్నట్టు నేను నిజంగానే కామేశ్వర్రావు బాబాయి కూతురినా? "

సూర్యకాంతమ్మ "ఇలా రా అమ్మలూ" అని పిలిచింది మనుమరాలిని.

రమ్య ఆవిడ దగ్గరకి వెళ్ళింది. ఆవిడ ఆమెని దగ్గరకి తీసుకుంటూ అనునయంగా అంది.

"నువ్వు, స్వప్న ఒకే పోలికలతో ఎందుకు వున్నారో తెలుసా? మీ నాన్న, కామేశ్వర్రావు బాబాయి అన్నదమ్ముల పిల్లలు. అదే కజిన్స్ కాబట్టి. వాళ్ళిద్దరూ ఒకే పోలికలతో వున్నారు కాబట్టి. వాళ్ళ పిల్లలైన మీక్కూడా వాళ్ళ పోలికలే వచ్చాయి. చిన్నప్పుడు మీ నాన్నని కామేశ్వర్రావు, బాబాయిని కూడా కవల పిల్లలనుకునేవారు. వయసు వచ్చాక ఎండలో తిరగడం వలన మీ నాన్న నల్లబడిపోయాడు కాని, లేకపోతే వాడిదీ పసిమి ఛాయే! ఎవరో ఏదో అన్నారని ఆ మాటలని మనసుకి పట్టించుకోకు. వెళ్ళి చదువుకో"

రమ్యకి అయోమయంగా వుంది. 'తల్లి డైరీ... నాయనమ్మ మాటలు ఈ రెండింటిలో ఏది నిజం? ఏది అబద్ధం? '

★ ★ ★

కామేశ్వర్రావు రాత్రి పదకొండు గంటలకి ఇంటికొచ్చాడు. తలుపు తీసిన సీత చిరునవ్వుతో అడిగింది, "ఇవాళ ఇంత ఆలస్యమయిందేం? "

"స్టాక్ వెరిఫికేషన్... మధ్యలో ఫోన్ చెయ్యడానికి కూడా తీరిక లేదు"

"స్నానం చేసిరండి. భోజనం చేద్దురుగాని"

అతను చేతిలోని బ్యాగ్ ఆమెకి అందించాడు. అంతవరకు హాలులో కూర్చుని చదువుకుంటున్న స్వప్న తండ్రిని చిరునవ్వుతో పలుకరించి గదిలోకి వెళ్ళిపోయింది.

కామేశ్వర్రావు స్నానంచేసి వచ్చేప్పటికి సీత డైనింగ్ టేబిల్ దగ్గర ఎదురుచూస్తోంది. అతను కూర్చోగానే కంచంలో అన్నం వడ్డించింది. ఇద్దరూ భోజనం చేస్తున్నారు. మధ్యలో "కూర మరి కాస్త వేసుకోండి. పచ్చడి కొంచెం వెయ్యనా? " అని అడుగుతోందామె. ఆకలి కరకరలాడుతోందేమో కడుపునిండా తిన్నాడతను. సీతది పిట్ట తిండి. ఇంటెడు పని అవలీలగా

చేస్తూ కూడా అంత కొంచెం తిని ఆమె ఎలా బతుకుతోందో కామేశ్వర్రావుకైతే అర్థంకాదు.

ఆమె గిన్నెలు సర్ది టేబిల్ క్లీన్ చేస్తుంటే అతను వక్కపొడి నములుతూ టి.వి. రిమోట్ చేతిలోకి తీసుకున్నాడు. దూరదర్శన్ తప్ప ఏ ఛానల్ రావడంలేదు.

"కేబుల్ కనెక్షన్ తీయించేసాను" సీత అతను అడక్కముందే చెప్పింది.

"ఏం? "

"ఈ ఏడాది స్వప్నకు ఎమ్ సెట్, చెందూకి టెన్త్‌క్లాస్ పరీక్షలు. వాళ్ళు డిస్టర్బ్ అవుతారు"

"సర్లే!" అతను టి.వి. ఆఫ్ చేసి గదంతా పచార్లు చేసాడు. సీత వంటింట్లో లైటార్పి, బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది. హాలు తలుపులు సరిగ్గా లాక్‌చేసిందో లేదో మరోసారి చూసి తను కూడా బెడ్ రూమ్‌లోకి వెళ్ళాడు.

సీత బెడ్ పక్కనే బొంత పరచుకుని పడుకుని వుంది. ఎండాకాలమైనా, చలి గజగజవణికిస్తున్నా ఆమె మంచంమీద పడుకోదు. అది కొన్నేళ్ళ నుంచి జరుగుతోంది. అతను మంచంమీద ఒత్తిగిల్లి పడుకున్నాడు. కడుపులోని ఆకలి తీరింది. మనసులోని ఆకలి అలాగే వుంది. కొన్నేళ్ళ నుంచి అణచుకుంటున్న ఆకలి అది. ఇద్దరు పిల్లల తల్లయినా నలభైఏళ్ళ వయసుతో, తీరైన శరీర సౌష్ఠవంతో రెచ్చగొడుతోందామె. ఎదురుగా క్షీరాన్నం వున్నా తినలేని షుగర్ పేషెంటయిపోయాడు తను.

"సీతా!" అప్రయత్నంగానే పిలిచాడు.

"మంచినీళ్ళ జగ్ పక్కనే టీపాయ్ మీద వుంది"

"అది కాదు"

ఆమె మౌనంగా అటు వత్తిగిల్లి పడుకుంది. కామేశ్వర్రావు ఇంక ఆగలేకపోయాడు. చీరకట్టుకి, జాకెట్టుకి మధ్య కనిపిస్తున్న నెలవంక లాంటి నడుముని తాకబోయాడు. వణుకుతున్న అతని చేతివేళ్ళు అసంకల్పితంగానే ఆగిపోయాయి.

అతని చేతివేళ్ళ కొసల నుంచి అగ్నికణాలు తన శరీరంలోకి ప్రసరిస్తున్న అనుభూతితో ఆమె చివాలున లేచి కూర్చుంది. ఆమె చూపులోని తీవ్రతకి అతను ఉలిక్కిపడ్డాడు. ఆ చూపులకే శక్తి వుంటే తను భస్మమైపోయివుండేవాడేమో!

అతను గతుక్కుమని మంచానికి బాగా చివరకి జరిగిపోయి పడుకున్నాడు. కొన్నేళ్ళ కిందట తన తప్పు బయటపడ్డ రోజు భార్య ఏహ్యతని, తిరస్కారాన్ని ప్రకటిస్తూ తనని హెచ్చరించడం గుర్తొచ్చింది.

"నన్ను ముట్టుకుంటే కిరసనాయిలు పోసుకుని కాల్చుకుని చస్తాను"

"... నన్ను క్షమించలేవా సీతా? "

"అదే తప్పు నేను చేస్తే మీరు క్షమిస్తారా? "

"పరిస్థితులనిబట్టి క్షమించేవాడినేమో!"

ఆమె పొందుకోసం అణువణువు తపిస్తుంటే అప్పటికి తోచిన జవాబేదో ఇచ్చాడు.

"ఆదర్శమా? అవకాశవాదమా? " వ్యంగ్యంగా అడిగింది.

"మొదటిదే కరెక్టు"

"నీతినియమాలు, వావివరుసలు లేని పశువ్వి నువ్వు. నీకు ఆదర్శం అనే పదాన్ని ఉచ్చరించే అర్హత కూడా లేదు."

"నేను పొరపాటు చేశాను. ఒప్పుకుంటున్నాను"

"తెలిసి చేసిన తప్పును పొరపాటు అనరు. ఘోరం అంటారు" పదునుగా అంది.

"మరోసారి ఏ ఆడదాన్ని కన్నెత్తి కూడా చూడను. ఒట్టు. నన్ను కనికరించు"

"మనం లోకం దృష్టిలో మాత్రమే భార్యాభర్తలం. అంతకుమించి మన మధ్య ఏమీ

లేదు. నీ ఇంట్లో ఈ గదిలో నీతో కలిసి, ఎందుకు వుంటున్నానంటే, లోకం కోసం! పిల్లల దృష్టిలో నీ స్థానం దిగజారకుండా వుండాలంటే నీ హద్దులని అతిక్రమించకు. అతిక్రమిస్తే నేనెంతకైనా తెగిస్తాను"

కామేశ్వర్రావు మ్రాన్పడిపోయాడు. కొర కరాని కొయ్యలాంటి ప్రభపై గెలిచాడు. భార్య చేతిలో చిత్తుగా ఓడిపోయాడు. తను గెలిచాడా? ఓడిపోయాడా?

భార్యనుంచి ఎదురైన ఈ తిరస్కారంతో అతని మనసు మండిపోతోంది. నాతిగల బ్రహ్మచర్యం అతనికి దుర్భరంగా వుంది. తను తలచుకుంటే డబ్బు వెదజల్లి సుఖా లని కొనుక్కోగలడు. కానీ ఆడపులిలాంటి సీత తన గుడ్లు పీకేస్తుంది. తన గొంతు కొరికి రక్తం తాగేస్తుంది. ఎప్పటికైనా ఆమె మనసు మారకపోతుందా అనే ఆశ తోనే ఇన్నేళ్లు గడిపాడు. కాని ఆమె మనసు కరగలేదు. ఆమెకి తనకి మధ్య వున్న దుర్భేద్యమయిన ఇనుపతెర అలాగే వుండిపోయింది. ఆమె తనని శిక్షిస్తోంది, తనని తాను శిక్షించుకుంటోంది. కామేశ్వర రావు అశాంతిగా నిట్టూర్చాడు.

★ ★ ★

"తను అందరూ అనుకుంటున్నట్టు కామే శ్వర్రావు బాబాయి కూతురేనా? అమ్మ డైరీలో రాసుకున్నట్టు, తనని పెంచు కుందా? అసలు బాబాయ్ కుటుంబానికి, తమ కుటుంబానికి రాకపోకలు లేవెందు కని? స్వప్న తనకి కజిన్ అవుతుందని తనకి పదేళ్ళ వయసు వచ్చేదాకా తెలియనే తెలియదు. స్వప్న తను ఒకే స్కూల్‌లో చదివినా, ఇప్పుడు ఒకే కాలేజీలో చదువు తున్నా అది తనతో మాటే మాట్లాడదు. ఒకటి రెండుసార్లు తను మాట్లాడాలని ప్రయత్నించినా స్వప్న ముఖం తిప్పుకుని వెళ్లిపోయేది. అప్పటినుంచి తామిద్దరూ అపరిచితుల్లాగే వుండిపోయారు. అది వేరే విషయం. అసలు స్వప్న తను ఒకే పోలికలతో ఎందుకున్నారు? " రమ్య ఆలో చిస్తోంది.

"అమ్మలూ!" మనుమరాలి చేతిలో పుస్తకం వున్నా ఆమె చూపు మాత్రం ఎటో వుండటం గమనించి పిలిచింది సూర్యకాం తమ్మ.

రమ్యకి ఆ పిలుపు వినబడలేదు.

"రమ్యా!" ఆవిడ భుజం తట్టి పిలిచింది.

ఉలికిపాటుగా చూసింది.

"చదువుకోకుండా ఏవిటాలోచిస్తు న్నావ్? "

"బామ్మా! మరి కామేశ్వర్రావు బాబాయ్ ఎప్పుడూ మన ఇంటికి రాడేం? మనమూ వాళ్ళింటికి వెళ్ళం. ఎందుకని? "

మనుమరాలి నుంచి ఇలాంటి ప్రశ్న ఎదురవుతుందని ఊహించని ఆవిడ ముఖం వెలవెలబోయింది.

ఏం జవాబివ్వాలో తెలియలేదు.

"చెప్పు బామ్మా!" రెట్టించింది.

"మీ నాన్నకి, బాబాయికి వ్యాపారంలో ఏవో గొడవలు వచ్చాయి"

"ఏమిటా గొడవలు? "

"రమ్యా! నువ్వీ మధ్య చదువుపై శ్రద్ధ చూపించడంలేదు. చిన్నపిల్లవి. పెద్ద విష యాల జోలికి వెళ్లకుండా చదువుకో!" సూర్యకాంతమ్మ గంభీర స్వరంతో ఆదే శించి అక్కడినుంచి వెళ్ళిపోయింది.

"నిజమే! తనీ మధ్య శ్రద్ధగా చదవడం లేదు. చదువుకోవాలి" అనుకుంటూ రమ్య పుస్తకం తెరిచింది. కళ్ళు అక్షరాల వెంట యాంత్రికంగా పరుగు పెడుతున్నాయే గాని, బుర్రలోకి ఒక్క అక్షరం కూడా ఎక్క డంలేదు.

"నువ్వు కామేశ్వర్రావుగారమ్మాయివా? " ఎవరో అడుగుతున్నారు హేళనగా, వెక్కి రింతగా. 'ఛీ ఛీ' రమ్య పుస్తకాన్ని విసిరి కొట్టి చేతుల మధ్య ముఖమానించి

స్తబ్దంగా కూర్చుంది.

'ఏదో రహస్యం వుంది' తల్లి, నాయనమ్మ తననుంచి దాస్తున్నారు. ఆమెలో తల్లి డైరీని చదవాలనే కోరిక క్షణక్షణానికి తీవ్రతరమయింది.

ఆమె గది బయటకొచ్చి చూసింది.

వీధిలో ఫ్రెండ్స్‌తో హరి క్రికెట్ ఆడుతున్నాడు. తల్లి వంటగదిలో బిజీగా వుంది. నాయనమ్మ పూజగదిలో వుంది.

తల్లి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి బీర్వా తెరిచి లాకర్‌లోనుంచి డైరీ తీసింది. తలుపు తాళంవేసి తాళాలని యథాస్థానంలో పెట్టేసింది. తన గదిలోకి వెళ్ళి తలుపు మూసుకుని డైరీ తెరిచింది.

రమ్య చిన్నప్పటినుంచి ఇంగ్లీషు మీడియంలో చదువుకున్నా ఆమెకి తెలుగు భాషపై పట్టు వుండడానికి కారణం సూర్యకాంతమ్మలోని సాహిత్యాభిలాషే.

'మనం ప్రపంచంలోని ఏ భాష నేర్చుకున్నా, మాతృభాషని మరచిపోకూడదు, మాతృభాషని మరచిపోతే కన్నతల్లిని మరచిపోయినట్టే' అనేది. తెలుగులో సుప్రసిద్ధ రచయితల పుస్తకాలని తను చదువుతూ రమ్య చేత చదివించేది.

ముత్యాల సరాల్లాంటి అక్షరాలతో వున్న ఆ డైరీని చదువుతోంది రమ్య. తనా డైరీని చదవడంవల్ల కొందరి జీవితాలు తలక్రిందులవుతాయని ఆమెకి తెలియదు.

ప్రభకి రమ్యని చూస్తే ఆందోళనగా వుంది. చేతిలో పుస్తకం పట్టుకున్నా అది చదువుపై దృష్టిని లగ్నం చెయ్యడంలేదు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వుంటోంది. చిన్నప్పటినుంచి ఎప్పుడూ క్లాసు ఫస్టున వుండే పిల్లకి ఇప్పుడు అత్తెసరు మార్కులొస్తున్నాయి. రమ్య ఎందుకని చదువుపై దృష్టి లగ్నం చెయ్యలేకపోతోంది?

"నన్ను అందరూ కామేశ్వర్రావు గారమ్మాయివా అని అడుగుతుంటే, చాలా సిగ్గేస్తోందమ్మా! చాలా అవమానంగా వుంది. అందుకే చదువుపై దృష్టి పెట్టలేకపోతున్నాను. నాకసలు కాలేజీకి వెళ్ళాలని లేదు" కొద్ది రోజుల కిందట రమ్య ఏడుస్తూ చెప్పిన జవాబు గుర్తొచ్చింది. ప్రభ కళ్ళు తడి తేలాయి. రమ్య పసిమనసు ఎంత క్షోభననుభవిస్తోందో అర్థమైన ఆమె మనసులో ముల్లు గుచ్చినట్టయింది.

ఆమె దృష్టి అప్రయత్నంగా హాలులో కూర్చున్న అత్తగారి వైపు మళ్ళింది. సూర్యకాంతమ్మ మహాభారతం చదువుతోంది. మహాభారతం ఆవిడకి ఆదర్శ గ్రంథం. ఆమె పెదవులపై వ్యంగ్యపూరితమైన నవ్వు కదలాడింది.

గుడిలో అర్చనలు, ఇంట్లో పూజలు, ఉపవాసాలు చేస్తూ పైకి పరమ భక్తురాలిలా కోడలిని కూతురిలా ప్రేమించే అత్తగా కనిపించే అత్తగారిలో మరో మనిషి దాగి ఉంది. ఆ మనిషికి వావివరుసలు లేవు. నీతి నియమాలసలే లేవు. తన జీవితంలో చెలరేగిన కల్లోలానికి ఆవిడ కారణం కాదూ? ఆవిడ కారణంగా తన జీవితంపై పడిన మచ్చ ఎప్పటికైనా చెరిగిపోయేదేనా?

ఆవిడ వల్ల తను పొందిన అవమానాన్ని గరళంలా మింగి, ఆవిడపై తనకి వున్న ఏహ్యత తిరస్కారాలను గుండెల్లో దాచుకుని, ఆవిడని గౌరవిస్తోందంటే అందుకు కారణం తన భర్తే.

అతను తనకి సంసార సుఖాన్ని ఇవ్వలేకపోయినా అనుక్షణం తన సుఖసంతోషాల కోసం తపించిపోతాడు. తన పిల్లలకి తండ్రిగా నిలబడిన అతని ఔన్నత్యం, మచ్చలేని అతని వ్యక్తిత్వం. వైవాహిక జీవితంలో సెక్స్ ఒక భాగమే తప్ప, అదే జీవితం కాదని తెలుసుకున్నది అతని సాహచర్యంలోనే. తనకేదో అన్యాయం జరిగిపోయిందనే భావం ఆమె మనసులో

సమూలంగా తుడిచిపెట్టుకుని పోయింది. అతన్ని అమె మనస్ఫూర్తిగా ప్రేమించడమే కాదు, జన్మజన్మలకి అతనే తన భర్త కావాలని కోరుకుంటుంది.

★ ★ ★

డైరీని చదవడం పూర్తిచేసిన రమ్య కళ్లు వెడల్పవుతున్నాయి. ఆమె బాధావమానాలతో, దుఃఖంతో కంపించిపోతున్నది.

"నా భర్త నపుంసకుడు. సంసార జీవితానికి అనర్హుడు అనే నిజం నా మనసుని ముక్కలు చేస్తోంది"

"కామేశ్వర్రావు వల్ల నాకు సంతానం కలగాలని మా అత్తగారి కోరిక"

"కామేశ్వర్రావు పిల్లలకి నేను తల్లినయ్యాను" అనే వాక్యాలను మళ్ళీ మళ్ళీ చదువుతున్న రమ్య మనసు పోటెత్తిన సముద్రంలా వుంది.

తన తండ్రి నారాయణరావు కాడనే నిజాన్ని ఆమె తట్టుకోలేకపోతోంది. ఆమె వెక్కివెక్కి ఏడుస్తోంది. తనింతగా ప్రేమిస్తున్న, తనని ఇంతగా ప్రేమిస్తున్న తండ్రి తన తండ్రి కాదు. నాయనమ్మ, తల్లి, తండ్రి అంతా కలిసి తనని ఎంత నమ్మించారు!

"రమ్యా!" తలుపు తట్టిన శబ్దంతోపాటు తల్లి పిలుపు వినిపించింది. ఆమె నిటారుగా అయింది.

"రమ్యా! వంట పూర్తయింది. భోజనానికి రామ్మా.. నువ్వు బ్రేక్‌ఫాస్ట్ సరిగ్గా తినలేదు"

జవాబుగా రమ్య అరిచింది "నేను తినను"

"రామ్మా! నా తల్లి కదూ!" తల్లి స్వరంలో లాలన.

రమ్య ఈసారి జవాబివ్వలేదు.

"తలుపు తియ్యక్కా" తమ్ముడి పిలుపు.

"నేను అన్నం తినను" రమ్య అరిచింది.

ప్రభ ముఖం మ్లానమయింది. ఆమె గుండె దడదడలాడుతోంది.

"అక్క తర్వాత తింటుందిలే! నీకు ఆకలేస్తోందన్నావుగా? పద, నీకు పెట్టేస్తాను" అంది పైకి మామూలుగా ఉండడానికి ప్రయత్నిస్తూ.

తల్లీ తమ్ముడు అక్కడ నుంచి వెళ్ళిపోయిన సూచనగా వాళ్ళ మాటలు దూరంగా వినిపించాయి.

రమ్యకి మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చింది.

★ ★ ★

ప్రభ తలుపు తట్టి, కూతుర్ని బతిమాలినా ఆమె తలుపు తెరవలేదు.

"రమ్య ఏది? " షాపు నుంచి ఆ రోజు కొంచెం ఆలస్యంగా ఇంటికొచ్చిన నారాయణరావు అడిగాడు.

అసలు గదిలో నుంచి బయటకి రాలేదు. పొద్దుటి నుంచి ఏమీ తినలేదు. నేనెంత బతిమాలినా తలుపు తియ్యలేదు. ప్రభ ఆందోళనగా అంది.

అతను కూతురి గది తలుపు తట్టి పిలిచి ఆమె బదులివ్వకపోవడంతో కంగారుపడి కిటికీ దగ్గరకి వచ్చాడు. అదృష్టవశాత్తు కిటికీ తలుపు తెరిచే ఉంది.

మంచంమీద కూర్చుని ఏడుస్తున్న రమ్యని చూసేటప్పటికి హృదయం ద్రవించిపోయింది. ఆందోళనగా పిలిచాడు.

"రమ్యా! తలుపు తియ్యమ్మా! నా బంగారు తల్లివి కదూ!" అతను చాలా సేపు బతిమాలాక తలుపు తీసింది.

"ఏమయిందమ్మా? ఎందుకు ఏడుస్తున్నావ్? "

రమ్య నీళ్ళు నిండిన కళ్లతో అతని ముఖంలోకి చూస్తోంది.

అతని ముఖంలోని ఆత్రుత, ఆందోళనల వెనుక తనపై వ్యక్తమవుతున్న ప్రేమ.... ఇతను తన తండ్రి కాదంటే ఎలా నమ్మడం?

కూతురు చెంపలు, నుదురు పట్టి

చూస్తూ అడిగాడు, "మధ్యాహ్నం భోజనం చెయ్యలేదుట. ఒంట్లో బాగాలేదా? "

తల్లి డైరీలో ఆమె రాసిన ఆమె గతం... తను కామేశ్వర్రావు కూతురనే నిజం... ఇతను తన తండ్రి కాడనే చేదు నిజం... రమ్య అణువణువులోనూ తిరస్కారం... ఏహ్యతాభావం.

"నన్ను కాస్సేపు ఒంటరిగా వదిలెయ్యి"

"ఏమయింది తల్లీ! నాతో చెప్పు"

"... నన్ను విసిగించకు... అవతలకి వెళ్ళు!"

"ఏం జరిగిందమ్మా? నాన్నని నాతో చెప్పకూడదా? "

అతని నోట్లోంచి నాన్న అనే పదాన్ని వినగానే రమ్య కళ్ళు ఎర్రబడ్డాయి.

"నన్ను బయటకి వెళ్ళమంటావా? నువ్వు వెళ్తావా? " రౌద్రంగా అరిచింది.

హతాశుడైన నారాయణరావు బయటకి నడిచాడు. తన వెనుక రమ్య తలుపు ధడాల్న మూసెయ్యడం గమనించి అతను నివ్వెరపోయాడు. ఆ రాత్రి, ఆ ఇంట్లో ఎవరూ భోజనం చెయ్యలేదు.

కూతురిలో ఇదివరకెప్పుడూ లేని మొండితనాన్ని, నిరసనని చూసి, "ఏం జరిగింది? దాని మనసు అంతగా గాయపడడానికి కారణమేమిటి? అని వ్యాకులమైన మనసుతో ఆలోచిస్తోంది ప్రభ.

★ ★ ★

"ప్రభా!" పరధ్యాసగా వున్న ఆమె ఆ పిలుపుతో ఉలిక్కిపడింది. ముందు తనని కాదేమో అనుకున్నా మళ్ళీ అదే పిలుపు వినబడడంతో వెనక్కి తిరిగింది. ఎదురుగా రమ్య. క్షణం నివ్వెరపోయినా, మరు క్షణం నవ్వొచ్చింది. రెండేళ్ళ వయసులో ఎవరు ఏం మాట్లాడినా అనుకరిస్తూ ముద్దులు మూటగట్టే రమ్య ఆమె కళ్ళ ముందు మెదిలింది.

'ప్రభా!' అని అత్తగారు పిలిచినా, భర్త పిలిచినా ఇలాగే కదూ పిలిచేది.

ఆ క్షణాన రమ్య అప్పటి రెండేళ్ళ పసిదానిలా కనిపిస్తుంటే ముద్దొచ్చింది.

'ఏమిటమ్మా' ఆమె స్వరంలో సృష్టిలోని మమకారం, అనురాగం ప్రోదిచేసి వున్నాయి.

"నిన్ను పేరు పెట్టి ఎందుకు పిలిచానో తెలుసా? అమ్మా అని పిలవడానికి అసహ్యం వేసి" రమ్య స్వరం కొరడా ఝుళిపింపులా వుంది.

ప్రభ ముఖం పాలిపోగా "రమ్యా!" అంది విచలిత స్వరంతో.

"అవును. నాకు నువ్వంటే అసహ్యం! నిన్ను అమ్మా అని పిలవాలంటే అసహ్యం!" కక్షగా అంది.

ప్రభ శరాఘాతం తిన్న వ్యక్తిలా అయింది.

"రమ్యా!" అని ఎలాగో అనగలిగింది.

"అంతేకాదు నా తండ్రి స్థానంలో వున్న నారాయణరావుగారిని 'నాన్నా' అని పిలవలేను. ఆ విషయం ఆయనతో చెప్పు"

"ఏమిటే నువ్వు మాట్లాడేది? "

రమ్య వ్యంగ్యంగా నవ్వి చేతిలోని డైరీని ఎత్తి ఆమెకి కనబడేలా పట్టుకుంది.

"నాకేమీ తెలియదనుకుంటున్నావా? నాకు అంతా తెలుసు. నువ్వు దాచాలనుకుంటున్న విషయం బయట పడిపోయింది. కాదు అదృష్టవశాత్తు తెలుసుకున్నాను"

వెయ్యి ఓల్టుల షాక్ తగిలినట్టు స్తంభించిపోయింది ప్రభ.

"అది తన డైరీ... రమ్య చదివిందా? దాని జన్మ రహస్యాన్ని తెలుసుకుందా? " ఆమె అవాక్కయింది.

"నువ్వు నాకు జన్మనిచ్చిన తల్లివి. నాజన్మ కారకుడైన తండ్రి కామేశ్వర్రావు. నారాయణరావు లోకం దృష్టిలో నా తండ్రి. ఓహ్! నేనెంత అదృష్టవంతురాలిని!

ఇద్దరు తండ్రులున్నారు నాకు"

"రమ్యా!" ప్రాణానికి పాశంలాంటిది వేసి లాక్కెళ్తున్నట్టు విలవిలలాడింది ప్రభ.

"నీకు... నీకేం తెలుసని ఇలా మాట్లాడుతున్నావ్, చిన్నపిల్లవి..." ఇంకా ఏదో అనబోతున్న ఆమెని మధ్యలోనే అడ్డుకుంది రమ్య.

"నాకు అంతా తెలుసు. నేను నువ్వనుకున్నంత చిన్న పిల్లనేమీ కాదు. నువ్వు కామేశ్వర్రావుతో తప్పు చేశావు."

ఏదో టి.వి. సీరియల్‌లో పదహారేళ్ల పిల్ల తల్లిని అలాగే నిలదీస్తుంటే అలాంటి ముదురు డైలాగులు రాసిన ఆ సీరియల్ రైటర్ని కసిగా తిట్టుకున్న ప్రభ ఇప్పుడు రమ్య నోటివెంట వినవస్తున్న ఈ మాటలకి మ్రాన్పడి నిలబడిపోయింది.

"నేను అనాథనని జాలిపడి నువ్వు పెంచుకుంటున్నావని తెలిసినా నేనింత బాధపడేదాన్ని కాదు. నా జన్మ ఇంత నీచమైనదని తెలిసాక నా పుట్టుక మీద అసహ్యం వేస్తోంది. నీ కడుపున పుట్టినందుకు సిగ్గుతో తల బద్దలు కొట్టుకుని చావాలనిపిస్తోంది" రమ్య ఛీత్కరిస్తూ చేతిలోని డైరీని తల్లి ముందుకి విసిరి అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

ప్రభకి తన చుట్టూ వున్న ప్రపంచమంతా గిరగిర తిరిగిపోతున్నట్టుంది.

"రమ్యకి నిజం తెలిసిపోయింది. ఇప్పుడెలా? దాని కళ్ళలో తనపై వ్యక్తమవుతున్న ఏహ్యత, తిరస్కారాలని తను భరించగలదా?" ఆమెకి గుండెనెవరో ఇనుప పిడికిలితో నిర్దాక్షిణ్యంగా పెకిలిస్తున్నట్టుంది.

ఆమె వంగి డైరీని చేతులలోకి తీసుకుంది. "అసలు ఈ డైరీ రమ్య చేతులలోకి ఎలా వచ్చింది?" ఆలోచనలతో కణతలు బద్దలయిపోతున్నాయి. హఠాత్తుగా ఆమెకి గుర్తొచ్చింది రమ్య పుట్టినరోజునాడు ఆమె

## కొత్తగాలి...

**వానలు రాక**
**కన్నీళ్లు!**
**వరదలు వచ్చీ**
**కన్నీళ్లు**

– బోడపాటి కృష్ణవేణి, చెన్నై

గొలుసు అడగడం, తను బీర్వాలో నుంచి తీసుకోమన్న విషయం.

"తన అంతరంగానికి అక్షర రూపమైన ఈ డైరీ... ఎవరి కంట పడకూడదనుకుందో, ఎవరి నుంచి దాచాలనుకుందో ఆ వ్యక్తి కంటపడనే పడింది. నిజం తెలిసిన రమ్య ఏమయిపోతుంది?" ప్రభ మొదలు నరికిన వృక్షంలా కూలబడిపోయింది.

★ ★ ★

ప్రభ చెప్పిన విషయం విని నిర్విణ్ణుడయ్యాడు నారాయణరావు.

"నువ్వు చెబుతున్నది నిజమేనా?" కొద్దిసేపటి తర్వాత తేరుకుని అడిగాడు.

"రమ్య మన దృష్టిలో చిన్నపిల్లే అయినా అది మానసికంగా చాలా ఎదిగిపోయింది. నిజం తెలుసుకుని నన్ను నిలదీసింది. ఆ పసిదాని ముందు నేను దోషినయ్యాను" ప్రభ ఏడుస్తోంది.

నారాయణరావు ఊరడింపుగా ఆమె భుజం మీద చెయ్యివేసాడు.

"నేను నా గురించి బాధపడడం లేదండీ! నిజం తెలిసి అది ఎలా తట్టుకుంటుందా అని"

"అసలు నిజమెలా తెలిసింది దానికి?"

సమాధానంగా డైరీ అతని ముందు వుంచింది.

"నాకు డైరీ రాయడం ఎప్పుడూ అలవాటు లేదు. కాని మన పెళ్ళయిన తొలి రోజులలో నేనేదో కోల్పోయాననే అసంతృ

## చతుర 'వివేకం'

**వివేకానందుడి జయంతి ఈనెల 12న. భారత జాతిలో ఆత్మాభిమానాన్ని నింపిన ఆ మహనీయుని చతురోక్తులు కొన్ని..**

### విశేషమేమిటో!



మిత్రులతో భోంచేస్తున్నారు వివేకానంద స్వామి. 'నీకో విషయం తెలుసా?' అని పక్కనున్న వ్యక్తిని అడిగారు. 'ఏమిటేమిటి?' అంటూ ఆత్రం చూపాడతను. 'అదే చెప్తున్నా. ఈసారి గుడ్‌ఫ్రైడే ఆదివారం వస్తోంది' అన్నారు. 'అందులో విశేషమేముందీ?' అన్నాడతను వెంటనే. అందరూ ఒక్కసారిగా ఫక్కుమనేసరికి, తప్పు గ్రహించి నాలిక్కరుచుకున్నాడా మిత్రుడు!

ప్తితో నా మనసులోని ఆవేదనకి అక్షర రూపం కల్పించాను. అది దాని కంట పడింది"

నారాయణరావు ముడివడిన భ్రుకుటితో ఆ డైరీని తిరగేస్తున్నాడు.

'కామేశ్వర్రావు పిల్లలకి నేను తల్లినయ్యాను' అనే వాక్యంతో ముగిసింది ఆ డైరీ.

"థ్యాంక్ గాడ్! అసలు నిజం రమ్యకి తెలియలేదు. ఎప్పటికీ తెలియకూడదు" అన్నాడతను సంతృప్తిగా ఊపిరి పీలుస్తూ.

ప్రభ మనసులో అంత విషాదంలోనూ చిన్న ప్రశాంతత. అసలు నిజం రమ్యకి తెలియలేదు అనే సంతృప్తి. కాని కళ్ళ ముందు రమ్య ముఖం, ఆ కళ్లలోని ఏవగింపు గుర్తుకొస్తే ఆమె మనసులో దావానలంలాంటి బాధ.

★ ★ ★

"ఓసి దొంగభడవా! మీ అమ్మని పేరు పెట్టి పిలుస్తావేమిటే" సూర్యకాంతమ్మ చిరుకోపంగా మనుమరాలిని చూస్తూ అడిగింది. రమ్య తల్లిని 'ప్రభా' అని పిలవడం విని ముందు తను పొరపాటు పడిందేమో అనుకుంది. ఒకసారి కాదు, రెండు మూడుసార్లు అలాగే పిలవడంతో ఆశ్చర్య పడింది. ఇంక వుండబట్టలేక మందలిస్తున్న ధోరణిలో అడిగేసింది.

"అమ్మా అని పిలిపించుకునే అర్హత ఆమెకి లేదు. అలా పిలవాలంటే కంపరంగాను, అసహ్యంగాను వుంది" రమ్య నిరసనగా అంది.

"అమ్మలూ!" షాకింగ్‌గా వుందావిడ స్వరం.

"ఏమిటే, పెద్దంతరం, చిన్నంతరం లేకుండా ఆ మాటలు?"

రమ్య నిర్లక్ష్యంగా తల ఎగరేసి అప్పుడే అక్కడికి వచ్చిన నారాయణ రావుని "అంకుల్! నోట్ బుక్స్ కొనుక్కోవాలి. డబ్బివ్వండి" అంది.

"అంకులా?" నివ్వెరపోయింది సూర్యకాంతమ్మ. ప్రభ, నారాయణరావు మ్లానమైన ముఖాలని దించుకున్నారు.

"ఏమిటే, మీ నాన్నని అంకులని పిలుస్తున్నావ్" సూర్యకాంతమ్మ నిర్ఘాంతపోతూ అడిగింది. ఆవిడ స్వరంలో ఆశ్చర్యం. అపనమ్మకం!

"నాన్న!" విరగబడి నవ్వింది. "మా నాన్నెవరో తెలిశాక, ఈయన నా తండ్రి కాదని తెలిశాక ఈయన్ని 'నాన్న' అని ఎలా పిలవను?"

ఆవిడకి నిలువు గుడ్లు పడ్డాయి.

"ఏమిటే పిచ్చెక్కిందా నీకు?"

"లేదు. ఉన్న పిచ్చి వదిలిపోయింది"

"ప్రభా! ఏమిటే ఇది... దీనికి గాలి సోకిందేమో, అర్థం, పర్థం లేని వాగుడు వాగుతోంది"

"నాకు గాలి సోకలేదు నాయనమ్మా! నిజం తెలిసింది"

"ఏమిటే నీకు తెలిసిన నిజం?" కోపంగా అడిగింది.

"మా నాన్న నారాయణరావు కాదు. కామేశ్వర్రావు" తలపై పిడుగు పడ్డట్టయిందావిడకి. వాగ్బంధనమైనట్టు చూస్తోంది. రమ్య ఆవిడ ముఖంలోకి తృణీకార భావంతో చూసి వెళ్ళిపోయిందక్కడి నుంచి.

సూర్యకాంతమ్మ ముఖం క్షణంలో అనేక రంగులు మారి అవమానం అనే ఎరుపు రంగుని పులుముకుంది. కొడుకు వైపు, కోడలి వైపు సూటిగా చూడలేక సిగ్గుతో కుంచించుకుపోతుంది.

ఆవిడ అక్కడ నుంచి పెరట్లోకి వచ్చి తులసి కోట దగ్గర కూలబడింది.

తను చేసిన పాపం శాపమై తనని నిలదీస్తోంది. తనెంత పాపం చేసింది! కోడలిని తన స్వార్థం కోసం వ్యభిచారానికి ప్రోత్సహించింది. కొడుకులోని లోపాన్ని కప్పెట్టి తన వంశం నిలబడాలని వేశ్య కంటే దిగజారిపోయింది. పిల్లలు లేకపోతే ఎవరినైనా పెంచుకుందామన్న ప్రభ ప్రతిపాదనని ఎందుకు బలపరచలేకపోయింది? కారణం. స్వార్థం! తన కొడుకు రక్తం కాకపోయినా తన గోత్రీకుడైన తన మరిది కొడుకైనా తన వంశాన్ని నిలబెట్టాలనే స్వార్థం! ఆ స్వార్థం ఉచితానుచితాలని మరచిపోయేలా చేసింది. ఒక తల్లిని కూతురి ముందు దోషిగా నిలబెట్టింది.

ఏ స్త్రీకైనా తను కళంకిత అనే నిజం ప్రపంచమందరికి తెలియడం వేరు. కన్న కూతురికే తెలిస్తే? భగవంతుడా! అవమానంతో తన గుండె మండిపోతోందే? ప్రభ ఈ అవమానాన్ని ఎలా తట్టుకుంటోంది? ఆవిడ కొద్దిసేపు ఏడుస్తూండిపోయింది.

దుఃఖోపశమనం తర్వాతే మనసు తేలికపడి ఆలోచిస్తోంది.

"రమ్య, పసిపిల్ల! ఏదో తెలిసో, తెలియకో మాట్లాడితే తను, సరిదిద్దాలి" దాన్ని గుండెలమీద వేసుకుని పెంచిన నారాయణరావు దాని కన్నతండ్రని నచ్చచెప్పాలి.




ఆ రోజు ఆదివారం. రమ్య ఆలస్యంగా నిద్ర లేచింది. ప్రభ పాలగ్లాసు తెచ్చి ఆమెకి అందివ్వబోయింది.

రమ్య గ్లాసుని అందుకోలేదు. అసలు తల్లివైపు తల తిప్పి చూడలేదు. కొన్ని క్షణాల తర్వాతే ప్రభ మనసులోని బాధ వేదనలను ఒక్క నిట్టూర్పుతో దిగమింగి తిరిగి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

ఇంక ఉండబట్టలేక సూర్యకాంతమ్మ పాలగ్లాసుతో మనుమరాలి దగ్గరకి నడిచింది.

"పాలు, తాగమ్మా!" అనునయంగా అంది.

"అక్కడ పెట్టు" అంది ఆవిడవైపు చూడకుండానే.

ఆవిడ మనుమరాలి చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అంది, "అమ్మలూ! నువ్వు బంగారులా పాలు తాగేస్తే నీకు కొన్ని సంగతులు చెబుతాను"

"ఏం చెబుతావ్?" నుదురు చిట్లించింది.

"పాలు తాగెయ్యి మరి"

రమ్య ఏమనుకుందో పాలు తాగింది.

"చెప్పు అమ్మలూ.. నిన్ను మీ అమ్మ నాన్నలు ఎంత ప్రేమగా పెంచారో

తెలుసా? ఇప్పటికీ నువ్వంటే వాళ్ళకి ప్రాణం. నువ్వు, హరి వాళ్ళకి రెండు కళ్ళ లాంటి వారు"

రమ్య వెటకారంగా నవ్వింది. "ప్రభ నన్నెలాగూ ప్రేమగానే చూస్తుందిలే! ఎందుకంటే కన్నతల్లి కదా! అంకుల్ నన్ను, తమ్ముడిని ప్రేమించడమే గొప్ప విషయం!"

"రమ్యా!" ఆవిడ స్వరం ఆక్రందనలా వుంది.

"ఎవరు చెప్పారు నీకీ విషయాలు? నువ్వు పొరపాటు పడుతున్నావు"

"ఆవిడగారు రాసుకున్న డైరీ చదివాను. నువ్వు కట్టు కథలు చెప్పి నన్ను మభ్యపెట్టక్కర్లేదు. మా నాన్న కామేశ్వర్రావు, నారాయణరావు కాదు"

సూర్యకాంతమ్మ తల గిరగిర తిరుగుతుంటే పిచ్చిదానిలా మనుమరాలివైపు చూస్తూ వుండిపోయింది.

"నాకీ ఇల్లు, ఇంట్లోని మనుషులు పరాయివాళ్ళుగా కన్పిస్తున్నారు. ఈ ఇంటికి దూరంగా ఎక్కడికైనా వెళ్ళిపోవాలని వుంది" రమ్య విసురుగా అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

స్వర్గనరకాలు ఎక్కడో లేవని ఈ భూమి మీదే వున్నాయని అనుభవ పూర్వకంగా తెలిసి వచ్చిందావిడకి. తను చేసిన పాపం శాపమై తనని పరిహసిస్తుంటే ఆవిడ చలి జ్వరం వచ్చినదానిలా వణికిపోతోంది.

అత్తగారికి కూతురికి మధ్య జరిగిన సంభాషణని ప్రభ వింటూనే వుంది.

"నాకు ఈ ఇల్లు, ఇంట్లోని మనుషులు పరాయివాళ్ళుగా కనిపిస్తున్నారు. ఈ ఇంటికి దూరంగా ఎక్కడికైనా వెళ్ళిపోవాలని వుంది" అన్న కూతురి మాటలు ఆమెని భయపెట్టాయి.

★ ★ ★

"నేను వైదేహిని" ఇన్నేళ్ళ తరువాత ఆమె గొంతు ఫోన్‌లో విన్నందుకు ఇన్నాళ్ళ తరువాత, ఆమెకి తను గుర్తొచ్చిందనే సంతోషంతో ప్రభ మూగబోయింది.

"చెప్పు ప్రభా!" ఎలా వున్నావ్!

"బాగున్నాను- నువ్వెలా వున్నావ్?"

"బాగున్నాను- నిజం చెప్పాలంటే హేపీగా వున్నాను" కూతురి స్వరంలో బందిఖానాలో నుంచి బయటకొచ్చిన రిలీఫ్.

"పిల్లలెలావున్నారు?" అడిగింది వైదేహి

"బాగున్నారు"

"పిల్లలు నీ పెంపకంలో బాగుంటారు. నాకు తెలుసు" వైదేహి స్వరంలో సంతోషం. "నాకు పిల్లల్ని చూడాలని వుంది. రేపు బయలుదేరి వస్తున్నాను" క్షణం ఆగి అంది, "నా వల్ల నీకు ఎలాంటి ఇబ్బందీ ఎదురవదని హామీ ఇస్తున్నాను. సరేనా?" వాగ్దానమిస్తున్నట్టు అంది.

"సరే!" ప్రభ ఫోన్ పెట్టేసింది. మనసులో ఆందోళన. 'వైదేహి సమక్షంలో కూడా రమ్య తనతో ఇలాగే ప్రవర్తిస్తే?'

ఆ రాత్రి భర్త ఇంటికి రాగానే చెప్పింది "వైదేహి రేపు ఇక్కడకొస్తోంది"

నారాయణరావు కూడా కలవరపడ్డాడు. ఆ భావం అతని ముఖంలో స్పష్టమయింది.

"రమ్య..."

"నేను నచ్చ చెబుతాను"

"వింటుందా?"

"ప్రయత్నిస్తాను" అని కూతురి గదిలోకి నడిచింది.

"రమ్యా!"

చదువుతోందో, లేక తన ముఖం చూడ్డానికి ఇష్టంలేక పుస్తకాన్ని అడ్డుపెట్టుకుందో తెలియదు రమ్య తల ఎత్తలేదు.

"రమ్యా!" మరోసారి పిలిచింది ప్రభ.

"నాకు వినిపించింది. చెప్పు"

"ఎల్లుండి మన ఇంటికి చుట్టాలొస్తున్నారు"

ఎవరని రమ్య అడగలేదు.

తనపట్ల వైమనస్య భావంతో వున్న రమ్య తమ ఇంట్లో వైదేహి వున్న రెండు రోజులయినా ప్రేమగా ప్రవర్తించాలి. కనీసం ప్రేమ నటిస్తే చాలు.

ప్రభ తటపటాయిస్తూనే చెప్పింది.

"మన ఇంటికి వచ్చేది ఎవరో తెలుసా? "

"తెలుసుకోవలసిన అవసరం నాకేమిటి? "

ప్రభ లోలోన బాధని దిగమింగుతూ అంది.

"నా పిన్ని కూతురు, వైదేహి"

"నాకెందుకు చెబుతున్నావ్? " ముఖం చిట్లించింది.

"ఆమె ముందు నువ్వు నాతో ప్రేమగా వుండాలి. కనీసం ప్రేమ నటించాలి. నన్ను 'అమ్మా' అని పిలవాలి."

"అవును కదూ! లేకపోతే ఆమె ముందు నీ పరువు పోతుంది" ఆమె స్వరంలోని వ్యంగ్యం ప్రభ మనసులో పదునైన బాణంలా దిగబడింది.

"నువ్వు నీ పిల్లల్ని బాగా పెంచిన మంచి అమ్మగా, ఆదర్శ మహిళగా పేరు తెచ్చుకోవాలి. నవ్వొస్తోంది.. నిజంగా నవ్వొస్తోంది"

"రమ్యా!" విచలిత స్వరంతో అంది.

"వైదేహి ఇక్కడున్న రెండు రోజులయినా దయవుంచి ఇలా మాట్లాడకు"

"ఓకే" అంది రమ్య. ప్రభ నిశ్చింతగా ఊపిరి తీసుకుంది.

"కాని, ఒక్క విషయం మాత్రం బాగా గుర్తుంచుకో. నేను నీతో ప్రేమ నటిస్తున్నాననే విషయం మరచిపోయి నువ్వు నా మీద ప్రేమ కురిపిస్తూ ఓవర్ యాక్షన్ మాత్రం చెయ్యకూడదు."

ప్రభ నిస్తేజురాలయింది. వెనక్కి తిరిగి తన గదిలోకి ఎలా వచ్చిందో ఆమెకే తెలియదు. మనసులోని బాధ అశ్రు రూపంలో వ్యక్తమవుతోంది.

**కొత్తగాలి...**

**ఆడించినట్టు ఆడేందుకు**
**అందాల బొమ్మ కాదు స్త్రీ**
**నిన్నుగన్న అమ్మ**

– పెదుక రాజు,
నర్సింగాపూర్

"ఎంతగా మారిపోయింది రమ్య? తనని ఒక్కక్షణం కూడా వదలకుండా తిరిగే తన చిట్టితల్లి..."

ఏడుస్తున్న భార్య తలపై ఓదార్పుగా చెయ్యి వేసాడు నారాయణరావు.

★ ★ ★

వైదేహి లోపలికి వచ్చి ప్రభని కౌగలించుకుంది. ఆ ఇద్దరి కళ్ళూ చెమరుస్తున్నాయి. ఒక ఉద్వేగపు అల ఇద్దరినీ ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

అప్పుడే అక్కడకి వచ్చిన అత్తగారికి పరిచయం చేసింది ప్రభ.

"అత్తయ్యా! మా పిన్ని కూతురు వైదేహి"

"ఎవరూ? ఇదివరకు నేను రామాపురం వెళ్ళినప్పుడు వచ్చిందన్నావ్, ఆమేనా? " నిశితంగా వైదేహిని చూస్తూ అడిగింది సూర్యకాంతమ్మ.

"అవును" అంది చిరునవ్వుతో ప్రభ. వైదేహి ఆవిడకి మర్యాదగా నమస్కరించింది.

"దీర్ఘ సుమంగళీ భవ" దీవించిందావిడ.

"పిల్లలేరి? " వైదేహి స్వరంలోని ఆత్రుతని అర్థం చేసుకున్నదానిలా, "బాబీ.. రమ్యా? " అని పిలిచింది ప్రభ.

ఆ ఇద్దరూ హాలులోకి వచ్చారు. పదహారేళ్ళ వయస్సులో బాల్యానికి వీడ్కోలు పలికి, యౌవనం రేకులు విప్పుకుంటూ

విరిసీ విరియని గులాబీలాంటి రమ్యని, నూనుగు మీసాల నూత్న యౌవనంతో వున్న బాబీని చూసిన వైదేహి కళ్ళలో వింత వెలుగొచ్చింది.

పిల్లలిద్దరినీ చెరో చేత్తో దగ్గరకి తీసుకుంది.

"ఆమె నాకు చెల్లెలవుతుంది. మీకు పిన్ని."

బాబి చిరునవ్వు నవ్వేడు.

"నేను మిమ్మల్ని ఆంటీ అని పిలుస్తాను. మీకేమైనా అభ్యంతరమా? " రమ్య తెచ్చి పెట్టుకున్న నవ్వుతో చూసింది.

"నీకెలా పిలవాలని వుంటే అలాగే పిలువు" అంది వైదేహి.

"ఓకే ఆంటీ! మీరు స్నానం చేసి రిలాక్సవండి. బాబీ.. మనం చదువుకోవాలి. ఎగ్జామ్స్ దగ్గరకొచ్చాయి" అంది.

"ఇంక చాలు రా!" అని అర్థం వచ్చేలా!

"పిన్నీ! కాస్సేపు చదువుకుని మళ్ళీ వస్తాను. మీరీలోగా ఫ్రెష్ అవ్వండి. మనం కలిసి బ్రేక్‌ఫాస్ట్ చేద్దాం" అన్నాడు బాబి మర్యాద ఉట్టిపడే స్వరంతో.

"అలాగే!" అందామె.

"మీ ఆయనేం చేస్తాడమ్మాయ్" సూర్యకాంతమ్మ కాఫీ తాగుతున్న వైదేహిని అడిగింది.

"బిజినెస్ చేస్తారండి"

"పిల్లలెంతమంది నీకు? "

"ఇద్దరు"

"పిల్లలని తీసుకురావలసింది. ఒక్కర్తివీ వచ్చావేం? "

"పిల్లలకి వాళ్ళ నాన్నగారి దగ్గర బాగా అలవాటు. అదీగాక స్కూలు పోతుందని..."

వంట గదిలో బ్రేక్‌ఫాస్ట్ తయారుచేస్తున్న ప్రభకి ఆ ఇద్దరి సంభాషణ వినబడుతూనే వుంది.

ఆమెకి వైదేహిని ఎన్నో విషయాలు అడిగి తెలుసుకోవాలని వుంది. పీక్కుపోయిన చెక్కిళ్లు, కళ్ళ చుట్టూ నల్లటి వలయాలతో వున్న వైదేహి ముఖం ఆమె సంసారం సజావుగా లేదని చెబుతోంది. ఆమె మనసులో ఎన్నో ప్రశ్నలు. వాటికి జవాబు వైదేహే చెప్పాలి. ఆమె ఆలోచిస్తూనే అన్నీ డైనింగ్ టేబుల్‌మీద సర్ది అందరినీ బ్రేక్‌ఫాస్ట్‌కి రమ్మని పిలిచింది. రెండే ఇడ్లీలు ప్లేట్లో పెట్టుకున్న రమ్య ప్లేట్లో మరో ఇడ్లీ వేసింది ప్రభ. రమ్య పంతంగా ఆ ఇడ్లీని టేబిల్‌పైనున్న మరో ప్లేట్లో పెట్టేసింది.

రమ్యనే గమనిస్తున్న వైదేహికి ఆమె ముఖంలో ప్రసన్నత మచ్చుకైనా లేకపోవడం కుటుంబ సభ్యులతో ముఖ్యంగా తన తండ్రి, నాయనమ్మలతో మాట్లాడే తీరులో ఏదో అసహజత గోచరించింది. ఆమె ప్రభవైపు చూసింది. ప్రభ ముఖంలోని చిరునవ్వు అరువు తెచ్చుకున్నదని గ్రహించలేని అమాయకురాలు కాదామె.

★ ★ ★

"ఇప్పుడు చెప్పు. ఏమిటి విశేషాలు? " రాత్రి తొమ్మిదిన్నరకి వంటిల్లు సర్దుకుని గదిలోకి వచ్చిన ప్రభ తీరికగా వైదేహికి ఎదురుగా కూర్చుంటూ అడిగింది.

"రమ్య ఎందుకలా వుంది? " తిరిగి ప్రశ్నించింది

"ఎలా వుంది? "

"దాని ప్రవర్తనలో ఏదో అసహజత కనిపిస్తోంది."

"అదేం లేదు. పరీక్షల హడావుడి కదా..."

"నీకు, నాకు మధ్య రహస్యాలు లేవనే అనుకుంటున్నాను. ఎందుకంటే నీ గతం నాకు, నా గతం నీకు తెలుసు. పోతే వర్తమాన మేమిటో గందరగోళంగా వుంది. రమ్య ప్రవర్తన ఒక కూతురు తల్లితో ప్రవర్తిస్తున్నట్టు లేదు. ఆ ముఖంలో నిరసన,

తృణీకారంలాంటి భావాలెన్నింటినో చదివాను. నేను పొరపాటు పడకపోతే మీ ఇద్దరి మధ్య బాంధవ్యం దెబ్బతిందనిపిస్తోంది"

ప్రభ కళ్లల్లో నీళ్లూరాయి.

"రమ్యకి దాని జన్మకారకుడైన తండ్రెవరో తెలిసిపోయింది"

"ఏమిటీ!" వైదేహి స్వరంలో షాక్.

"అవును"

"ఎలా? "

"నా డైరీ దాని కంటబడింది"

వైదేహి అవాక్కయింది.

"తాము కామేశ్వర్రావు పిల్లలనే నిజం తెలుసుకుంది"

"అంతేనా? మన మధ్య ఉన్న బాంధవ్యం కూడా తెలిసిపోయిందా? "

"లేదు, దాని దృష్టిలో నేను కామేశ్వరరావుతో తప్పు చేసిన పతితని. ఆ నిజం తెలిసాక అది నన్ను 'అమ్మా' అని పిలవడం మానేసింది. తండ్రిని 'అంకుల్' అని పిలుస్తోంది"

వైదేహికి దుఃఖం ముంచుకొచ్చింది. "ఎంత పని జరిగింది ప్రభా! ఏ తప్పూ చెయ్యని నువ్వు తల దించుకుని, ఎవరో చేసిన పాపాన్ని మోస్తూ ఎంత మానసిక క్షోభననుభవిస్తున్నావో"

ప్రభకి కూడా దుఃఖం వచ్చింది.

కొద్దిసేపటి తర్వాత ఒక నిశ్చయానికి వచ్చినట్టు అంది వైదేహి, "నేను రమ్యకి నిజం చెప్పేస్తాను"

చివ్వున తల ఎత్తింది ప్రభ. "అందువల్ల ప్రయోజనం ఏమిటి? "

"నీ మీద పడిన నింద తొలగిపోతుంది. రమ్య తన తప్పు తెలుసుకుని మళ్లీ నీకు చేరువవుతుంది"

"వద్దు. తన జన్మ ఎంత హేయమైనదో అని కుమిలిపోతున్న రమ్య ఆ నిజం తెలిసి మరింత కృంగిపోతుంది"

"... కాదు. నువ్వెంత త్యాగం చేసావో

## చాకు పనే ఉత్తమం

వివేకానందుడు ఓరోజు మఠంలో అటూ ఇటూ తిరుగుతూ వంటగదికెళ్లారు. అక్కడ సాధువొకరు ఏదో ఆలోచిస్తూ ఉండటం చూసి ఏమైందన్నారు.

'ఏం చెప్పను? కూరలు తరిగే చాకు విరిగిపోయింది. ఏం చేయాలో తెలీడం లేదు' అన్నాడాయన. 'అదృష్టమంటే చాకుదే! దాని పని ఒక్కసారితో అయిపోతుంది. మనుషుల సంగతి అలా కాదుగా.. కొన్నిసార్లు బాధలూ, ఇంకొన్నిసార్లు వ్యాధులూ.. ఒక్కసారితో అయ్యే పనికాదది' అన్నారు వివేకానంద చమత్కారంగా.



తెలిసి నీ పట్ల కృతజ్ఞత ఏర్పడుతుంది. అందులోనుంచి ప్రేమ కూడా కలుగుతుంది"

"వద్దు వైదేహీ! రమ్య, మరీ పసిపిల్ల కాదు. మంచికి, చెడుకి మధ్య అంతరాలు దానికి తెలుసు. 'ఆ నిజం' బయటపడితే అది ఇంటినుంచి, నా నుంచి శాశ్వతంగా దూరమయిపోతుంది. ప్రేమతో రమ్యలో మార్పు తేగలననే నమ్మకం నాకు వుంది" కణం ఆగి అంది, "అంతవరకు ఓపికగా నిరీక్షిస్తాను. నీ సంగతేమిటి చెప్పు. నీ సంసారం ఎలా వుంది? మీ ఆయన ఎలా వున్నారు? "

"బాగానే ఉండివుంటారు" అంది వైదేహి.

"అదేమిటి? మీరిద్దరూ... ఎలా..."

ఎలా అడగాలో తెలియక ఆగిపోయింది ప్రభ.

"సుధాకర్ జైలులో వున్నాడు".

ఉలికిపాటుగా అడిగింది ప్రభ. "అదేం? "

"నేనే అరెస్టు చేయించాను. మా నాన్న గారు తన ఆస్తిని ఒక్కగానొక్క వారసురా లినైన నాకు చెందేలా విల్లు రాసారు. అది తెలిసి అతను పిచ్చెత్తిపోయాడు. నిజానికి మా నాన్నగారు ఆస్తిలో సింహభాగం అత నికే ధారాదత్తం చెయ్యాలనుకున్నారు. ఆయన దృష్టిలో సుధాకర్‌లాంటి యోగ్యుడు... మంచివాడు ఈ ప్రపంచం లోనే వుండడు. అతను ఆయన్ని అంతగా నమ్మించాడు. నేను ఆయన విల్లు రాయ బోయే సమయానికి వాడెంత నీచుడో బయటపెట్టాను. ఆయన తన నిర్ణయాన్ని మార్చుకుని ఆస్తిని నా పేర రాసారు. అది తెలిసి సుధాకర్ నా అడ్డు తొలగించుకోడా నికి నాపై రెండుసార్లు హత్యా ప్రయత్నం చేసాడు. అందుకే నా డబ్బు, పలుకుబడి ఉపయోగించి వాడిని అరెస్టు చేయిం చాను. పిటీ ఏమిటంటే వాడికి బెయిలివ్వ డానికి కూడా ఎవరూ లేరు".

"మీ నాన్నగారూ...? '

"నా జీవితమిలా కావడానికి తన తొంద రపాటు నిర్ణయమే కారణమనే మనోవ్య థతో ఆరు నెలలు తిరక్కుండానే పోయారు. మరో రెండు నెలలకే అమ్మ కూడా ఆయన దగ్గరకే వెళ్లిపోయింది. నాకీ ప్రపంచంలో నువ్వు తప్ప ఎవరూ లేరు"

ప్రభ కళ్లల్లో నీళ్లు చిప్పిల్లాయి. వైదేహిని కౌగలించుకుని కన్నీళ్ళతో మనసుని ప్రక్షా ళన చేసుకుంది.

ఇద్దరి మధ్య కొన్ని క్షణాలు మౌనం రాజ్యమేలింది. తను చేసిన తప్పుకి ప్రభ నిందమోస్తోంది. దీనికి పరిష్కారమేమి టని వైదేహి, వైదేహి జీవితం ఎందుకిలా అయిందని ప్రభ ఆలోచిస్తున్నారు. ఆ ఇద్ద రికీ గతం గుర్తొస్తోంది.

★ ★ ★

"నన్ను క్షమించు ప్రభా!" తొలిరాత్రి నారాయణరావు ఆమెతో మాట్లాడిన మొదటి మాట అది.

"దేనికి? " విస్మయంగా అడిగిందామె.

"నేను నీకు ద్రోహం చేసాను"

ఆమెకి అతనేమంటున్నాడో అర్థం కాలేదు.

"నీ జీవితంలోని సుఖసంతోషాలని కాలరాచాను. అసలు నేను పెళ్లి చేసుకోవా లనుకోలేదు. కాని మా అమ్మ చస్తానని బెదిరించి ఒప్పించింది"

ప్రభకి దిగ్భ్రమతో నోట మాట రాలేదు.

"నేను సంసార జీవితానికి అనర్హుడిని. భర్త అనే పదానికి సరైన నిర్వచనంలా నిన్ను నా ప్రాణప్రదంగా చూసుకుంటాను. అంతకుమించి నానుంచి ఏమీ ఆశించకు" అతను వణికే స్వరంతో చెబుతున్నాడు. భూమి రెండుగా చీలిపోలేదు. తలపై పిడుగు పడలేదు. ఉప్పెన వచ్చి ఆమెని నిలువెల్లా ముంచెత్తలేదు. కాని ఆ మూడూ ఒకేసారి సంభవిస్తే కలిగేంత షాక్ కలిగింది. ఆమె ఆ షాక్‌నుంచి తేరు కోకుండానే గదిలోనుంచి వెళ్ళిపోయాడు.

ప్రభ స్తంభీభూతురాలయి నిలబడిపో యింది. అతను చెప్పిన విషయం అర్థమ వడానికి, అర్థమైన నిజాన్ని జీర్ణం చేసుకో డానికి ఆమెకి ఎక్కువ సమయం పట్ట లేదు. మెదడు ఆలోచనా రహితంగా స్తబ్దంగా ఉంది. చాలాసేపటి వరకు ఆలో చించే స్థితికి రాలేకపోయింది.

'...ఇలా జరిగిందేమిటి? ' అని తనని తాను ప్రశ్నించుకుందామె.

దిగువ మధ్యతరగతి కుటుంబంలో పుట్టిన ఆమె అరడుగుల అందగాడిని, కోటీ శ్వరుడిని భర్తగా కోరుకోలేదు. తనని ప్రాణప్రదంగా చూసుకునే భర్త రావాలని, అతని సాహచర్యంలో తన జీవితంలో

మాధుర్యాన్ని పండించుకోవాలని, అతని పిల్లలకి తల్లిగా మాతృగర్వంతో పులకరించి పోవాలని కలలు కనేది. కాని తన కలలు కల్లలవుతాయని, తన ఆశలు ఈ జన్మలో నెరవేరేవి కావని ఆమె ఎప్పుడూ ఊహించలేదు.

తన భర్త నపుంసకుడని మొదటి రాత్రే తెలిసి ఆమె మనసు, తనువు గడ్డకట్టుకుపోయాయి.

'తను కోరుకోకుండానే ఆస్తిపరుల సంబంధం వెతుక్కుంటూ వచ్చింది. కాని, తను కోరుకున్నది ఇలాంటి జీవితాన్నా?' అసహాయతతో దుఃఖం వస్తోంది. మండుతున్న ఆమె మనసుని కన్నీళ్ళు చల్లార్చలేకపోయాయి. ఆరాత్రి ఆమె నిద్రపోలేదు.

కన్నీళ్ళు... ఆలోచనలు.. తన జీవితం ఎందుకిలా అయిందనే వ్యథ.. తెలతెలవారుతుండగా బయటికి రాబోతూ అద్దంలో తనని తాను పరిశీలనగా చూసుకుందామె. రాత్రి జడలో తురుముకున్న మల్లెలు మత్తుగా విచ్చుకుని ఆమెని పరిహాసిస్తున్నాయి. కసిగా ఆ పూలని తీసి గదిమూలకి విసిరికొట్టి బయటకి వచ్చింది. ఎర్రబడిన ఆమె కళ్ళని చూస్తూ, 'రాత్రి మీ ఆయన నిద్రపోనివ్వలేదా?' అని అత్తగారి తరపు బంధువులలో సిగ్గులేని ఆడవాళ్ళు కొందరు వేళాకోళమాడుతూ ఉంటే ఆమె గుండెలో శూలం గుచ్చినట్టయింది.

స్నానంచేసి తల తడుచుకుంటూ ఒంటరిగా పెరట్లో నిలబడింది. ఇల్లంతా బంధువులతో కళకళలాడుతోంది. అందరూ ఆనందంగా ఉన్నారు. "తను ఒక్కర్తే ఒంటరితనమనే లోయలో దురదృష్టపు కబంధ హస్తాల్లో చిక్కుకుని వుంది" ఆమె కళ్ళలో నీళ్ళూరుతున్నాయి.

"జుట్టుని అలా విదిలిస్తే కొసలు చిట్లిపోతాయి" దగ్గరలో అత్తగారి స్వరం వినిపించింది. ఆమె కన్నీళ్ళని దాచుకునే ప్రయత్నమేమీ చెయ్యలేదు.

సూర్యకాంతమ్మ, ప్రభ చేతిలోని టవల్‌ని అందుకుని సున్నితంగా జుట్టుని తుడుస్తూ అంది, "రాత్రి మీ మధ్య ఏమీ జరగలేదని ఎవ్వరికీ, చివరికి నీ కన్నతల్లికి కూడా చెప్పకు"

ప్రభ నోటమాట రానట్టు ఆవిడనే చూస్తుండిపోయింది.

'అంటే! కొడుకులోని లోపం తెలిసే ఆవిడ పెళ్ళి పేరుతో తనని గోతిలోకి లాగిందన్నమాట.'

"నీ భర్త సంసార జీవితానికి అర్హుడు కాడనే విషయాన్ని గుట్టుగా నీ గుండెల్లోనే దాచుకో."

"అంటే! మీకు మీ అబ్బాయిలోని లోపం సంగతి తెలుసా?" అడగలేక అడిగింది.

"తెలుసు. నారాయణ పెళ్ళి చేసుకోనని గొడవ చేసాడు. నేనే వాడిని పెళ్ళికి ఒప్పించాను."

"నా గొంతు కోసారు!" నిలువెల్లా వణికిపోతూ ఆగ్రహంగా అంది.

"ఈ రహస్యాన్ని అందరికీ తెలిసేలా అరిచి యాగీ చేసావనుకో? నీకు ఒరిగేదేమిటి? మహా అయితే సానుభూతి. 'మొన్న పెళ్ళయింది. ఇవాళ నువ్వు వాడిలో లోపం ఉందని వాడిని వదిలేసి పోగలవా? కారణం ఏదైనా కానియ్యి. భర్తని వదిలి వచ్చిన నిన్ను నీ తల్లిదండ్రులు జీవితాంతం పోషించగ

> **కొత్తగాలి...**
>
> **వలసపోవడం**
> **అంటే**
> **జీవితాన్ని జీతానికి**
> **అమ్ముకోవడమే!**
>
> – సి.కామేశ్వరరావు, కాశీబుగ్గ

లరా? లేకపోతే నారాయణకి నీచేత విడా కులిప్పించి మరో పెళ్ళి చేస్తారా? ”

ఆవిడ తనని బ్లాక్‌మెయిల్ చేస్తోందో పరిస్థితులతో రాజీపడమని, రాజీపడలేక పోతే జరిగే పర్యవసానాన్ని హెచ్చరి స్తోందో ఆమెకి అర్థం కాలేదు.

కూతురు పెద్దింటి కోడలయిందనే సంతోషంతో నిశ్చింతగా ప్రభ తల్లిదం డ్రులు తిరుగు ప్రయాణమయ్యారు. ఆమె కూడా కన్నీళ్ళని దాచుకుని, సంతోషాన్ని నటిస్తూ వాళ్ళ ముందు తిరిగింది.

ప్రభ లోకం దృష్టిలో చాలా అదృష్టవం తురాలు. అమ్మని మరిపించే అత్తగారు, కోరుకోకుండానే ఖరీదైన చీరలు, నగలు, డబ్బులిచ్చే సుఖాలు. కాని ఆమె ఎంత దురదృష్టవంతురాలో ఎవరికి తెలుసు? పెళ్ళయినా తనింకా కన్యే! కొడుకులో వున్న లోపం గురించి తెలిసే ఏరి, కోరి, తనని ఆ ఇంటికోడలిగా చేసుకున్న అత్త గారి వంచనని ఆమె తట్టుకోలేకపోతోంది.

ఆమె ఒకటి రెండుసార్లు భర్తతో తెగ తెంపులు చేసుకుని ఆ ఇంట్లోంచి వెళ్ళిపో వాలనుకుంది. కాని అలా చెయ్యనియ్య కుండా ఏదో తెలియని బంధం ఆమెని పట్టి ఆపుతోంది. ఆ బంధం నారాయణ రావు. అతను చాలా మంచివాడు. ఆమెతో స్నేహంగా, ప్రేమగా మసలేవాడు. అతని సాహచర్యంలో ఆమె రోజురోజుకి అతనికి మానసికంగా దగ్గరయిపోతోంది.

కాని ఏదో వెలితి. నిస్సారంగా గడచిపో తున్న రోజులు. వయసుకి, మనసుకి మధ్య జరిగే యుద్ధంలో అలసిపోయేది. ఆమె చేసే పన్నీటి స్నానాలు, పూజలు, ఉపవాసాలు ఇవన్నీ చూసేవాళ్ళకి ఆమె ఎంతో దైవభక్తి కలది అనిపించినా అవన్నీ ఆమె ఎందుకు చేస్తోందో ఆమెకే తెలుసు. మనసుని అదుపులో పెట్టుకోవడానికి ఆమె తనకు తానే కఠిన నియమాలుగా విధిం చుకున్న శిక్షలవి.

వాళ్ళ పెళ్ళయి ఏడాది నిండింది. ఇరు గుపొరుగున ఉండే స్త్రీలు 'ఇంకా విశేష మేమీ లేదా? ' అని అడిగేవారు. వాళ్ళ ప్రశ్నకి సమాధానంగా ఒక నవ్వు నవ్వేసి అక్కడనుంచి వెళ్ళిపోయి మనసులోనే ఏ డ్చేది. ఒకరోజు జడ వేసుకుందామని జుట్టు విప్పుకుని, దువ్వెన చేతిలోకి తీసు కుంది.

'నేను నీకు జడవేస్తాను' అంటూ సూర్య కాంతమ్మ ఆమె దగ్గర కూర్చుని దువ్వెన తను తీసుకుంది. ఆవిడ తనతో ఏదో ముఖ్యమైన విషయాన్ని మాట్లాడబోతోం దని ప్రభకి అర్థమయ్యింది.

ఆవిడ ఆమె జుట్టుని సున్నితంగా చిక్కులు తీస్తూ అడిగింది "నువ్వు మహా భారతం చదివేవా? "

"చదివాను" ఉన్నట్టుండి ఆవిడ మహా భారతం ప్రస్తావన ఎందుకు తెచ్చిందో తెలియకపోయినా అంది ప్రభ.

"కురువంశాభివృద్ధి ఎవరివల్ల జరి గింది? "

"వ్యాసుని వల్ల."

"అవునా? విచిత్రవీర్యుడు చనిపోయాక, అతని తల్లి సత్యవతి అతని భార్యలైన అంబిక, అంబాలికలను వ్యాసుని వలన సంతానవతులు కమ్మని అడుగుతుంది. అంటే భర్తవల్ల పిల్లలు పుట్టకపోతే మరొక పురుషుని వల్లనైనా ఆ స్త్రీ సంతానవతి కావచ్చు అని కదా!"

ప్రభకి ఆవిడ ఏం చెప్పబోతోందో అర్థ మయింది. శరీరంలోని రక్తమంతా ముఖంలోకి పొంగిరాగా చప్పున లేచి నిల బడింది.

"ఆపద్ధర్మంగా వంశాభివృద్ధి కోసం తప్పు లేదు. బాగా ఆలోచించుకో. తొందరేమీ లేదు"

"ఆలోచించేదేమీ లేదు. నేను అలాంటి

సిగ్గుమాలిన పనిచెయ్యను" నిలువెల్లా కంపిస్తూ మెల్లిగా అయినా, స్థిరంగా చెప్పింది ప్రభ.

"లోకం నిన్ను గొడ్డుమోతు అంటుంది"

"అననివ్వండి, ఫర్వాలేదు. ఎవరికో శీలాన్ని అర్పించి, అతని బిడ్డని భూమిమీదకి తెచ్చి నా భర్త బిడ్డగా ఈ లోకాన్ని నమ్మించలేను. అయినా మీరు.. మీరు ఇలాంటి తప్పుడు సలహా ఇస్తారనుకోలేదత్తయ్యా! సాటి ఆడదాన్ని, మీ ఇంటి కోడలిని ఇలాంటి నీతిబాహ్యమైన పనికి ప్రోత్సహిస్తున్నారా? " తన ఏహ్యతని, తిరస్కారాన్ని స్వరంలో ప్రస్ఫుటింపచేస్తూ అంది.

"నిజమేనమ్మా! నేను ఆడదాన్నే, సాటి ఆడదాన్ని. నా కోడలిని ఇలాంటి తప్పు చెయ్యమని ప్రోత్సహించకూడదు. నాకు తెలుసు. కాని నా వంశం నా కొడుకుతోనే అంతరించి పోతుందంటే భరించలేకపోతున్నాను" ఆవిడ ఏడవసాగింది.

ప్రభకి ఆవిడని చూస్తే ఒక్క క్షణం జాలేసింది. కాని జాలిపడి ఆవిడ కోరిక ప్రకారం పరపురుషుడితో పక్క పంచుకోవాలనే ఊహకే ఆమె మనశ్శరీరాలు, జుగుప్సతో జలదరిస్తున్నాయి. ఆమె మౌనంగా లోపలికి వెళ్ళిపోయింది.

మూడురోజుల తర్వాత ఆవిడ మళ్ళీ అడిగింది, "ఏం ఆలోచించుకున్నావ్? "

"నా నిర్ణయాన్ని ఆరోజే చెప్పాను కదత్తయ్యా! ఇంక ఆలోచించేదేమీ లేదు"

ఆవిడ ముఖం కళ తప్పింది. నిరాశగా నిట్టూర్చి అంది. "నా కుటుంబానికి ఎవరి శాపమో తగిలింది. ఈ తరంతో మా వంశం ఆఖరయిపోతుంది. పాతిక ఎకరాల మాగాణి, ఈ ఇల్లు, డబ్బు, బంగారం అన్నీ ఎవరనుభవిస్తారు? ఏ ధర్మ సంస్థలకో రాసెయ్యండి."

"ఎవరినైనా పెంచుకుంటాం" అంది ప్రభ.

"పెంచుకున్న వాళ్ళు మన పిల్లలవుతారుటే! నీకు తల్లినవాలని లేదూ? "

"ఉంది.. కాని అడ్డదార్లు తొక్కి మాత్రం కాదు."

"నువ్వు ప్రతిరోజూ పూజించే దేముడు నీ భక్తికి మెచ్చి ప్రత్యక్షమై పాయసాన్ని ఇవ్వడానికి ఇది త్రేతాయుగం కాదు."

"నేను పూజ చేస్తున్నది భగవంతుడు నా భర్త ప్రమేయం లేకుండానే నాకు సంతానాన్ని ప్రసాదిస్తాడని కాదు. మన శ్శాంతి కోసం" ఇంచుక వ్యంగ్యంగా అంది.

"ఆలోచించు ప్రభా! ఈ విషయం మన నలుగురి మధ్యనే వుండిపోతుంది. పైగా కామేశ్వర్రావు నీకు తెలియని వాడేమీ కాదు. మన ఇంటి పేరు గలవాడు. మన గోత్రీకుడు. మన వంశం అతని వల్ల నిలబడాలని నా ఆశ."

"కామేశ్వర్రావా? " ఆమెకు నోట మాట రాలేదు. అతను అత్తగారి మరిది కొడుకు. తమ పెళ్ళికిముందే అతని పెళ్ళయింది. అతని భార్య సీత గర్భవతి కూడా.

"మీరు అతని దగ్గర ఈ విషయాన్ని ప్రస్తావించారా? " సిగ్గుతో కుంచించుకుపోతూ అడగలేక అడిగింది.

"అడిగాను" అంది సూర్యకాంతమ్మ.

"ఛీఛీ!" ప్రభకి అసహ్యంతో ఒళ్ళు జలదరిస్తోంది. ఆమె తన భర్తతో సంసార జీవితంలోని ఆనందాన్ని పొంది వుండకపోవచ్చు. కాని మరిది వరసైన కామేశ్వర్రావుతో పక్క పంచుకొమ్మని స్వయంగా అత్తగారే చెబుతుంటే ఆమెకి జుగుప్సగాను, కంపరంగాను వుంది.

ఒక్క ఉదుటున అక్కడనుంచి లేచి వచ్చేసింది.

★ ★ ★

నారాయణరావు షాపుకి వెళ్ళాడు. సూర్యకాంతమ్మ గుడికి వెళ్ళింది. ఇంట్లో

ప్రభ ఒక్కతే వుంది.

"ప్రభా!" అని పిలుపు వినిపించింది.

వెనుదిరిగి చూస్తే కామేశ్వర్రావు. ఆమె వేగంగా కొట్టుకునే గుండెతో చేస్తున్న పనిని వదిలి, లేచి నిలబడింది. సూర్యకాం తమ్మ తన దగ్గర ఆ ప్రస్తావన తెచ్చాక అతన్ని మొదటిసారిగా అంత దగ్గరగా చూస్తుంటే ఆమె ఒళ్ళే కాదు, మనసు కూడా ముడుచుకుపోసాగింది. తనని గతంలో 'వదినా' అని పిలిచే అతను వున్న ట్టుండి 'ప్రభా!' అని ఎందుకు పిలుస్తు న్నాడో అర్థమైన ఆమె ఒళ్ళు జుగుప్సతో వణుకుతోంది.

"నీతో కొంచెం మాట్లాడాలి" అతను అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు.

"ఏం మాట్లాడాలి? మీ అన్నయ్యా ఇంట్లో లేరు. నువ్వేం మాట్లాడాలనుకున్నా ఆయనతో మాట్లాడు" గంభీరంగా చూస్తూ అందామె.

"నేను నిన్ను ప్రేమిస్తున్న విషయం అత నితో మాట్లాడితే బాగుంటుందా? " తదే కంగా ఆమెనే చూస్తూ అన్నాడు.

"ప్రేమా!" కంపరంగా చూస్తూ అంది.

"అవును. నేను నిన్ను గాఢంగా ప్రేమి స్తున్నాను. ఆ ప్రేమ ఇప్పుడు పుట్టినది కాదు. అన్నయ్యా కంటే ముందు నాకు నీ సంబంధం తెచ్చారు పేరిశాస్త్రిగారు. కాని మా అమ్మ మీరు లేనివాళ్ళని, కట్నకాను కలు ఇచ్చుకోలేరని మీ సంబంధానికి ఒప్పు కోలేదు. నీ ఫొటో చూడగానే చేసుకుంటే నిన్నే పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. కాని నాకు మా అమ్మంటే భయం. అందువల్ల నీపట్ల నా ప్రేమని వ్యక్తం చెయ్యలేకపో యాను. నువ్వు మా పెద్దమ్మ కోడలిగా మా ఇంట్లో అడుగు పెట్టాక, నా హృద యాంతరాళాల్లో నీపై వున్న ప్రేమ రెట్టిం పయింది. మా అమ్మని ఎదిరించి నేను నిన్నెందుకు పెళ్ళి చేసుకోలేకపోయానా అనిపించింది. నేను నిన్ను పెళ్ళి చేసుకుని వుంటే నీ అందం, యౌవనం అడవి గాచిన వెన్నెలలా మిగిలిపోయేవి కావు"

"నీకూ పెళ్ళయింది. నాకూ పెళ్ళ యింది. ఇలా మాట్లాడ్డానికి నీకు సిగ్గుగా లేదూ" ఛీత్కరిస్తూ అంది.

"లేదు. ప్రేమ గుడ్డిదే కాదు. సిగ్గులేనిది కూడా!"

"దయవుంచి బయటికి వెళ్ళిపో! మరో మాట మాట్లాడకు" ఆగ్రహంగా అరిచింది.

కామేశ్వర్రావు వెళ్ళిపోయాడు. ప్రభ వీధి తలుపు మూసేసింది. ఆమె మనసు కుత కుత లాడిపోతోంది. అత్తగారిపై అసహ్యం! తిరస్కారం! నీతి నియమాలు, వావి వరుసలు మరచిపోయి ఆవిడ కామే శ్వర్రావుకి తనపై లేనిపోని ఆశలని కల్పిం చినందుకు అత్తగారిపై ఒళ్ళు తెలియని కోపం వస్తోంది.

అయితే ఆమె బయటపడి అల్లరి చెయ్యా లేదు. మరోసారి కామేశ్వర్రావు తన జోలికి వస్తే అతనికి ఎలా బుద్ధి చెప్పాలో ఆమెకి తెలుసు.

ఆమె ఊహించినట్టే రెండురోజుల తర్వాత ఇంట్లో ఎవరూ లేని సమయంలో కామేశ్వర్రావు మళ్ళీ వచ్చాడు. ప్రభ కూర్చో మనలేదు. అయినా అతను కుర్చీ లాక్కుని ఘరానాగా కూర్చున్నాడు.

"వెళ్ళిపో! మీ అన్నయ్యా లేని సమ యంలో నువ్వు ఎప్పుడూ రావద్దు" అంది ప్రభ.

## కొత్తగాలి...

**అంబరాన**
**తారకలు**
**కోరికలు**

– బద్ది నాగేశ్వరరావు,
అనకాపల్లి

# కోనేటిలో మునకేసిన బాలుడు




హిందూపురం విద్యార్థి బృందమొక్కటి పెనుకొండ కోటకు విహార యాత్రకని వెళ్లింది. జట్టులోని బాలుడొక్కడు దాహార్తియై నరసింహస్వామి కోనేటిలో దిగాడు. కిందకు ఒంగి నీరు తాగబోయిన ఆ బాలుడు కాలు జారి ఈత రాక కోనేటి నీటిలో మునక వేశాడు. దీనిని గమనించిన తోటి పిల్లలిద్దరు తమ నేస్తాన్ని రక్షించాలని నీటిలోకి దూకారు. మునకేస్తున్న బాలుడు ప్రాణభయంతో ఆ ఇద్దరు మిత్రులను గట్టిగా వాటేసుకున్నాడు. దాంతో ఆ పిల్లలకు మిత్రుడిని రక్షించడంమాట అటుంచి తమ ప్రాణాలు కాపాడుకోవడమే కష్టమైంది. జట్టులోని మిగిలినవారంతా దిక్కుతోచక చూస్తూ నిలబడిపోయారు.



ఆ సమయంలో కల్లూరు సుబ్బారావుగారు ఏదో పనిమీద చకచక అటే నడిచి వెళ్తున్నారు. కోటు వేసుకుని, ఎండకు గొడుగు పట్టుకొని వెళ్తున్న ఆయన కోనేటి గట్టుమీద పిల్లలగుంపును, వారందరూ కోనేటిలోనికి తొంగి చూడటాన్ని గమనించారు. ఏదో సందేహం వచ్చి తనూ తొంగిచూశారు. ముగ్గురు పిల్లలు కోనేటిలో మునగానాం తేలానాం అవుతూ ఉన్నారు. అంతే! ఇంకేమీ ఆలోచించలేదు. కోటు, గొడుగుతోసహా కోనేటి నీటిలోనికి దూకారు. గొడుగుతో బాది ముగ్గురు పిల్లవాండ్లనూ విడదీశారు. మునకలేసి నీళ్లు తాగి చేతులెత్తేసిన స్థితిలోని పిల్లవాడిని జుట్టు పట్టుకుని లాక్కొచ్చి ఒడ్డుపై బోర్ల పండబెట్టారు. వీపు మీద గట్టిగా నొక్కి, తాగిన నీళ్ళను కక్కించి, అక్కడ పిల్లలకు "ఇక వీడి విషయం మీరు చూసుకోండి. నే వెళతాను" అని చెప్పి ఆ తడి బట్టలతో అలాగే నడిచి వెళ్లారాయన.

"నువ్వు నా ప్రేమని అంగీకరించే వరకు మళ్ళీ మళ్ళీ వస్తూనే వుంటాను" అన్నాడు ఆమెని తినేసేలా చూస్తూ.

"నువ్వు నన్ను గతంలో ప్రేమించి వుండొచ్చు. ఇప్పుడు నీ వదినని. నీ తల్లి తర్వాత తల్లిలాంటిదాన్ని. నువ్వు నన్ను గౌరవించాలి!" అంది సహనాన్ని కూడదీసుకుంటూ.

"గతంలోనే కాదు, ఇప్పుడూ నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఎప్పటికీ ప్రేమిస్తూనే వుంటాను. నీతో ఒక్కసారన్నా..."

"మూర్ఖుడా! కామంతో నీ కళ్ళు పొరలు కమ్మివున్నాయి. ముందు నువ్వు లే!"

"ఓకే! లేచాను. బెడ్‌రూమ్‌లోకి వెళ్దామా? " కన్నుగీటి నవ్వేడు.

ఆ క్షణంలో ప్రభ అపరభద్రకాళి అయింది. చెయ్యెత్తి అతని చెంప ఛెళ్ళుమనిపించింది. "పశువా! బయటికి పోరా!" ఆగ్రహంతో వణికిపోతూ అరిచింది.

కామేశ్వర్రావు ఏమనుకున్నాడో మౌనంగా బయటికి నడిచాడు. అతను బయట అడుగు పెట్టీపెట్టగానే ప్రభ తలుపు ధడాల్న మూసేసింది. అవమానంతో ఆమె మనసు మండిపోతోంది. అతని చూపులలోని వెకిలితనం, బాహాటంగా తనపై కోరికను వ్యక్తం చెయ్యడం గుర్తుకొస్తే ఆమె మనశ్శరీరాలు జుగుప్సతో, ఏహ్యతతో ముడుచుకుపోతున్నాయి.

కామేశ్వర్రావు మళ్ళీ ఆ ఇంటికి రాలేదు. ప్రభ తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

★ ★ ★

ప్రభ, కామేశ్వర్రావుల మధ్య అక్రమ

సంబంధం వుందనే వదంతి ఊరంతా కార్చిచ్చులా వ్యాపించింది. ఆ కార్చిచ్చు తాలూకు మంట ప్రభని తాకింది. ఆమెకి సిగ్గుతో, అవమానంతో ప్రాణం పోతున్నట్టుంది. ఈ నిప్పులేని పొగ ఆమె జీవితాన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. వున్నట్టుండి ఒకరోజు కామేశ్వర్రావు దగ్గర నుంచి ఆమెకి ఫోన్ వచ్చింది.

ఫోన్‌లో కామేశ్వర్రావు స్వరం వినగానే ఆమె ఫోన్ పెట్టేయ్యబోయింది.

"నీకో నిజం చెప్పాలి"

"ఏమిటది? " అయిష్టంగానే అడిగింది.

"మన ఇద్దరి మధ్య లేని అక్రమ సంబంధాన్ని సృష్టించింది నేనే."

"నువ్వా!" షాకయిపోయింది.

"అవును. నేనే! అనాఘ్రాత పుష్పానివని విర్రవీగుతున్నావ్ కదూ? నీ పొగరు అణిచాను. పతివ్రతగా బతుకు చాలిద్దామనుకున్న నిన్ను పతితని చేసాను. మన ఇద్దరి మధ్య ఏమీ లేకపోయినా ఏదో వుందని అందరూ నమ్మేలా చేసాను"

"ఏం చేసావ్? " అప్రయత్నంగా అడిగింది.

"ముత్యాల ముగ్గు సినిమా చూసావా? సంగీతని పతితగా నిరూపించి విలన్ ఆమె కాపురాన్ని ఎలా కూలుస్తాడో? నీ బెడ్‌రూమ్‌లో ఆదమరిచి నిద్రపోతున్న నువ్వు. ఆ గదిలో అర్ధనగ్నంగా నేను. మన ఇద్దరినీ చూసిన మీ ఇంటి పనిమనిషి. అది చాలదూ? నన్ను చెంపదెబ్బ కొట్టావు నువ్వు! నేను నీ బతుకుపై కొట్టాను" అతను నవ్వుతున్నాడు.

ప్రభ వెన్నెముకలో మంచుగడ్డలు పెట్టినట్టు వణికిపోతోంది. అసహాయతతో ఆమెకి దుఃఖం వస్తోంది.

తన జీవితంతో కామేశ్వర్రావు క్రూరంగా ఆడుకున్నాడు. తనపై పడిన మచ్చ తను చచ్చిపోయినా చెరిగిపోదు. ఇంతటి అవమానాన్ని భరిస్తూ తను బతకలేదు. బతకకూడదు. తను చావాలి. అవును. ఆత్మహత్య చేసుకోవాలి.




వైదేహి అటునుంచి ఇటు వత్తిగిలింది. ఆమెకి గతం గుర్తుకొస్తోంది. ప్రేమకి, ఆకర్షణకి తేడా తెలియని వయసులో తప్పటడుగు వేసింది. తను నెల తప్పిందని తెలిసి పెళ్ళి చేసుకోమని అడిగితే, అతను తాపీగా తనకి ఇదివరకే పెళ్ళయిందని చెప్పాడు. ప్రేమ మత్తులో అతని దగ్గర తనెప్పుడూ పెళ్లి ప్రస్తావన తేలేదు. తన తెలివితేటలు ఏమయిపోయాయి? అతను తన అందాన్ని పొగిడేవాడు. తన పాదాల కింద నలిగే గడ్డిలా పుట్టినా తన జన్మ సార్ధకమవుతుందనేవాడు. అతన్ని గుడ్డిగా నమ్మి మోసపోయింది. వైదేహికి తనమీద తనకే జాలేసింది. భవిష్యత్తుపై భయం వేసింది.

కుటుంబ పరువు ప్రతిష్ఠలు గుర్తుకొచ్చాయి. వణికిపోయింది. ఇంటికెలా వచ్చిందో తెలియదు. తలనొప్పి సాకుతో అన్నం తినకుండా పడుకుంది. ఆ రాత్రి కాళరాత్రి అయింది. నిద్ర పట్టలేదు. గుండెలోని దిగులు, భయం క్షణక్షణానికీ పెరిగిపోతున్నాయి.

తన సమస్యకి పరిష్కారమేమిటి? చచ్చిపోతే?

## కొత్తగాలి...

**అలి ఫొటో పర్సులో**
**ప్రియురాలి ఫొటో మనసులో**
**వాడే మగాడు**

– కె.ఎన్నార్ నమ్మి,
నెగ్గిపూడి

కాని బతుకుపై తీపి ఆమెని చావనివ్వ లేదు.

నాలుగు రోజులు గడిచాయి. వైదేహి అన్నం తినడంలేదు. పీక్కుపోయిన ముఖంతో లంఖణాలు పడిలేచిన వ్యక్తిలా వున్న కూతురిని చూసి తల్లీ తండ్రీ ఆందోళన పడుతున్నారు.

"డాక్టరు దగ్గరకి వెళ్దాం రామ్మా!" అంది జానకి.

"వద్దు. నా జబ్బేమిటో నాకు తెలుసు" అంది రుద్ధ స్వరంతో.

"ఏమయిందమ్మా" ఆత్రుతగా అడిగింది. కూతురు మెల్లిగా చెప్పిన జవాబు విని ఆవిడ బ్రమాన్పడిపోయింది.

"ఏమిటే పరాచికం? అయినా వేళాకోళానికి కూడా ఒక హద్దు వుండాలి"

జానకికి కాళ్ళు చేతులు ఆడలేదు. భర్తని పిలిచి చెప్పింది.

జగదీశ్వరరావు నిశ్చేష్టుడయ్యాడు. షాక్ నుంచి తేరుకుని ఆగ్రహంతో ఊగిపోయాడు.

"ఆ ముదనష్టపుదాన్ని చంపేస్తాను. మన పరువు తీసిన అది బతికుండడానికి వీల్లేదు"

"ఏమండీ! అరిచి గోల చెయ్యకండి. పరువుపోతుంది. ప్రతి సమస్యకీ ఒక పరిష్కారం వుంటుంది. అతనెవరో తెలుసుకుని పెళ్ళి చేద్దాం"

జగదీశ్వర్రావు ఆలోచనలో పడ్డాడు. భార్య చెప్పిన సలహా సబబుగానే తోచింది. మెల్లిగా కూతురి గదిలోకి నడిచాడు. ఏడ్చి ఏడ్చి ఉబ్బిన కనురెప్పలతో వున్న కూతుర్ని చూస్తూ ఆయనకి జాలేసింది.

"అతనెవరో చెప్పమ్మా! అతనితో నీ పెళ్ళి జరిపిస్తాను."

"అదెప్పటికీ వీలుకాదు నాన్నా!" డగ్గుత్తికతో అంది.

"ఎందుకని"

"అతనికి ఇదివరకే పెళ్ళయింది".

హతాశుడయ్యాడాయన.

"ఎంతపని చేసావమ్మా? " అన్నాడు ఆవేదనగా.

ఆయన స్వరం ఆక్రందనలా వుంది. ఆ చేదు నిజాన్ని జీర్ణించుకోలేకపోతున్నాడాయన.

జానకి పైకి ఏడుస్తోంది. ఆయన మనసులో ఏడుస్తున్నాడు. అంతే తేడా.

బాధని ఆగ్రహం అధిగమించింది. ఆవేశంతో వణికిపోతూ రౌద్రంగా అరిచాడాయన.

"నీకు... నీకెంత స్వేచ్ఛనిచ్చాను? నీ మీద నేను పెంచుకున్న నమ్మకాన్ని వమ్ము చేసావు కదే పాపిష్టిదానా? నా పరువుని బజారుకీడ్చిన నిన్ను.. నిన్ను" ఆగ్రహంతో వణికిపోతున్న ఆయన్ని జానకి బలవంతాన గది బయటికి తీసుకెళ్ళింది.

కొద్దిసేపటి తర్వాత ఆయన స్థిమితపడ్డాడు.

"ఏమండీ! మన పిల్లని మనమే బయట పెట్టుకుంటామా చెప్పండి. అది తప్పే చేసింది. ఆ తప్పుని సరిదిద్దే ప్రయత్నం చెయ్యడం కన్నవాళ్ళమైన మన బాధ్యత"

"వైదేహి చేసిన తప్పుని భగవంతుడు కూడా సరిదిద్దలేడు జానకీ! ఈ విషయం బయటకి పొక్కితే ఆత్మహత్య చేసుకోవడం తప్ప నాకు వేరే దారిలేదు" జగదీశ్వర్రావు బావురుమన్నాడు.

ఆవిడ దుఃఖాన్ని దిగమింగి భర్తనీ ఓదార్చింది. ఆయనకి కర్తవ్య బోధ చేసింది.

మరునాటి ఉదయమే ఆయన కూతురితో, భార్యతో కారులో బయలుదేరారు. పక్కనే వున్న చిన్న పల్లెటూరిలో వున్న ఒక హాస్పిటల్ ముందు కారాగింది.

వైదేహి ప్రాణం వున్న బొమ్మలా వుంది. ఆమె మనసుకి తగిలిన గాయం ఆమెలో ఆలోచించే శక్తిని కోల్పోయేలా చేసింది.

జానకి డాక్టరుతో మాట్లాడి వచ్చి కూతురిని పిలుచుకెళ్ళింది.

డాక్టరు వైదేహిని ఏవో ప్రశ్నలడిగి, ఆమెని పరీక్షించి ఆమెకి నాలుగో నెల నిండబోతోందని, ఆ సమయంలో అబార్షన్ చేస్తే ప్రాణానికే ముప్పు అని చెప్పింది.

"చదువుకున్న వాళ్ళలా వున్నారు. నాలుగు నెలలు నిండిపోయినా గర్భిణీ అని తెలుసుకోలేకపోయారా? " అని చివాట్లేసింది.

తండ్రి తల పట్టుకున్నాడు.

"అమ్మాయికి నెలసరి ఎప్పుడూ రెగ్యూలర్‌గా రాదు. పైగా గర్భిణీ లక్షణాలేవీ కనబడలేదు. అసలు ఆ అనుమానమే రాలేదు" సంజాయిషీ ఇస్తున్నట్టు అంది జానకి.

"నేను అబార్షన్ చెయ్యను. నాటు మందులు వాడి అమ్మాయి ప్రాణాలకి ముప్పు తీసుకురాకండి. మరో అయిదు నెలలు ఓపిక పడితే ప్రసవం అవుతుంది. ఎవరైనా పిల్లలు లేని వాళ్ళకి బిడ్డనిస్తే కళ్ళకద్దుకుని పెంచుకుంటారు" అంది డాక్టరు.

తండ్రి అయిష్టంగానే అంగీకరించాడు. తల్లి ముఖంలో విచారం, ఆందోళన. ఈ రహస్యం బయటపడినరోజు తమ జీవితాలు తల కిందులవుతాయని ఆవిడకి తెలుసు.

పెద్దింటి అమ్మాయి తప్పుచేసింది. ఆ తప్పుని కడుక్కోడానికి తన దగ్గర కొచ్చింది. కాని అందుకు సమయం దాటిపోయింది. డాక్టరు మనసు కరిగిపోయింది.

"నా ఫ్రెండ్ డాక్టరు ఇందిర తిరుపతిలో వుంది. మీ అమ్మాయికి ప్రసవం అక్కడ చేస్తే మూడో కంటికి ఈ విషయం తెలియకుండా మేనేజ్ చెయ్యవచ్చు" అందావిడ డాక్టర్ ఇందిర ఎడ్రస్ ఇస్తూ.

ప్రవాహంలో కొట్టుకుపోతున్న వాడికి గడ్డిపోచ దొరికినట్టయింది. దిక్కుతోచని స్థితిలో సమ్మతించాడాయన.

★ ★ ★

తండ్రి పరువు ప్రతిష్ఠలు.. ఆగమ్య గోచరమైన తన భవిష్యత్తు... వైదేహిని కలవర పెడుతున్నాయి. వణికిస్తున్న వర్తమానం.. తను తల్లిదండ్రులకి సమస్య కాకూడదు. తన సమస్యని తనే పరిష్కరించుకోవాలి. ఆ క్షణంలో మనసుకి తట్టిన పరిష్కారం ఆమెని మంచం మీద నుంచి దిగ్గున లేచేలా చేసింది. అదే ఊపుతో తలుపు తీసుకుని గది బయటకొచ్చింది.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. తండ్రి బెడ్‌రూమ్ వైపు చూసింది. ఆ గది తలుపు మూసివుంది.

తల్లీ తండ్రీ నిద్రపోతున్నారో లేక తన సమస్య గురించీ ఆలోచిస్తున్నారో! ఆమె నిట్టూర్చి చప్పుడు చెయ్యకుండా మెయిన్ డోర్ తీసి బయటకి నడిచింది. తిరిగి తలుపు మూసేసింది. ఆటోమేటిక్ లాక్ వున్న ఆ తలుపు క్లిక్‌మనే చిన్న శబ్దంతో మూసుకుపోయింది.

వైదేహి రోడ్డుమీదకొచ్చింది. చీకటి, ఒంటరితనం ఆమెని భయపెట్టడం లేదు. అన్నింటికీ తెగించిన దానిలా వుందామె.

ఆమె నడకలో తడబాటులేదు. గుండె నిండా ధైర్యం! ఆమె అడుగులు స్థిరంగా పడుతున్నాయి. గోదావరి ఒడ్డుకి చేరుకున్నాక తెలిసింది తనెంత వేగంగా నడిచిందో! ఒళ్ళంతా స్వేదంతో తడిసి ముద్దయింది. గుండె రెట్టింపు వేగంతో కొట్టుకుంటోంది. రేవు మెట్లు దిగింది. ఆఖరి మెట్టుమీదకొచ్చాక అప్రయత్నంగా ఆగిపోయింది. గుడ్డి వెన్నెలలో తనలాంటి మరో స్త్రీ ఆకారం! క్షణం, గుండె ఝల్లుమంది.

'బిచ్చగత్తె అయివుంటుందా? లేక పిచ్చిదా? అదీ కాకపోతే తనలాగే దగా పడిన మరో స్త్రీయా? తన ప్రయత్నాన్ని అడ్డుకోదు కదా! అయినా చావబోతూ ఇన్ని ఆలోచనలెందుకు? గబగబా మెట్లు దిగేసి నీళ్ళలోకి దూకేస్తే సరి. అయినా ఒడ్డున అంత లోతు వుండదు. కొంత దూరంవరకు నడుము లోతే వుంటుంది ప్రవాహం. తను నది మధ్యకి వెళ్ళేలోగా ఆమె తనని రక్షిస్తే' ఛ! ఇలా ఒడ్డున నిలబడి ఆలోచిస్తోందేమిటి? ముందుకి నడవాలి. వైదేహి చావు ధైర్యంతో ముందుకి నడిచింది. నీళ్ళలోకి దిగింది. మోకాళ్ళ దిగువకి నీళ్ళొచ్చాయి. ఆమె నడుస్తుంటే నీళ్ళు చిత్రమైన శబ్దం చేస్తున్నాయి.

"ఆత్మహత్య చేసుకోవాలని దిగుతున్నావా?"

సమీపంలో వినవచ్చిన స్త్రీ స్వరం విని ఉలిక్కిపడి తల తిప్పింది. ఎప్పుడొచ్చిందో తెలియదు ఆమె తన వెనుకే నీళ్ళలో వుంది. వెన్నెల రేకలు పాలరాయి లాంటి ఆమె శరీరం మీదపడి పరావర్తనం చెందుతున్నాయి. ఆమె అద్భుత సౌందర్యాన్ని రెప్పలార్పకుండా చూస్తూ క్షణంపాటు తను వచ్చిన పని మరిచిపోయింది.

ఆమె ఇందాకటి ప్రశ్ననే రిపీట్ చేసింది. ఆమె ముక్కుకి వున్న వజ్రపు ముక్కుపుడకని, మెడలోని గొలుసులని చూస్తూ ఆమె బిచ్చగత్తె కాదు అనుకుంది. ఆమె మాటలోని స్పష్టతని బట్టి ఆమె మానసిక ఆరోగ్యం సరిగానే వుందని నిర్ధారించుకుంది.

"అవును. చావాలనే వచ్చాను. మీరెవరు? ఇక్కడికెందుకొచ్చారని నేను అడగను. కాని దయవుంచి నా ప్రయత్నానికి అడ్డురాకండి ప్లీజ్!" చేతులని జోడిస్తూ అంది.

"నేనూ నీలాగే ఆత్మహత్య చేసుకోవాలనే ఇక్కడికొచ్చాను. కాని ఎందుకో ఒక్కక్షణం ఆలోచించాను. ఆ ఒక్క క్షణంలోనే అనిపించింది, 'నేనెందుకు చావాలి' అని. నేనేదో సాధించడానికే పుట్టాననిపించింది. ఇంటికి తిరిగి వెళ్ళామనుకుంటున్నాను. ఈలోగా నువ్వు కనిపించావు. నువ్వు ఆత్మహత్య చేసుకోవాలనే ఇక్కడికొచ్చావని అర్థమయింది."

"అయితే ఇంటికెళ్ళి మీరేం సాధించాలని పుట్టారో శోధించండి. నన్ను ఆపే ప్రయత్నం చెయ్యకండి" పళ్ళ బిగువున అంది వైదేహి.

"సరే! నేను నిన్ను ఆపను. కాని ఒక సలహా ఇస్తాను. ఒక్క నిముషం ఆగి కళ్ళు మూసుకుని ఒకటి నుంచి వందదాకా అంకెలని రివర్స్‌లో లెక్కపెట్టు"

"ఎందుకు?"

"లెక్కపెట్టిన తర్వాత కూడా చచ్చిపోవాలనిపిస్తే హాయిగా చచ్చిపో! నేను నిన్ను ఆపను"

వైదేహి క్షణం ఆమె వంక చూసింది. ఆమె మాటలలోని మహాత్మ్యం ఏమిటో గాని, ఆమె తక్షణం తన ప్రయత్నాన్ని విరమించుకుని, అంకెలని లెక్కపెట్టడం మొదలుపెట్టింది. 'వంద... తొంభై తొమ్మిది... ఎనభై... తొమ్మిది... ఎనిమిది.. అయిదు... మూడు... రెండు... ఒకటి... అరే! మనసులో చెలరేగిన తుపాను ఏమ

యిపోయింది? మనసు ఎందుకింత ప్రశాంతంగా వుంది'

కాళ్ళ కింద చల్లగా వున్న నీరు, తను అక్కడకి ఎందుకొచ్చిందో గుర్తు చేసింది. ఎదుట ప్రశాంతంగా ప్రవహిస్తున్న గోదావరి తొలిసారిగా భయపెట్టింది. అప్రయత్నంగా ఆమె అడుగులు వెనక్కి పడ్డాయి. రెండు మెట్లు ఎక్కాక హఠాత్తుగా కూలబడి చేతులలో ముఖం దాచుకుని బావురుమంది.

ఆమె ఆదరంగా వైదేహి భుజాల చుట్టు చెయ్యివేసింది.

కొద్దిక్షణాల తరువాత దుఃఖపు పొంగు చల్లారింది.

"ప్రేమించి మోసపోయావామ్మా?"

"అవును. నాకు నెల తప్పింది. పెళ్ళి చేసుకోమని అడిగితే తనకి ఇదివరకే పెళ్ళయిందని చెప్పాడు" రుద్ధస్వరంతో అంది.

"ఈ విషయం మీ ఇంట్లో వాళ్ళకి తెలుసా?"

"తెలుసు. అబార్షన్ చేయిద్దామని డాక్టరు దగ్గరకి తీసుకెళ్లారు. నాకు నాలుగో నెల నిండిపోయిందని, అబార్షన్ చేస్తే ప్రాణానికే ప్రమాదమని చెప్పారు డాక్టర్. ఎక్కడికో దూరంగా తీసుకెళ్ళి ప్రసవం చేయిస్తారుట. పుట్టిన బిడ్డని ఎవరికో ఇచ్చేయమంటున్నారు. ఈ విషయం ఎప్పటికైనా ఎవర్కైనా తెలిస్తే? ఇప్పటికే మా అమ్మ నాన్నలు నా గురించి బెంగతో దిగులుపడిపోతున్నారు. ఇది నేను తెచ్చుకున్న సమస్య. నేనే పరిష్కారం చేసుకోవాలి. చావు తప్ప నాకు వేరే దారి కనబడలేదు"

క్షణం ఆగి అడిగింది, "అవునూ, మీరెందుకు ఆత్మహత్య చేసుకోవాలనుకున్నారు?"

"నాకు పెళ్ళయింది. నా భర్త సంసార జీవితానికి అనర్హుడు. మా అత్తగారు నన్ను ఇంకో మగాడితో పక్క పంచుకుని పిల్లలని కనమంది. ఆవిడ నా కోసం ఎన్నిక చేసిన మగవాడు ఎవరో తెలుసా? నా మరిది. మా అత్తగారి మరిది కొడుకు. ఆవిడ ప్రోత్సాహంతో వాడు నా వెంటపడి వేధిస్తున్నాడు. నేను లొంగలేదని కక్షతో వాడికి, నాకు మధ్య అక్రమ సంబంధం వుందనే అబద్ధాన్ని నిజమని, లోకం నమ్మేలా చిత్రీకరించాడు. లోకం దృష్టిలో నేను పతితనయ్యాను. అవమానం భరించలేక చావాలనుకున్నాను. ఒకే ఒక్క క్షణం నా నిర్ణయాన్ని మార్చింది."

"అక్కా! నాకూ చావాలని లేదు. అలాగని బతికే ధైర్యమూ లేదు."

"నన్ను అక్కా అని పిలిచావు. నువ్వు ఈ క్షణం నుంచి నా చెల్లివి. నీకో సలహా ఇస్తాను. నచ్చితే అలా చెయ్యి."

"చెప్పు"

"నీ బిడ్డని నేను పెంచుకుంటాను"

"అక్కా!" ఆమె కళ్ళు వెడల్పయ్యాయి.

"ఏం ఇవ్వవా? బిడ్డని కన్నా పెంచుకోగలిగిన ధైర్యం నీకు లేదు. వాడిని అనాథని చేస్తావా?"

వైదేహి కళ్ళలో నీళ్ళూరాయి. "లేదు బిడ్డని నీకిస్తాను"

"మాట తప్పవుగా?'

"తప్పను"

"సరే! ముందు నువ్వు ఇంటికి వెళ్ళు. కాదు, నిన్ను నేను మీ ఇంటి దగ్గర దింపుతాను. రేపు మళ్ళీ ఇక్కడే కలుసుకుందాం.. సరేనా?"

"ఇక్కడొద్దు. మార్కండేయస్వామి గుడిలో కలుసుకుందాం"

"సరే!"

ఇద్దరూ వెనుతిరిగి నడవడం మొదలుపెట్టారు. జీవితాన్ని ముగించుకోవాలని అక్కడకొచ్చిన ఆ ఇద్దరూ తిరిగి జీవితాన్ని ప్రారంభించాలనుకున్నారు.

గడచిన రాత్రిని తలచుకుంటే వైదేహి గుండె ఝల్లుమంటోంది. 'ఆత్మహత్య చేసు

కోవాలనుకున్నది తనేనా? ఆ టైములో 'ఆమె' అక్కడకి రాకుండావుంటే? ఈసరికి తను నదీ గర్భంలో కలిసిపోయివుండేది. తను చేసిన తప్పుకి తనతోబాటు తన కడుపులో ఊపిరి పోసుకుంటున్న చిన్న ప్రాణి కూడా...'

ఇంతకీ తనని ఆత్మహత్యా ప్రయత్నం నుంచి విరమింపచేసిన ఆమె ఎవరు? ఆమె నిజంగానే తన బిడ్డని పెంచుకోవాలనుకుంటోందా? తనకి పిల్లలు లేరని ఆమె చెప్పినమాట నిజమేనా? పిల్లలని అమ్మేసే ముఠాకి సంబంధించిన మనిషి కాదు కదా? లక్ష భయాలు, కోటి సందేహాలతో అతలాకుతలమవుతున్న మనసుతో సాయంకాలం వరకు అస్థిమితంగా గడిపింది.

సాయంకాలం మార్కండేయస్వామి గుడికి వెళ్ళింది. ఒకపక్కగా జనానికి దూరంగా కూర్చుంది.

"చాలాసేపయిందా నువ్వొచ్చి?" సమీపంలో ఆమె స్వరం వినిపించి ఉలిక్కిపడి తల తిప్పి చూసింది.

ఆమే! నిర్మలంగా నవ్వుతోంది. రాత్రి పరీక్షగా చూడలేదు కాని, మంచి అందగత్తె. ఇంచుమించుగా తన వయసే వుంటుంది.

"నా పేరు ప్రభ. సూర్యప్రభ" అందామె.

"నా పేరు వైదేహి"

"గొప్పింటి అమ్మాయిలా వున్నావు" అంది ప్రభ. ఒక్క చూపులో ఆమె చెవులకి వున్న డైమండ్ లూప్స్‌ని, మెడలో గొలుసుకి వున్న డైమండ్స్ పొదిగిన లాకెట్‌ని చూస్తూ.

"నాన్నగారు సింగపూర్‌కి ఎక్స్‌పోర్టు చేసే బిజినెస్ చేస్తారు. ఫ్యాక్టరీ వుంది. ఒక్కర్తే అమ్మాయినని గారంగా పెంచారు. డబ్బు స్వేచ్ఛ ఇచ్చారు. ఆ స్వేచ్ఛని నేను దుర్వినియోగం చేసుకున్నాను" ఆమె స్వరంలో పశ్చాత్తాపం.

"అది నీ తప్పు కాదులే! ఆకర్షణకి, ప్రేమకి తేడా తెలియని వయసు చేసే తప్పు."

"రాత్రి మీరు నాతో చెప్పిందంతా నిజమేనా?"

"ఏం అబద్ధమనుకుంటున్నావా?"

"రాత్రి నిద్రపట్టలేదు. తెల్లవారుఝామున మాగన్నుగా కొంచెం నిద్రపట్టింది. ఆ నిద్రలో భయంకరమైన కల! మీరు నాకు పుట్టిన ఆడపిల్లలని పెంచి పెద్ద చేసారు. అది యుక్తవయసుకొచ్చాక దానిచేత వ్యభిచారం చేయిస్తున్నారు" వైదేహి గొంతు వణికింది.

"నిజమే! లోకంలో అలాంటి దుర్మార్గులూ వున్నారు. నిన్ను మా అమ్మవాళ్ళ ఇంటికి తీసుకెళ్ళి వాళ్ళని పరిచయం చేస్తాను. సరేనా?" చెబుతున్న ప్రభ ముఖం అప్పుడే గుడిలోకి ప్రవేశిస్తున్న ఒక వ్యక్తిని చూసి కఠినంగా మారిపోయింది.

"వీడు.. ఇక్కడకి కూడా దాపురించాడా?" అంది పళ్ళు కొరుకుతూ.

"ఎవరక్కా?" అంటూ అటువైపు చూసిన వైదేహి చప్పున స్తంభం చాటుకి తప్పుకుంది.

అతను ప్రభ దగ్గరకి వచ్చాడు.

"ఎలా ఉన్నావ్ ప్రభా?" నవ్వుతూ అడిగేడు.

ఆమె తన నిరసనని ప్రకటిస్తూ ముఖాన్ని పక్కకి తిప్పుకుంది.

"ఊరొదిలి పారిపోయి వచ్చినంత మాత్రాన నేను నిన్ను వదులుతాననుకుంటున్నావా? ఇప్పుడే.. ఇంతకుముందే మీ ఇంటికెళ్ళి మనమధ్య ఏంవుందో మీ అమ్మ నాన్నలకి చెప్పాను."

"నీ ఇష్టం వచ్చినట్టు చెప్పుకో! ఎవరు నమ్మినా మా అమ్మ నమ్మదు?"

"ఇంటికి వెళ్ళు. మీ అమ్మ చీపురు కట్టతో స్వాగతమిస్తుంది. నువ్వు నాతో తప్పు చేసావని ఊరంతా చెవులు కొరుక్కుంటున్నారు. అది చాలదూ? పతివ్రతా వేషాలు వేస్తే మాత్రం నీపై పడిన మచ్చ చెదిరిపోతుందా? " కామేశ్వర్రావు నవ్వులో విషనాగు బుసలు.

"చీ! ఎంతకి తెగించావు!"

"నువ్వు నా చెంపపై కొట్టావు! నేను నీ జీవితంపై కొట్టాను! ఎలావుంది నా ట్రీట్ మెంట్? " అతను వంకరగా నవ్వి అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

ప్రభ కొన్నిక్షణాల వరకు మామూలు మనిషి కాలేకపోయింది! తేరుకుని వైదేహి కోసం చుట్టూ చూసింది.

స్తంభం చాటునుంచి బయటకొచ్చింది వైదేహి. ఆమె ముఖంలో క్రోధం!

"వాడు వెళ్ళిపోయాడా? "

"ఎవరు? " తెలియనట్టు అడిగింది ప్రభ.

"నీపై పగబట్టిన విషనాగు. నా జీవితాన్ని కాటువేసిందీ వాడే!"

ప్రభ ఊపిరి పీల్చుకోవడం మర్చిపోయింది. "అసలు మీ ఇద్దరికి ఎలా పరిచయం? "

"అంతకంటే అతన్ని ఎలా నమ్మేవని అడుగు"

నిట్టూర్చింది ప్రభ. "మా ఇంటికిరా. మా వాళ్ళని పరిచయం చేస్తాను. నీ మనసులోని అపోహ, భయం తొలగిపోతాయి."

"నాకు నీపై ఇప్పుడు ఎలాంటి అనుమానం లేదు. నిన్ను పూర్తిగా విశ్వసిస్తున్నాను" అంది వైదేహి.

★ ★ ★

ప్రభ ఇంటి మెట్లెక్కుతుండగా వరండాలో పచార్లు చేస్తున్న ఆమె తండ్రిరామనాథం ఇంట్లోకి చూస్తూ, "అమ్మాయొచ్చింది, హారతి పళ్ళెం పట్రావే!"

కొత్తగాలి...

**పల్లెల్లో సైతం**
**ఆంగ్లపదాలు ఊరేగుతున్నాయి**
**అసలు మూలాల్ని**
**అణగదొక్కుతున్నారు**

– జి.శ్రీశైలం,
పెద్దచెల్మెడ

హేళన, ఆగ్రహం మిళితమైన ఆయన స్వరం విన్న ఆమెకి కామేశ్వర్రావు తమ ఇంటికి వచ్చి వెళ్ళిన సంగతి నిజమే అని రూఢీగా తెలిసింది.

నింపాదిగా మెట్లెక్కి లోపలకి వెళ్ళింది.

గోడకి చేరబడి ఏడుస్తున్న తల్లి మంకెన పూలలాంటి కళ్ళతో ఆమెని చూస్తూ "ఎక్కడెక్కడ, ఎవరితో తిరిగి వస్తున్నావే దౌర్భాగ్యురాలా!" అని అరిచింది.

"కామేశ్వర్రావు ఇక్కడకి వచ్చి వెళ్ళాడా? " తొణక్కుండా అడిగింది ప్రభ.

"వచ్చాడు. నువ్వెంత నీతిమాలిన దానివో, సిగ్గెగ్గులు, వావివరుసలు మరచిపోయి సానిదానికంటే హీనంగా దిగజారిపోయావో చెప్పాడు. నీకసలు అలాంటి పాడుబుద్ధెలా పుట్టిందే! పిల్లలు పుట్టకపోతే గొడ్డుమోతులా బతకలేవా? లేకపోతే ఎవరినైనా పెంచుకోలేకపోయావా? నీ మగడు సంసారానికి పనికిరాడని కొడుకుతో సమానమైన మరిదితో.. ఛీఛీ! కామంతో కళ్ళు మూసుకుపోయాయే నీకు? " పార్వతమ్మకి కూతురుని కిరసనాయిలు పోసి తగలబెట్టాలన్నంత ఉద్రేకంగా ఉంది.

"...అతను చెప్పిందంతా అబద్ధం! నేను తప్పు చెయ్యలేదమ్మా!"

మరుక్షణం ఆమె చెంప ఛెళ్ళుమంది.

ప్రళయకాల రుద్రునిలా మండిపడ్డాడు

రామనాథం.

"తప్పు చెయ్యలేదా? ఎందుకే మమ్మల్ని ఇంకా నమ్మించాలని చూస్తున్నావు! నువ్వు చేసిన తప్పు బయటపడి మీ అత్తగారి ఊరంతా కోడై కూస్తుంటే అక్కడ వుండడానికి ముఖం చెల్లక ఇక్కడకొచ్చి మా నెత్తిన కూర్చున్నావు. అంతకంటే ఏ నుయ్యో గొయ్యో చూసుకోలేకపోయావా? పీడా వదిలేది. ఎంత తలవంపులు తెచ్చావే పాపిష్టిదానా!"

"నేను మీ కూతురిని నాన్నా! చావనైనా చస్తాను కాని మీకు అప్రతిష్ఠ తెచ్చే పని ఎప్పుడూ చెయ్యను. రాత్రి చావాలనే గోదావరి ఒడ్డుకి వెళ్ళాను. బతుకుపై తీపో, బతికివుండి ఏదో సాధించాలనే తపనో నన్ను ఆపింది. లేకపోతే ఈపాటికి నా శవం కూడా మీకు దొరికేది కాదు."

పార్వతమ్మ, రామనాథం అపనమ్మకంగా, అయిష్టంగా కూతురిని చూస్తున్నారు.

"నా భర్త మగతనం లేనివాడైనా జీవితాంతం అతని భార్యగానే బతకాలనుకున్నాను. కాని మా అత్తగారు.." సిగ్గుతో చచ్చిపోతూ జరిగినదంతా చెప్పింది.

నిశ్చేష్టులయిపోయారు.

"నేనే నీ గొంతు కోసానమ్మా!" బావురుమన్నాడు రామనాథం.

"మీ అక్క పెళ్ళికైన అప్పు తీర్చలేక ఈ జన్మలో నీ పెళ్ళి చెయ్యలేనేమో అని బాధ పడుతున్న తరుణంలో పెద్ద సంబంధం వెతుక్కుంటూ వచ్చేసరికి వెనకా ముందు ఆలోచించకుండా నీ పెళ్ళి చేసాను."

"..నుదుటి రాతని ఎవరు తప్పించగలరు నాన్నా! కాని ఆయన చాలా మంచివారు. నేనంటే ఆయనకి ప్రాణం" ప్రభ స్వరం ప్రేమ పారవశ్యంతో వణికింది.

కూతురు ఏ సుఖానికీ నోచుకోకుండా సన్యాసినిలా బతుకుతోందనే వేదన మనసుని మెలి తిప్పుతున్నా. గుడ్డిలో మెల్ల అన్నట్టు అల్లుడు మంచివాడనే నిజం కాస్త ఊరటనిస్తోంది.

"ఈ దౌర్భాగ్యుడిని క్షమించు తల్లీ! కామేశ్వర్రావు మాటలు నా మనసుని విషపూరితం చేసాయి. నిన్ను అనుమానించి అవమానించాను. నిజానికి నిన్ను అనుమానిస్తే నన్ను నేను అనుమానించుకున్నట్టే" అన్నాడు రామనాథం సిగ్గుపడుతూ.

పార్వతమ్మకి కూతురి స్వభావం తెలిసి వుండీ తనెలా మాట్లాడిందో గుర్తొచ్చి ఏడుపొచ్చింది.

★ ★ ★

"ప్రభా!" నారాయణరావు పిలుపు విని, తండ్రి పూజ కోసం పూలు కోస్తున్న ప్రభ పూల సజ్జని అరుగుమీద పెట్టి గబగబా వీధి గుమ్మంలోకి వచ్చింది.

గుమ్మంలో నిలబడివున్న అతన్ని చూడగానే ఆమె గుండె సంతోషంతో వేగంగా కొట్టుకుంది. ఆనందం ఆర్ణవమవగా సంతోషం అలలాగా లేచి మనసుని ఉక్కిరిబిక్కిరి చేస్తుండగా అంది, "రండి, లోపలకి రండి..."

"నువ్వు లేని ఆ ఇంట్లో ఉండలేకపోయాను ప్రభా! మన ఇంటికి రావా?" ఆర్తిగా వుందతని స్వరం.

"ముందు మీరు లోపలకి రండి"

నారాయణరావు లోపలకి వచ్చి కూర్చున్నాడు. చిక్కిపోయి, నల్లబడిపోయిన అతన్ని చూస్తూ ఆందోళనగా అడిగింది.

"ఇంత చిక్కిపోయారేం.. ఒంట్లో సరిగానే వుందా?"

"నువ్వింట్లో లేకపోతే నాకేం బాగాలేదు ప్రభా!"

"మీ అమ్మగారు వున్నారుగా?"

నారాయణరావు ఆమె చేతిని, తన చేతిలోకి తీసుకుంటూ అన్నాడు.

"నిన్ను చాలా మిస్సవుతున్నాను ప్రభా!

కొత్తగాలి...

పల్లె
సొగసరి
పట్నం
డాబుసరి

– జి.ఆర్.వెంకటకుమార్, కత్తిపూడి

మన ఇంటికి వచ్చెయ్యి"

"వస్తాను. కాని ఇప్పుడు కాదు."

"మరెప్పుడు వస్తావ్?"

"ఇంకో ఎనిమిది నెలల తర్వాత"

"అదేమిటి?"

"నేను ఒక పసి బిడ్డని పెంచుకోవాలనుకుంటున్నాను."

"పాపా? బాబా?" అతని ముఖం వికసించింది.

"మీకెవరు కావాలి?"

"ఇద్దరూ కావాలి"

"ఎవరో ఒకరు. ఎవరైనా ఫర్వాలేదు. ఆరోగ్యంగా పెరిగి మనకి ఆనందాన్నిస్తే చాలు"

"ఇంతకీ ఎవరి పాప?"

"ఒకామె ప్రేమలోపడి మోసపోయింది. ప్రస్తుతం ఆమె గర్భవతి"

నారాయణరావు సానుభూతిగా చూసాడు. "ప్చ్! పాపం!" అన్నాడు.

"మీకేమీ అభ్యంతరంలేదుగా?"

"లేదు. సంతోషంగా వుంది."

ప్రభ అతని ముఖంలోకి రెప్పవాల్చకుండా చూస్తోంది.

ఆ ముఖంలో పితృ గర్వం!

"నేను కామేశ్వర్రావుతో తప్పుచేసానని మీరు నమ్ముతున్నారా?"

"ఛ! నువ్వు తప్పుచెయ్యవు ప్రభా! నువ్వు మంచిదానివి"

ప్రభకి కన్నీళ్ళొచ్చాయి. అవి దుఃఖాశ్రువులు కాదు ఆనందబాష్పాలు.

"కృతజ్ఞురాలిని. కాని ఒక్క విషయం. మీ అమ్మగారికి నేను ఎవరి బిడ్డనో పెంచబోతున్న విషయం ఇప్పుడే కాదు ఎప్పటికీ తెలియనివ్వకండి. మరో మాట ఆవిడని ఇక్కడకి రానివ్వద్దు."

"నీకు వాగ్దానమిస్తున్నాను" అన్నాడు నారాయణరావు.

★ ★ ★

జగదీశ్వరరావు భార్యని, కూతురిని తిరుపతిలో వుంచడానికి అన్ని ఏర్పాట్లు చేసాడు. కూతురికి పుట్టబోయే బిడ్డని పెంచుకోడానికి సిద్ధపడిన ప్రభ వాళ్ళకి దేవతలా కనిపిస్తోంది.

నర్సింగ్ హోమ్ దగ్గరలో ఒక ఫ్లాట్ అద్దెకి తీసుకున్నారు. వైదేహి, ఆమె తల్లి జానకీతో బాటు ప్రభ కూడా వాళ్ళతోనే వుంటోంది.

వైదేహికి స్కానింగ్ తీసిన డాక్టర్ ఆమె గర్భంలో కవల పిల్లలు పెరుగుతున్నారని చెప్పింది.

"ఇద్దరు పిల్లలని పెంచగలవా ప్రభా" వైదేహి అడిగింది.

"కష్టమే! కాని అందులోనూ ఆనందం వుంది" అంది ప్రభ. ఆమెకి హఠాత్తుగా భర్తని మీకు బాబు కావాలా పాప కావాలా? అని తను అడగడం, అతను ఇద్దరూ కావాలి అని చెప్పడం గుర్తొచ్చింది. భర్త కోరిక తీరబోతున్నందుకు ఆమెకి సంతోషంగా వుంది. ప్రభ తల్లికంటే ఎక్కువగా వైదేహిని చూసుకుంది. నెలలు నిండిన వైదేహికి సిజేరియన్ చేసింది డాక్టరు. కవల్లలో ఒకరు ఆడ, మరొకరు మగ.

జానకి డాక్టరుని కలుసుకుంది.

"మీరు అమ్మాయికి పాలుపోడానికి మందు ఇవ్వాలి. పిల్లలకి స్తన్యమిస్తే తల్లి బిడ్డల అనుబంధం గట్టిపడుతుంది. నా కూతురు పిల్లలని జన్మలో వదలదు."

"ఓకే! కాని పిల్లలనేం చెయ్యాలనుకుంటున్నారు? "

"మా అమ్మాయి ఫ్రెండ్ వాళ్ళని పెంచుకుంటానంది. ఆమెకి పెళ్ళయింది. కాని పిల్లలు లేరు. ఆమె భర్తలో లోపంవలన అది సాధ్యపడదు."

"గాడ్ ఈజ్ గ్రేట్! పిల్లలని అనాథలని చెయ్యకుండా వాళ్ళకో తల్లిని ఇచ్చాడు" అంది డాక్టరు.

నెలరోజులు డాక్టరు పర్యవేక్షణలో పిల్లలు పెరిగారు. తరువాత రాజమండ్రి ప్రయాణమయ్యారు. స్టేషనుకి రామనాథం దంపతులు వచ్చారు. పిల్లలతో ట్రెయిన్ దిగబోతున్న ప్రభని వారించి పిల్లల నుదుట ముద్దుల వర్షం కురిపిస్తూ బావురుమంది వైదేహి.

"నా దగ్గర పెరుగుతున్నా వాళ్ళు ఎప్పటికీ నీ పిల్లలే! నువ్వెప్పుడు కావాలంటే అప్పుడు వాళ్ళని చూడొచ్చు" అని ఆమెను ఓదార్చింది ప్రభ. వైదేహి పిల్లలని వదలలేక వదిలింది!

★ ★ ★

రిక్షా దిగి చేతులలో పసిబిడ్డతో నుంచున్న ప్రభకి ముత్తయిదువలచేత దిష్టి తీయించింది సూర్యకాంతమ్మ. ప్రభ రమ్యని, పార్వతమ్మ హరిని ఎత్తుకుని ఇంట్లోకి నడిచారు.

ప్రభ నెల తప్పిందని కనీసం ఉత్తరమైనా రాయని వియ్యాలవారిమీద కోపం, కోడలి సీమంతం ఘనంగా చేద్దామనే తన కోరిక తీరలేదనే అసంతృప్తి మనుమల్ని చూడగానే సూర్యకాంతమ్మ మనసులోంచి మటుమాయమయ్యాయి. అంతవరకు తను తప్పు చేసిందేమో అనే గిల్టీ ఫీలింగ్‌తో బాధపడుతున్న ఆవిడ కోడలి ముఖంలోని నవ్వు చూసాక తృప్తిగా నిట్టూర్చింది. "నా వజ్రాల మూట ఏడీ? నా బంగారు తండ్రి ఏడీ? " అని మనుమడిని ఎత్తుకుని ముద్దులాడింది.

## కొత్తగాలి...

**చైనా పెన్ను**
**ఇండియా కరెన్సీపైన**
**రాస్తుంది**
**కమ్యూనిజం**

– కొలకలూరి ఇనాక్,
హైదరాబాద్

నారాయణరావు అయితే రమ్యని క్షణం కూడా వదలడంలేదు.

మూడోనెల వచ్చినా పిల్లలు అర్భకంగా వున్నా చలాకీగా, ఆరోగ్యంగా వున్నారు.

పార్వతమ్మ వియ్యాపురాలివైపు తిరస్కారంగా ఒకసారి చూసి కాళ్ళు కడుక్కోడానికి పెరట్లోకి వెళ్ళింది.

ఇంతలో పిల్లలిద్దరూ ఆకలికి ఏడవడం మొదలుపెట్టారు.

"ప్రభా! వీళ్ళకి పాలుపట్టి ఎంతసేపయింది? " కోడలిని అడిగింది.

"చాలా సేపయిందత్తయ్యా"

"పిల్లలని ఆ గదిలోకి తీసుకెళ్ళు"

ప్రభ వంటగదిలోకి వెళ్ళి స్టవ్ వెలిగించి నీళ్లు పెట్టింది. ఆమె చేతిలోని పాలసీసాలని చిత్రంగా చూస్తే "అదేమిటే, పోత పాలు పోస్తున్నావు! నీ దగ్గర పాలు లేవూ" అంది.

"లేవత్తయ్యా!" కూల్‌గా చెప్పి పిల్లలని గదిలోకి తీసుకెళ్ళింది. పార్వతమ్మ కూతురిని అనుసరించింది. తిరిగి బయటకొచ్చిన ఆవిడపై మొదలయ్యాయి వియ్యపురాలి విసుర్లు.

"నెల తప్పిందని ఉత్తరం ముక్కయినా రాయలేదు. ఏడోనెలలో సీమంతమయినా చెయ్యలేదు. నా కోడలు పురుటి మంచం మీద వుండగా చూడాలనుకున్నాను. కనీసం డెలివరీ అయిందని కూడా చెప్ప లేదు. మాఅబ్బాయి చెప్తే వినడమే"

"ఇవన్నీ మీ అబ్బాయిని అడగండి, అన్నీ అతను చెప్పినట్టే చేసాం" అంది పార్వతమ్మ.

"అవును నేనే చెప్పద్దన్నాను. ఊరంతా చెప్పుకునే గొప్ప విషయమా ఇది? " అన్నాడు నారాయణరావు. సూర్యకాంతమ్మ నోరు మూతబడింది.

పిల్లల బాలసారె ఘనంగా చేద్దామన్న అత్తగారి ప్రతిపాదననీ తిరస్కరించింది ప్రభ.

"వద్దత్తయ్యా! ఎవరినీ పిలవద్దు. సింపుల్‌గా మనమే కానిచ్చేద్దాం"

"ఇన్నాళ్ళకి ఈ ఇంట్లో పసిపిల్లలు కేర్ మన్నారు. నా ముచ్చట తీర్చుకోనీ"

"వద్దు. నాకిష్టంలేదు" కరాఖండీగా ధ్వనించింది ప్రభ స్వరం. నారాయణరావు వంత పాడాడు.

సూర్యకాంతమ్మ మిన్నకుండిపోయింది. ఇరుగు పొరుగువాళ్ళు పిల్లలని చూడ్డానికి వచ్చి తలో రకంగా వ్యాఖ్యానించేవారు.

"మరోసారి కష్టపడకుండా కొడుకుని, కూతురిని ఒకేసారి కన్నావమ్మా!" అంది ఒకావిడ. "పిల్లాడు ఎవరి పోలికో చెప్పలేను కాని, పిల్ల మాత్రం అచ్చు కామేశ్వ్రరావు పోలికే" మరొకావిడ అంది.

"అదేమిటి? వస్తే నా కొడుకు పోలిక లేకపోతే నా కోడలు పోలిక రావాలి. కాని మధ్యవాడి పోలిక ఎందుకొస్తుంది" గతుక్కుమన్న సూర్యకాంతమ్మ ముఖం గంటు పెట్టుకుని అంది.

"ఏం బాబాయి పోలిక రాకూడదేమిటి? " వంకరగా నవ్వింధావిడ.

అలా నోటితో మాట్లాడుతూ నొసలుతో వెక్కిరించినట్టు వుండేవి వాళ్ళ మాటలు.

ప్రభ భావ రహితమైన ముఖంతో వాళ్ల మాటలు వినేది. సూర్యకాంతమ్మ వచ్చిన వాళ్ళు వెళ్ళాక వాళ్ళని తిట్టుకునేది.

"నా మనుమలు ఎవరి పోలికైతే వాళ్ళకెందుకు? చూసి వెళ్ళక అక్కర్లేని వాఖ్యానాలొకటి!" అని ఈసడించేది.

ప్రభ, ఆ క్షణంలో అత్తగారివైపు చూసిన చూపులో పదునైన భావం కనిపించేంది. నల్లబడిన ఆవిడ ముఖంలో అపరాధ భావన కనబడేది.

★ ★ ★

సూర్యకాంతమ్మకి ప్రభని చూస్తుంటే ఆమెలో బాలింత లక్షణాలు కనబడకపోవడంతో అనుమానం వచ్చేది.

ప్రభ నిజంగానే పిల్లల్ని కందా? లేక ఎవరి పిల్లలనయినా తెచ్చి పెంచుతోందా? అని అనుమానం ఆవిడది.

రమ్యలో రోజురోజుకీ స్ఫుటంగా కనిపిస్తున్న కామేశ్వ్రరావు పోలికలు ఆవిడకు ఊరట కలిగిస్తున్నా మనసులో ఆ అనుమానం ముల్లులా గుచ్చుతూనే వుండేది. కోడలిని నేరుగా అడగాలంటే భయం, సందేహం.

నిప్పు లేనిదే పొగ రాదనీ, ప్రభకి కామేశ్వ్రరావుతో ఆ సంబంధం లేకపోతే ఊరంతా ఎందుకు చెప్పుకుంటారు? రమ్యలో కామేశ్వ్రరావు పోలికలు ఎందుకుంటాయి? అని తనని తాను సమాధాన పరచుకునేది.

★ ★ ★

ఆరునెలల తరువాత తండ్రి తన పెళ్ళి ప్రస్తావన తేగానే వైదేహి అదిరిపడింది.

"నాకు పెళ్ళా? వద్దు. నాకిష్టంలేదు"

"జీవితాంతం ఒంటరిగా బతుకుతావా? "

"మీరుండగా నేను ఒంటరినెలా అవుతాను నాన్నా? "

"నీకు నూరేళ్ళ జీవితం వుంది. నీకు జీవితాంతం మేము తోడుగా వుండటం ఎలా సాధ్యం? లక్షల ఆస్తికి ఒక్కగానొక్క వారసురాలివి నువ్వు. మగతోడు లేకుండా ఈ జనారణ్యంలో ఎలా బతకగలవ్? " ఆవేదనగా అడిగాడు జగదీశ్వ్రరావు.

"అందుకని పెళ్లి చేసుకుని మరో వ్యక్తిని మోసం చెయ్యమంటారా? "

"నీ గురించి అంతా తెలిసిన వ్యక్తి నిన్ను పెళ్ళిచేసుకోడానికి ముందుకొస్తే? "

"అలాంటి ఆదర్శ పురుషులు కథల లోను, సినిమాలలోను మాత్రమే వుంటారు. నిజజీవితంలో వుండరు"

"వస్తే చేసుకుంటావా? "

వైదేహి జవాబివ్వలేదు.

"సాయంకాలం ఒకతను మన ఇంటికి వస్తున్నాడు. అతను నీకు నచ్చితే... నచ్చు తాడనే నమ్మకం నాకు వుంది"

పెళ్ళి అనే మాట వినగానే వైదేహికి విర క్తిగా అనిపించింది. అతను చేసిన మోసం గుండెల్లో ఇంకా పచ్చిగా వుండగానే తండ్రి వివాహ ప్రతిపాదన తెచ్చాడు. అతనికి తన సర్వస్వాన్ని అర్పించి, అతని బిడ్డలకి తల్లయిన తను మరో వ్యక్తితో పెళ్ళికెలా సిద్ధపడగలదు? ఆమె మనశ్శరీరాలు ఎదు రుతిరుగుతున్నాయి.

సాయంకాలమయినా వైదేహి కూర్చున్న చోటనే స్తబ్దుగా కూర్చుని వుంది.

తల్లి వచ్చి పిలిచింది. "నిన్ను మీ నాన్న గారు పిలుస్తున్నారు. అతను వచ్చాడు."

వైదేహి మనసులో ఎలాంటి స్పందన లేదు. మనసు మంచుగడ్డల మధ్య నొక్కి పట్టినట్టు వుంది. యాంత్రికంగా గది బయటకొచ్చింది. రేగిన జుట్టు నలిగిన చీరతో వున్న కూతుర్ని చూసి జగదీశ్వ రావు మనసు బాధతో మూలిగింది. 'కోట్ల ఆస్తికి ఏకైక వారసురాలు. కూతురికి గొప్పింటి సంబంధం తేవాలని పెళ్ళి ఘనంగా చెయ్యాలని ఎన్ని కలలు కన్నాడు? ' ఆయన బరువుగా నిట్టూ ర్చాడు.

"మా అమ్మాయి వైదేహి. ఇతను సుధా కర్" పరస్పరం పరిచయం చేసాడు.

"నమస్తే" అన్నాడతను.

వైదేహి ప్రతినమస్కారం చెయ్యలేదు.

## చతురలో ఆరో నవల



**హోతా పద్మినీదేవి**

ప్రతిష్ఠాత్మక మాసపత్రిక చతురలో 'సంఘర్షణ' నా ఆరో నవల. గతంలో ఇదే పత్రికలో ప్రచురితమైన నా 'గాజురాళ్లు', 'బాధ్యత', 'గడప', 'గెలుపు', 'సరిత' నవలలను పాఠకలోకం బాగా ఆదరిం చింది. ఇప్పుడు 'సంఘర్షణ' పైన కూడా సద్విమర్శలకు మనస్ఫూర్తిగా స్వాగతం పలుకుతున్నాను. ఇప్పటివరకూ వివిధ పత్రి కల్లో 60 కథలు, ఎమెస్కో ద్వారా 10 నవ లలు, వార, మాస పత్రికల్లో సీరియల్స్, నవలికలు ప్రచురితమయ్యాయి. పుస్తకాలు చదవడం, రచనలు చేయడం నా హాబీ.

నిరాసక్తంగా చూస్తోంది.

తండ్రి అడుగుతున్న ప్రశ్నలకి అతను వినయంగా జవాబిస్తున్నాడు.

వైదేహి ఆలోచనా స్రవంతిలో కొట్టుకు పోతోంది. "తను చదువుకుంది. తండ్రి వ్యాపారాన్ని ఆయన మార్గదర్శకత్వంలో సమర్థవంతంగా నిర్వహించగలననే నమ్మకం ఉంది. తండ్రి ఎవరినో పెళ్ళి చూపులకి తీసుకొస్తే మాత్రం తగుదు నమ్మా అని తనెలా సిద్ధపడింది?

తను పెళ్ళి చేసుకోదు. స్థిరంగా నిశ్చ యించుకుంది. "వైదేహిగారూ!"

"ఆc!" ఉలిక్కిపడి చూసింది.

తండ్రి తామిద్దరినీ ఒంటరిగా వదిలి

అక్కడనుంచి ఎప్పుడు వెళ్ళిపోయాడో కూడా ఆమె గమనించలేదు.

"మీరేదో ఆలోచిస్తున్నట్టున్నారు" చిరునవ్వుతో అన్నాడు సుధాకర్.

"ఏం లేదు" అతని వైపు చూడకుండానే అంది.

"మీ నాన్నగారు నా గురించి మీకు చెప్పేవుంటారు" ఉపోద్ఘాతంగా అన్నాడు.

"చెప్పారు"

"దట్స్ గుడ్! మీకేమైనా అభ్యంతరాలుంటే తెలియచెయ్యవచ్చు"

పెళ్ళిపట్ల తన నిరాసక్తతని అతనికి ఎలా తెలియచెయ్యాలో అని ఆలోచిస్తున్న ఆమెకి అతనే ఆ ప్రస్తావన తేవడంతో రిలీఫ్‌గా అనిపించింది.

"నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు. ఎందుకంటే నేను మీకు తగినదాన్ని కాదు."

"నేనే మీకు తగినవాడిని కాను. నేను అనాథని. నన్ను పెంచిన అనాథ శరణాలయమే నన్ను చదివించింది. మీ ఫ్యాక్టరీలో ఉద్యోగానికి ఇంటర్వ్యూకి వచ్చిన నన్ను మీ నాన్నగారు మిమ్మల్ని పెళ్ళిచేసుకోమని అడిగారు. మీ నాన్నగారు తలచుకుంటే మీకు యువరాజుని తేగలరు. కాని నన్నే ఎందుకు ఎన్నుకున్నారు? అది ఆయన గొప్ప మనసుకి నిదర్శనం"

వైదేహి తల దించుకుని అంది, "మీకు నా గురించి ఏమీ తెలియదు"

"అంతా తెలుసు. మీ నాన్నగారు చెప్పారు. మీకే నా గురించి ఏమీ తెలియదు."

"నాకు తెలుసుకోవాలని లేదు"

"ఎందుకని? పెళ్ళిపట్ల నిరాసక్తతా? లేక నేను మీకు నచ్చలేదా?"

"మొదటిదే కరెక్టు. ఆ విషయం మీకు మొదట్లోనే చెప్పాను."

అతను కొన్ని క్షణాలు మౌనంగా వుండిపోయాడు. "ఓకే వైదేహిగారూ!" అని వెళ్ళిపోయాడు.

★ ★ ★

వైదేహి చెక్కిళ్ళు అశ్రుధారలతో తడిసిపోతున్నాయి. పెళ్ళి చేసుకోకూడదనే తన స్థిరనిర్ణయం వీగిపోయింది. తండ్రి బలవంతం ఒకవైపు, అంతకుమించి సుధాకర్ మంచితనం... కాదు అతను కనబరిచిన అతి మంచితనం మరోవైపు తన నిర్ణయాన్ని సడలిపోయేలా చేసాయి.

అతనితో తను పెళ్ళికి అంగీకరించేవరకు ఎంత మంచితనాన్ని నటించాడు? పెళ్ళయ్యాక నెలరోజుల పాటు ప్రేమలో ఓలలాడించాడు.

అతని మంచితనం నటన అని, అతను తనపై కనబరిచిన ప్రేమ బూటకమని తెలుసుకునేప్పటికే ఆలస్యమయిపోయింది.

సుధాకర్ తండ్రి తగ్గర ఉద్యోగస్థుడు... ఆయన బాస్.. తను సబార్డినేట్ అన్నట్టు వినయవిధేయతలతో ప్రవర్తించేవాడు. ఇంటి అల్లుడయ్యాక కూడా అతని ప్రవర్తనలో మార్పేమీ లేదు. అదే వినయం. డబ్బు తెచ్చిన హుందాతనం... ఖరీదైన బట్టలు, ఇంపోర్టెడ్ వాచ్, నల్లగా నిగనిగలాడే ఖరీదైన షూస్‌తో అతను గొప్పింటి బిడ్డలా వున్నాడు. జగదీశ్వర్రావు తన ఫ్యాక్టరీకి అతన్ని ఎమ్‌డిని చేసాడు.

మారుతీ జెన్ కారు కొని అల్లుడికి బహుమతిగా ఇచ్చాడాయన.

"ఎందుకండీ, ఆటోలో వెళ్తాను" మొహమాటంగా అన్నాడు సుధాకర్.

"నాకు అల్లుడివైనా కొడుకువైనా నువ్వే. నువ్వు కారులో తిరుగుతుంటే చూడాలనే నా కోరికను కాదనకు బాబూ!" ఆయన ఆర్ద్రంగా అంటుంటే సుధాకర్ కళ్ళు చెమర్చాయి.

ఆయన ప్రోత్సాహంతో డ్రైవింగ్ క్లాసులకి వెళ్తున్నాడు. నెల తిరిగేసరికల్లా డ్రైవిం

గ్‌లో నిష్ణాతుడయ్యాడు.

వైదేహి మనసులో కామేశ్వర్రావు చేసిన గాయం సుధాకర్ ప్రేమలో ఇప్పుడిప్పుడే మానుతోంది.

సుధాకర్ వైదేహి మెడవంపులో ముఖ మానించి వున్నాడు. అతని చేతివేళ్ళు ఆమె నడుముపై సరిగమలు పలికిస్తున్నాయి. ఆ దగ్గర తనంలో ఆమె శరీరంలో కోరిక జ్వలించడంలేదు. మనసు ప్రేమ పారవశ్యంతో పులకిస్తోంది. ప్రేమని అనుభూతించడం మనసుకి మాత్రమే తెలుసు.

"మీ నాన్నగారికి నేనంటే ఎందుకంత ఇష్టం? " వున్నట్టుండి అడిగేడతను.

"మీరు మంచివారు కాబట్టి"

"అందుకేగా ఏరి కోరి నన్ను అల్లుడిగా చేసుకున్నారు"

నవ్వింది వైదేహి సమాధానంగా.

"నిజానికి మీ ఇంట్లో అడుగుపెట్టే అర్హత కూడా లేదు నాకు. అనాథని..." ఇంకా ఏదో అనబోతున్న అతని పెదవులని అరి చేత్తో మూసేసింది.

"నేను వుండగా మీరు అనాథ ఎలా అవుతారు? " ఆ చేతిని సున్నితంగా తప్పించి చెప్పాడు.

"నేను అనాథననే నిజాన్ని ఎప్పటికీ మరిచిపోను. నన్ను కన్నవాళ్లెవరో తెలియదు నాకు. నాకు ఊహ తెలిశాక ఎప్పుడూ కొత్త బట్టలు వేసుకోలేదు. శరణాలయానికి మీలాంటి డబ్బున్న కుటుంబాలలోని పిల్లలు కట్టుకుని వదిలేసిన బట్టలు పంపేవారు. అవే కట్టుకున్నాను. నేను కట్టుకున్న బట్టలు సెకండ్ హేండ్‌వి. చదివిన పుస్తకాలు సెకండ్ హేండ్‌వి. చివరకి పెళ్లి చేసుకున్న నువ్వు కూడా..."

ఏమరిపాటుగా వున్నప్పుడు చెంపపై ఛెళ్లున కొట్టినట్టయింది. అతనిని అల్లుకున్న ఆమె చేతులు అప్రయత్నంగానే వదులయ్యాయి. మంచం దిగి స్థాణువులా

## కొత్తగాలి...

**మెత్తనైన పువ్వు వెనుక**
**గుచ్చునట్టి ముళ్లుండును**
**కపటపు చిరునవ్వు వెనుక**
**చిచ్చుపెట్టు గుణముండును**

*- రేగులపాటి కిషన్‌రావు, కరీంనగర్*

నిలబడిపోయింది.

'సెకండ్ హేండ్!' అతని స్వరం వ్యంగ్యంగా చెవులలో ప్రతిధ్వనిస్తోంది. మనసు చితికి కన్నీరు కారుస్తోంది.

"సారీ! ఏదో యాధాలాపంగా అన్నాను. క్షమించు" అతని స్వరంలో పశ్చాత్తాపం!

వైదేహి ఇంకా నమ్మలేకపోతోంది, అతనా పదప్రయోగం చేసాడంటే!

హఠాత్తుగా అతనామె పాదాల దగ్గర కూలబడి ఆమె పాదాలని పట్టుకున్నాడు.

"నన్ను క్షమించవా? " ఆర్తిగా అడిగాడు.

"ఛఛ! అదేమిటండీ!" ఆమె నొచ్చుకుంటూ రెండడుగులు వెనక్కి వేసింది.

"నిజం! నేను కావాలని అలా అనలేదు"

"ఫర్వాలేదులెండి. అయినా మీరన్నదీ నిజమే! నేను సెకండ్ హేండ్‌నే!" ఆమె రుద్ధస్వరంతో అంది.

"నువ్వు ఏడవడం మానేసి నవ్వితే నన్ను క్షమించినట్టు"

మనసులోని గాయం పచ్చిగా వున్నా కన్నీళ్ల మధ్య నవ్వింది. అతనామెని గాఢంగా కౌగిలించుకుని ముద్దు పెట్టుకున్నాడు.

కాలం గడిచేకొద్దీ సుధాకర్ అసలు స్వరూపం బయటపడసాగింది.

అతను తమ ఆస్తి కోసమే తనని పెళ్లి చేసుకున్నాడు. పెళ్లికి ముందే శీలం కోల్పోయిన తనపై అతనికి ఏహ్యత, చులకన

తప్పు ప్రేమలేదు. అది అతని మాటల లోనే వ్యక్తమయ్యేది.

ఒక రాత్రి... ఇద్దరూ ఏకశయ్యాగతుల యినప్పుడు అడిగేడతను.

"అతను సరసుడేనా? నీతో ఎలా ప్రవ ర్తించేవాడు? " భూమి రెండుగా చీలి పోయి, తను అందులో కూరుకుపోతే బాగుండుననిపించింది వైదేహికి. సిగ్గుతో ఆమె శరీరమే కాదు మనసు కూడా చచ్చి పోయిన క్షణాలవి.

"ఇంట్లో వాళ్లకి తెలియకుండా ఎవరినో ప్రేమించడమే కాదు, వ్యవహారాన్ని పక్క దాకా తీసుకెళ్లిన నువ్వెంత గ్రంథసాంగురా లివో! అవును, మీరిద్దరూ ఎన్నిసార్లు కలు సుకున్నారు? "

వైదేహికి తలబద్దలు కొట్టుకుని చావాల నిపిస్తోంది.

"చెప్పవే!" తొడపాశం పెడుతూ అన్నాడు. కెవ్వుమంది. ఉప్పెనలా ముంచుకొచ్చిన దుఃఖపు తెరల మధ్య అస్పష్టంగా అంది, "రెండు సార్లు"

"అబద్ధం! రెండుసార్లకే నువ్వు తల్లివ య్యావా? నేను నమ్మను. మన పెళ్లయి మూడు నెలలు. మరి ఇప్పుడు నెల తప్పలేదేం? "

ఆమె నిస్సహాయంగా ఏడుస్తోంది. "నిజం!" అంది.

"నమ్ముతానులే! ఏడుపు ఆపు" సిగరెట్టు వెలిగించుకుంటూ అన్నాడు.

"రామాయణం చదివేవా? " ఉన్నట్టుండి రామాయణం ప్రసక్తి దేనికో అర్థంకాక చూస్తోంది.

"చదివి వుండవులే! పోనీ సినిమా చూసావా? "

తల ఊపింది.

"సీత చేత రాముడు అగ్ని ప్రవేశం ఎందుకు చేయించాడు? "

"రావణాసురుడి చెరలో వున్నందుకు" తనే జవాబిచ్చాడు.

"ఏ పాపమూ చెయ్యని సీతని, ఏ మాలి న్యమూ అంటని ఆ మహాసాధ్వితో అగ్ని ప్రవేశం చేయించాడే రాముడు. మరి ఎవ డితోనో కులికిన నిన్ను నేనేంచెయ్యాలి? "

ఏం జరగబోతోందో అర్థమయ్యేలోగా ఆమె ఎడమ వక్షంపై అతని చేతిలోని సిగ రెట్టు అంటింది.

"అమ్మా!" కెవ్వుమంది. కాలినచోట చర్మం భగ్గుమంటోంది.

కుడివక్షం పొత్తికడుపు.. చివరకి తొడల మధ్య ఆరింది సిగరెట్టు. ఆమె ఆర్తనాదా లని అతను వినోదంగా కసిగా విన్నాడు. తరువాత ఆమెని ఆక్రమించుకున్నాడు. బాధ... భయం... నెప్పి... ఆమెకి స్పృహ తప్పింది.

★ ★ ★

ఏకాంతంలో వైదేహిని శారీరకంగా మానసికంగా హింసించే సుధాకర్ జగదీ శ్వరరావు సమక్షంలో ఆమెపై అవసరమైన దానికంటే ఎక్కువ ప్రేమానురాగాలని ప్రదర్శించేవాడు.

వైదేహి తన జీవితానికో అర్థం చెప్పింద నేవాడు. మోడువారిన తన బతుకులో ఆమె వసంతాన్ని తెచ్చిందనేవాడు.

కూతురిపై అతను ప్రదర్శిస్తున్న ప్రేమ నిజమని నమ్మేడాయన. తను అపాత్ర దానం చెయ్యలేదనే నమ్మకంతో గర్వప డ్డాడు. అన్నింటినీ మించి ఫ్యాక్టరీలో విధి నిర్వహణలో అతను చూపిస్తున్న శ్రద్ధ, అంకితభావం ఆయనలో కొత్త ఆలోచన లను రేకెత్తించాయి. ఆ ఆలోచన నిర్ణ యంగా మారడానికి ఎన్నో రోజులు పట్ట లేదు. తన నిర్ణయాన్ని కూతురితో చెప్పడా నికి ఆయన సందేహించలేదు.

ఫ్యాక్టరీపై సర్వాధికారాలను అల్లుడి పేర రాస్తానంటున్న తండ్రివైపు అదిరిపడి చూసింది వైదేహి.

సుధాకర్ పయోముఖ విషకుంభమని ఆయనకి తెలియదు. అతను ఆస్తి కోసమే తనని పెళ్లి చేసుకున్నాడనేది స్పష్టంగా తనకి తెలుసు. పాపం! తండ్రికి తెలియదు.

ఫ్యాక్టరీ తమ ఆస్తిలో సగభాగం. అది సుధాకర్‌కి ధారాదత్తం చెయ్యడం పిచ్చివాడి చేతిలో రాయి వుంచినట్టే. తను ఆయన ప్రయత్నాన్ని ఆపాలి.

'కాని కన్నతండ్రి ముందు సిగ్గువిడిచి నా భర్త ప్రవర్తన ఇది అని ఎలా చెప్పగలదు? '

రెండు రోజుల సంఘర్షణని అనుభవించి తరువాత తల్లిని అడిగింది, "నాన్నగారు ఫ్యాక్టరీని సుధాకర్‌కి వ్రాస్తానంటున్నారు? "

"అవును. నాకూ చెప్పారు. మాకు మాత్రం ఎవరున్నారు? కొడుకైనా అల్లుడైనా అతనే కదా!" అంది జానకి.

"నా భర్త మీరనుకుంటున్నంత మంచివాడు కాదమ్మా! మంచివాడిలా నటిస్తున్నాడు."

"నువ్వు చెప్పేది నిజమా? " అదిరిపడింది. వైదేహి కన్నీళ్ళతో అతని ప్రవర్తన చెప్పింది. అతని పైశాచికత్వానికి గుర్తుగా అతను తన ఒంటిమీద చేసిన గాయాలని చూపించింది.

జానకి షాకయిపోయింది. తరువాత కూతురిని కౌగలించుకుని బావురుమంది.

"ఇంత చిత్రహింసననుభవిస్తూ నీలో నువ్వు కుమిలిపోయావు తప్ప నాకెందుకు చెప్పలేదమ్మా? " వేటగాడి బాణానికి నేల కూలిన పక్షిలా విలవిలాడుతూ అడిగింది.

"నా పెళ్ళిచేసి నా జీవితానికో దారి చూపించారనే మీ ఆనందాన్ని పాడుచెయ్యడం ఇష్టంలేక చెప్పలేదు. అయినా తెలుసుకుని మాత్రం ఏం చెయ్యగలరు? "

"ఆ వెధవ కాళ్లూ చేతులు విరగ్గొట్టించి బుద్ధి చెప్పే వాళ్ళం"

వైదేహి ఇన్నాళ్ళుగా తను అనుభవిస్తున్న వేదన కరిగిపోయేలా తల్లి ఒడిలో పడి వెక్కివెక్కి ఏడ్చింది.

భార్య ద్వారా అల్లుడి నిజస్వరూపాన్ని విన్న జగదీశ్వర్రావు మొదలు నరికిన మానులా కూలబడ్డాడు. తను కూతుర్ని వటవృక్షపు నీడలో చేర్చానని, ఆ నీడలో కూతురి జీవితానికి భద్రత ఏర్పడినట్టే అని సంతోషిస్తున్నాడు ఇన్నాళ్ళూ. కాని అది పడగనీడ అని అర్థమై ఆయనకి చెమటలు పడుతున్నాయి. కూతురి జీవితం అపరిష్కృతమైన ప్రహేళికలా కనిపిస్తోందాయనకి.

ఒకరోజు అల్లుడి రెండు చేతులూ పట్టుకున్నాడు జగదీశ్వరరావు.

"ఛ! అదేమిటి మామగారూ! పెద్దవారు! మీరు నన్ను క్షమాపణ కోరేంత పెద్ద తప్పు ఏంచేసారు? "

"నేను వైదేహి గతాన్ని దాచలేదు. అంతా నిజమే చెప్పాను. నువ్వు కూడా ఆమెని ఇష్టపడే పెళ్ళి చేసుకున్నావు! ఎందుకు దాన్ని హింసిస్తున్నావు? " ఆవేదనగా అడిగాడు.

"పెద్దవారు. మీతో అబద్ధం చెప్పను. మీ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నది కేవలం మీ ఆస్తికోసం" సుధాకర్‌లోని తెగింపుకి షాకయిపోయాడు.

"నీకేం కావాలో చెప్పు ఇస్తాను. నువ్వు వైదేహిని ప్రేమగా చూడకపోయినా ఫర్వాలేదు. దాన్ని హింసించకు" కన్నీళ్ళతో బతిమాలాడు.

"మీ ఆస్తిమొత్తం నాకివ్వండి. వైదేహిని పువ్వుల్లో పెట్టి పూజిస్తాను"

జగదీశ్వర్రావుకి అతన్ని బతిమాలిన తన బలహీనతకి తనమీద తనకే అసహ్యం వేసింది. 'వైదేహిని డబ్బుకోసం చేసుకున్నానని నిర్మొహమాటంగా చెప్పిన

వాడు నిజంగా తను ఆస్తి ఇస్తే ఆమెని ప్రేమగా చూస్తాడా?' ఆయన అతనికేమీ సమాధానమివ్వకుండా అక్కడనుంచి వచ్చేసాడు.

మరో నాలుగు నెలలకే హార్ట్‌ఎటాక్ రూపంలో మృత్యువు ఆయన్ని కబళించింది. చనిపోయిన పద్నాలుగవ రోజున పర్సనల్ లాయర్ ఆయన స్వదస్తూరీతో రాసిన విల్లుని వైదేహికి అందచేసాడు.

ఆ విల్లు ప్రకారం జగదీశ్వరరావుగారి స్వార్జితమైన ఆస్తి మొత్తం భార్యకి కూతురికి చెరిసగం చెందుతుంది. జానకి తదనంతరం ఆమె ఆస్తి కూడా వైదేహికి చెందుతుంది. ఒకవేళ వైదేహికి పిల్లలు పుట్టకపోతే ఆస్తి మొత్తం గౌతమీ జీవకారుణ్య సంఘానికి, మదర్ థెరీసా ఛారిటీస్‌కి చెందుతుంది.

ఆ రాత్రి సుధాకర్ వైదేహిని అడిగాడు.

"మీ నాన్న విల్లు రాసాడుట"

"అవును" అంది. ఆ టైములో ఆమె డైనింగ్ టేబిల్ దగ్గర అతనికి భోజనం వడ్డిస్తోంది.

"ఏం రాసాడు ఆ విల్లులో?"

మొదటిసారిగా తెగించింది వైదేహి, "మీకు ఒక్క పైసా కూడా రాయలేదు"

"అంటే?"

ఆమె తండ్రి విల్లులో ఏం రాసాడో యథాతథంగా చెప్పింది. సుధాకర్ కళ్ళు ఎర్రబడ్డాయి. "ముసలాడు నన్ను నిలువునా ముంచేసాడు! వీడు ఇంత పనిచేస్తాడని తెలిస్తే ఎప్పుడో వాడిని చంపేద్దును. చచ్చి బతికిపోయాడు. ఆస్తి నాకు రాయొద్దని నువ్వే వాడికి చెప్పి వుంటావు. నిన్ను బతకనివ్వనే!" అంటూ అతను ఆమె పైకి లంఘించి మెడని చేతులలో దొరకబుచ్చుకుని బలంగా నొక్కడం మొదలెట్టాడు. వైదేహి నాలుక, కనుగుడ్లు వెళ్ళుకొస్తున్నాయి. అతని చేతులలో ఆరోజు తను చావడం ఖాయమనిపించింది.

## కొత్తగాలి...

**యువతకు ఉద్యోగాలు**
**విదేశాల్లో వస్తుంటే**
**వృద్ధాశ్రమాలకు**
**వేయేనుగుల బలం**

– కూర్మాన వెంకట సుబ్బారావు,
విశాఖపట్నం

అప్పుడే కిచెన్‌లోంచి బయటకొచ్చిన వంట మనిషి ఆ దృశ్యాన్ని చూసి బిగ్గరగా అరిచింది. పనివాళ్ళు అంతా అక్కడ చేరి అతన్ని వెనక్కి లాగేసారు. జానకి చనిపోయాక అతని ఆగడాలు మరీ మితిమీరిపోయాయి.

వైదేహి అతని అడ్డు తొలగించుకోవాలనుకుంది. తన పలుకుబడిని, డబ్బుని ఉపయోగించింది. ఒకరోజు డబ్బుకోసం అతను ఆమెతో గొడవపడ్డాడు. వైదేహి కావాలనే గొడవ పెద్దదయ్యేలా చేసింది. అతను ఒళ్ళు తెలియని ఆవేశంలో ఆమెపై హత్యాప్రయత్నం చేసాడు. సరిగ్గా అదే సమయంలో పోలీసులు రంగప్రవేశం చేసారు. సుధాకర్ అరెస్టయ్యాడు.

★ ★ ★

"ఫోన్ మోగింది. పక్కనే సోఫాలో కూర్చున్న కామేశ్వర్రావు ఎంత పరధాన్యంగా ఉన్నాడంటే ఫోన్‌మోగిన శబ్దం కూడా అతన్ని ఈ లోకంలోకి తీసుకురాలేకపోయింది.

వంటింట్లోంచి సీత వచ్చి ఫోన్ రిసీవ్ చేసుకుని "ఫోన్ మీకే!" అంది. అప్పటికే అతను పరధ్యాసగానే వున్నాడు.

"ఏమండీ!" గట్టిగా పిలిచింది.

"ఆc!" ఉలిక్కిపడ్డాడు.

"ఫోన్ మీకే"

"ఆc!"

అతను ఫోన్ అందుకుని మాట్లాడి పెట్టే సాడు. అప్పటివరకు సీత అక్కడే నిలబడి వుంది. అతను ఫోన్‌లో సంభాషించడం పూర్తికాగానే అడిగింది, "ఏమిటో ఇవాళ పరధ్యానంగా వున్నారు? మీ ప్రభ గుర్తు కొస్తోందా" సీత గొంతులో వ్యంగ్యం లేదు. ఆమె స్వరాన్ని విని ఆమెలో కదలాడే భావోద్వేగాన్ని పట్టుకోగల శక్తి లేదతడికి. పట్టుబడిన దొంగలా చూసిన కామేశ్వర్రావు 'తలనెప్పిగా వుంది. కాస్సేపు పడుకుంటాను' అని బెడ్‌రూమ్‌లోకి వచ్చాడు.

అతనికి నిజంగానే ప్రభ గుర్తుకొచ్చింది.

తనకి లొంగని కొరకరాని కొయ్యలాంటి ప్రభ! 'నారాయణరావులో మగతనం లేదని సూర్యకాంతమ్మ చెప్పిన మాట నిజమే అయితే మరి ప్రభకి పిల్లలెలా పుట్టారు? రమ్యకి తన పోలికలెలా వచ్చాయి?' అనే ప్రశ్నలు అతన్ని కొన్నేళ్ళుగా వేధిస్తున్నాయి. అతనికి గతం గుర్తుకొస్తోంది.




సూర్యకాంతమ్మ తన దగ్గర ఆ ప్రస్తావన తేగానే ఉలిక్కిపడ్డాడు కామేశ్వర్రావు.

తప్పు చెయ్యకూడదని మందలించవలసిన పెద్దమ్మే తప్పు చెయ్యమని ప్రోత్సహిస్తోంది. అతను కొన్ని నిమిషాలపాటు తను విన్న విషయాన్ని జీర్ణం చేసుకోలేక పోయాడు.

"నువ్వు కాదంటే నా వంశం నిర్వంశంగా అంతరించిపోతుంది!" ఆవిడ ఏడ్చింది.

కామేశ్వర్రావు కళ్ళముందు ప్రభ కనిపిస్తోంది. ఆమె అసమాన సౌందర్యం, లావణ్యం గుర్తురాగానే అతని మనసులో చిన్న అలజడి. అది ఇదివరకెప్పుడూ లేనిది. సూర్యకాంతమ్మ మాటలతో అతనిలో ఆమె అందం పట్ల ఉన్న ఆరాధన కోరికగా మారింది. అతను ప్రభతో మాటలు కలిపాడు. మనసులోని కోరికకి ప్రేమ అనే ముసుగువేసి ఆమెని ప్రేమించానన్నాడు. ప్రభ అతన్ని తిరస్కరించింది. బాహాటంగా ఆమెపై వున్న కోరికను వెల్లడించిన అతన్ని చెంపదెబ్బ కొట్టింది.

కామేశ్వర్రావు అవమానంతో దెబ్బతిన్న బెబ్బులి అయ్యాడు. అవమానంలోంచి ప్రతీకార జ్వాల రగిలింది. ఆమె జీవితంపై కొట్టాలనుకున్నాడు.

ఒక సాయంకాలం నాలుగు గంటలకి నారాయణరావు షాపులోను, సూర్యకాంతమ్మ గుడికి వెళ్ళిన సమయం చూసి దొంగలా ప్రభ ఇంటికి వెళ్ళాడు. వీధి తలుపులు మూసివున్నాయి. అతను పిల్లిలా దొడ్డిదారిన ఇంట్లోకి ప్రవేశించాడు. పెరటి తలుపు పనిమనిషి వచ్చేవేళకి తెరిచి ఉంచుతారని అతనికి తెలుసు. ఆ ఇంట్లోని అణువణువూ అతనికి పరిచితమే. నేరుగా పడక గదిలోకి వెళ్ళాడు. ప్రభ ఆదమరిచి నిద్రపోతోంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలకి అనుగుణంగా కదులుతున్న ఆమె యౌవనపు పొంగులు అతని మతి పోగొట్టాయి. బలవంతంగానైనా ఆమెని అనుభవించాలనే కోరిక కలిగింది. అంతలోనే మరో క్రూరమైన ఆలోచన వచ్చింది.

పెరటి తలుపు తట్టిన శబ్దంతోబాటు "అమ్మగారూ!" అనే పిలుపు వినిపించింది.

ఆ స్వరం ఆ ఇంటి పనిమనిషి రత్తాలుది. చెవులు రిక్కించాడతను. రత్తాలు ఓరగా తెరిచి ఉన్న తలుపులని తోసుకుని లోప లికి వస్తుందని తెలుసు. అతను షర్టు విప్పి భుజంమీద వేసుకున్నాడు. ప్యాంటు విప్పి, రత్తాలు సరిగ్గా ఆ గది గుమ్మం దగ్గ రికి వచ్చే క్షణంలో తిరిగి ప్యాంటు వేసుకు న్నాడు.

రత్తాలు నిశ్చేష్టగా నిలబడి ఆ దృశ్యాన్ని చూస్తోంది. కామేశ్వర్రావు పట్టుబడిన దొంగలా చూస్తూ గది బయటకొచ్చి హడా వుడిగా షర్టు ధరిస్తూనే పెరటి గుమ్మం లోంచి పరుగులాంటి నడకతో బయటప డ్డాడు.

రత్తాలు నోరు తెరుచుకుని చూస్తోంది. తెరిచిన దాని నోరు మూతబడలేదు. ప్రభ, కామేశ్వర్రావుల మధ్య వున్న అక్రమ సంబంధం, దాని నోట పది చెవులకి చేరింది. పది స్వరాలు వంద అయ్యాయి. ఊరంతా చెవులు కొరుక్కున్నారు. గుంపు చింపులై గుసగుసలు పోయారు. కామేశ్వ ర్రావు పగ చల్లారిన తృప్తితో విజయగ ర్వంతో పైశాచికానందాన్ని అనుభవిం చాడు.

కొన్నాళ్ళ తరువాత ప్రభ పుట్టింటికి వెళ్ళిందని విన్నాడు. ఆమె నెల తప్పిందని లోకులు కాకులై కూశారు. అది అబద్ధమని కామేశ్వర్రావుకి తెలుసు. ఏడాది తరువాత ప్రభ కవలపిల్లలతో తిరిగొచ్చింది.

'ఆ పిల్లలు నిజంగానే ఆమె సంతా నమా? అదే నిజమైతే వాళ్ళ జన్మకి కార కుడెవరు? లేకపోతే ఆమె ఎవరో కని, వదిలేసిన పిల్లలని పెంచుకుంటోందా? రమ్యలో తన పోలికలెందుకున్నాయి?' ఈ ప్రశ్నలకి అతనికి ఇవాల్టికీ సమాధానం దొరకలేదు.

ప్రభ పిల్లలని చూడ్డానికి సీత, తన తల్లి శారదమ్మ వెళ్ళొచ్చారు. ఆ రాత్రి పదిన్నర కావస్తుండగా సీత పడక గదిలో అడుగు

## మొట్టికాయలు తప్పవంతే!

భక్తి పేరుతో టక్కుటమారాలు చేసేవారికి వివేకానందుడు చురకలంటించేవారు. 'కనిపిం చిన గుడిచుట్టూ తిరగడం, పాదసేవలంటూ



ఎవరో ఒకరి కాళ్ళమీదపడటం, చిరుతపులి రీతిలో ఒళ్లంతా ఏవేవో రంగులు పూసుకో వడం కూడదన్నారు. స్వాములవారి మందిరాలంటూ అట్టహాసాలు చేసే మాయ గాళ్ల గురించి, 'అలాంటి మందిరాల్లో.. ఇవాళ ఓ ఘంట, రేపు ఓ గొడుగు, ఎల్లుండి పానుపు, తర్వాత ఆ మంచంకోళ్లకు బంగారు- వెండి పూతలు! ఇవన్నీ చాలవన్నట్లు, పదేపదే అదేప నిగా జనానికి నానా రకాల విందుల వడ్డింపు! సాయంత్రానికల్లా తలా తోకలేని కథా కాల క్షేపాలు! ఇదంతా దైవస్మరణ కాదు, దీనితో కాస్తంతైనా పుణ్యం రాదు. ప్రజలు నిజాలు తెలుసుకుంటే, దొంగస్వాములకు ఇక మొట్టి కాయలే' అన్నారాయన.

పెట్టింది.

పుస్తకం చదువుతున్న కామేశ్వర్రావు బద్ధకంగా ఆవలించి 'లైటార్పు' అన్నాడు.

సీత అతనికి దగ్గరగా వచ్చి అతని కళ్ళ లోకి సూటిగా చూస్తూ అడిగింది.

"మీ నుంచి ఒక నిజాన్ని తెలుసుకోవా లనుకుంటున్నాను"

"ఏమిటది? "

"రమ్యకి మీ పోలికెలా వచ్చింది? "

అనూహ్యంగా ఆమె అలా అడగడంతో అతను బిత్తరపోయాడు.

"రమ్య, స్వప్న అక్కా చెల్లెళ్ళలా కాదు. ట్విన్స్‌లా వున్నారు. ఇదెలా సాధ్యం? "

"నేను, నారాయణ అన్నదమ్ముల పిల్లలం కదా! మా పిల్లలకీ మా పోలికలే వచ్చి వుంటాయి" అన్నాడు నవ్వుతూ.

సీత చప్పున భర్త చేతినందుకుని మంచం మీద నిద్రపోతున్న కూతురి తలపై వుంచింది.

"మీకు, ప్రభకి సంబంధం లేదని మన పాపపై ప్రమాణం చేసి చెప్పండి."

కామేశ్వర్రావు ముఖంలో నెత్తురు ఇంకిపోయింది. తను చెప్పిన అబద్ధం, ప్రభ జీవితాన్ని తలక్రిందులు చేసింది. కాని సీత తననిలా ఇరుకున పడేస్తుందనుకోలేదు.

"నీకేమయినా మతిపోయిందా?" కోపంగా అన్నాడు.

"నేను పురిటికి వెళ్ళాక మీరు నడిపిన వ్యవహారం నాకు తెలుసు. పొద్దస్తమానం ప్రభ దగ్గరే వుండేవారట కదా?"

"ఎవరు చెప్పారు?" బుకాయించబోయాడు.

"ఎవరు చెప్తేనేం? నిజమా, కాదా?"

"అబద్ధం"

"అదే మాట మన పాపపై ప్రమాణం చేసి చెప్పండి".

తను తప్పు చెయ్యలేదు కాబట్టి ప్రమాణం చెయ్యవచ్చు. కానీ ప్రభని తలచుకుంటేనే కసితో అతని పళ్ళు కరకరలాడాయి.

'తను తప్పు చేశాడని భార్య అనుకోవాలి. ప్రభ శీలంపై పడిన మచ్చ ఎప్పటికీ చెరిగిపోకూడదు.'

అతను చేతిని వెనక్కి లాక్కున్నాడు.

"మీరు ప్రమాణం చెయ్యరు. చెయ్యలేరు. ఎందుకంటే మీరు తప్పు చేశారు కనుక" హిస్టీరికల్‌గా అరిచిందామె. కామేశ్వర్రావు ముఖం పక్కకి పెట్టుకున్నాడు.

"పాపపై ప్రమాణం చేసి అబద్ధం చెప్తే దానికేమయినా అవుతుందని మీ భయం. మీరు నిజంగా తప్పు చెయ్యకుండా ఉండి ఉంటే, 'మా వదినకు నాకు అక్రమ సంబంధాన్ని అంటగడతావా?' అని నా చెంప పగలగొట్టి వుండేవారు. మీరు తప్పు చేశారు. కాదు.. కాదు, నాకు అన్యాయం చేశారు. మీకు నేనేం లోటు చేశాను? నాకంటే ప్రభ అందగత్తె కావచ్చు కాని వావివరుసలు చూడకుండా వదినతో... తల్లిలాంటి వదినతో..." అవధులు దాటిన ఆగ్రహంతో, కడుపు మండిన ఆవేశంతో నిలదీస్తోంది సీత.

కామేశ్వర్రావు నేలచూపులు చూస్తున్నాడు. సీతకి ఉక్రోషంతో దుఃఖం వస్తోంది. అతని మౌనం ఆమెని రెచ్చగొడుతోంది.

"ఆ పిల్లలిద్దరూ మీ పిల్లలే కదూ?"

"అవును" అన్నాడు, సిగ్గుని, బాధని అవసరమైన దానికంటే ఎక్కువగా వ్యక్తం చేస్తూ.

అంతవరకు కేవలం తనమీద అనుమానంతో అతన్ని నిలదీసిన సీత అతని జవాబు విని కుప్ప కూలిపోయింది. గుండెలు బద్దలయ్యేలా రోదిస్తున్న ఆమెని అసహాయుడై చూస్తున్నాడతను. వున్నట్టుండి సీత చరాల్న లేచింది.

"నాకు ఇంత అన్యాయం జరిగాక నేను బతికివుండడం అనవసరం" అని రయ్‌మంటూ పెరట్లోని బావి దగ్గరకి పరిగెట్టింది.

ఆమెని వెంబడించి వచ్చిన అతను ఆమెని బలంగా ఒడిసి పట్టుకున్నాడు.

"నన్ను చావనియ్యండి. నాకు బతకాలని లేదు!" సీత అతని చేతులలో గింజుకోసాగింది.

"సీతా! దయవుంచి గొడవ చెయ్యకు. నలుగురూ వింటారు" బతిమాలాడు.

"ఏం? నువ్వు దానితో కులికినప్పుడు నలుగురూ ఏమనుకుంటారోననే విషయం

గుర్తు రాలేదా? " ఏకవచనంలోకి దిగింది.

"నువ్వేం చెయ్యమన్నా చేస్తాను. నీ కాళ్ళు పట్టుకుంటాను. దయవుంచి లోపల కిరా!"

"మళ్ళీ ఆ ఇంటి గడప తొక్కనని, ఆ కుటుంబంతో బంధుత్వాన్ని వదులుకుంటానని ఒట్టేసి చెప్పు"

అతను ఆమె చెప్పినట్టు చెప్పాడు.

సీత విజయగర్వంతో లోపలకి నడిచింది. నిజానికి ఆమె ఆత్మహత్యకి ప్రయత్నించడం వట్టి బెదిరింపే. చావుకి పెడితేగాని లంఖణాలు కుదరవనే సామెతగా చస్తాననే బెదిరింపుతో భర్తని లొంగదీసుకుంది.

★ ★ ★

రాత్రి కోడలు కొడుకుతో గొడవపడడం, చస్తానని బావి దగ్గరకి పరిగెట్టడం హాలులో పడుకున్న శారదమ్మ చూస్తూనే వుంది. ఆమె చావుకి తెగించేంత మనస్పర్ధలు ఆ ఇద్దరి మధ్య ఏం వచ్చాయో ఆమెకి అర్థం కాలేదు. ఆవిడ ఆత్రంగా వాళ్ళని వెన్నంటి రాబోయి, ఆ ఇద్దరూ కొద్దిసేపటిలోనే తిరిగి ఇంట్లోకి రావడం గమనించి తను కలగచేసుకోడం అనవసరమని ఊరుకుంది. కాని మిగిలిన రాత్రంతా నిద్ర పట్టలేదావిడకి.

మరునాడు పొద్దుట కామేశ్వర్రావు షాపుకి వెళ్ళాక పసివాడికి పాలు పడుతున్న కోడలి దగ్గరగా కూర్చుంటూ అంది కన్నీళ్ళతో, "నిన్ను ఆత్మహత్యకి ప్రేరేపించేంత పెద్ద గొడవలు మీ మధ్య ఏం జరిగాయి సీతా? అబ్బాయి నిన్నేమైనా అన్నాడా? "

"రాత్రి మా మధ్య జరిగిన గొడవ మీరు విన్నారా అత్తయ్యా? " మెల్లగా అడిగింది.

"విన్నాను. రాత్రి నువ్వు నిజంగా అఘాయిత్యం చేసుకుని వుంటే."

"మీరు, మీ అబ్బాయి జైలుకెళ్ళేవారు"

"సీతా" కంపించిపోయింది శారదమ్మ.

**కొత్తగాలి...**

**ఎప్పుడో కాల్చేది**
**చితి**
**ఎప్పుడూ కాల్చేది**
**చింత**

**– అయినాల కనకరత్నాచారి,**
కొరిశపాడు

"భయపడకండి. మీరిద్దరూ నా చావుకి కారకులని ఉత్తరం రాసిపెట్టి నేను బావిలో దూకాలనుకోలేదు"

"అసలేం జరిగిందమ్మా! కాపురంలో ఏవో కలతలు రావడం సహజం. అంత మాత్రాన చావే పరిష్కారమనుకున్నావా? ఈ పసివాళ్ళనేం చేద్దామనుకున్నావ్"

"చచ్చి సాధించేదేం లేదని నాకూ తెలుసు."

బతికివుండే సాధిద్దామనుకున్నాను. మరో ఆడదానితో సంబంధం పెట్టుకున్న మీ అబ్బాయిని దారిలో పెట్టడానికి అంతకంటే మరో మార్గం తోచలేదు"

"అబ్బాయి మరో ఆడదానితో... ఛ! నువ్వు పొరబడుతున్నావు సీతా!"

"తప్పు చేసానని ఆయనే ఒప్పుకున్నారు. వదిన తల్లితో సమానమని చెప్పలేదా మీరు? "

"నువ్వేం మాట్లాడుతున్నావమ్మా? " ఆవిడకి నిజంగానే అర్థం కాలేదు.

"మీ అబ్బాయికి ప్రభతో సంబంధం వుంది."

"శివ శివా!" ఆవిడ చెవులు మూసుకుంది.

"వావి వరుసలు మరచిపోయేంత నీచుడు కాడమ్మా వాడు."

"ప్రభ పిల్లలు తన పిల్లలేనని ఆయనే ఒప్పుకున్నారు"



శారదమ్మ అవాక్కయింది. రమ్య, స్వప్న ఒకే పోలికలతో ఎందుకున్నారో ఆవిడకి అర్థమయింది. "బంగారం లాంటి పెళ్ళా నివి నువ్వుండగా వాడికేం మాయరోగం వచ్చింది? ప్రభకి మాత్రం ఏంపోయే కాలం? ఎంత ఛండాలం! ఎంత తలవం పులు! ఈ రోజు నుంచి ఆ కుటుంబంతో బంధుత్వాన్ని వదులుకుంటున్నాను. నాకు వాళ్ళంతా చచ్చిన వాళ్ళతో సమానం."

సీత అత్తగారిలో ఆ రియాక్షన్ కోసమే ఎదురు చూస్తోంది. ఆవిడ పట్టుదల ఆమెకి తెలియనిది కాదు. తనకి కావల సింది అదే అన్నట్టు తృప్తిగా నిశ్వసిం చింది. ఉన్నట్టుండి ఆమెకో సందేహం పుట్టుకొచ్చింది. 'ప్రభ అందానికి భర్త దాసోహమయ్యాడా? ప్రభే అతని వెంట పడిందా?'

★ ★ ★

"అవును మొన్న అడగడమే మరచిపో యాను. మీ ఇద్దరికీ ఆ సంబంధం ఏర్ప డ్డానికి ఎవరు ముందడుగు వేసారు? మీరా, ప్రభా?" ఉన్నట్టుండి సీత అలా అడగడంతో కామేశ్వర్రావు జవాబు చెప్పలే నట్టు తల దించుకున్నాడు.

"పర్వాలేదు. చెప్పండి నేనేం అనుకోను"

"నేను ప్రభని ఎప్పుడూ ఆ దృష్టితో చూడలేదు" అంటూ నారాయణరావు సంసార జీవితానికి పనికిరాడని, సూర్య కాంతమ్మ తన వంశాన్ని నిలబెట్టమని ప్రాధేయపడిందని చెప్పాడు.

సీత కళ్ళు పత్తికాయలయ్యాయి. అంత వరకు తనకి పెద్దత్తగారైన సూర్యకాంతమ్మ పట్ల ఆమెకి వున్న గౌరవాభిమానాలు సమూలంగా తుడిచిపెట్టుకుపోయాయి. ఆవిడ తార్పుడు గత్తెలా కన్పిస్తోంది.

"అంటే? మీ అన్నయ్య ఎందుకూ పని కిరాడన్నమాట! అసలే అందగత్తె! పైగా అనాఘ్రాణిత పుష్పం. కోరి వస్తుంటే కాద నడానికి మీరేమైనా ఋష్యశృంగులా? మీ ఇద్దరి మధ్య వున్న సంబంధం మీ అన్నయ్యకి తెలుసా?"



"తెలుసనుకుంటాను"

తన ఏహ్యాతని, తిరస్కారాన్ని ఒక్క ఛీత్కారంతో దింపుకుని సీత విసురుగా మంచం మీదున్న తలగడ తీసి నేలపై వేసుకుని గోడవైపు తిరిగి పడుకుంది. మరునాడు భర్త షాపుకి వెళ్ళాక, సీత భర్త చెప్పినదంతా యథాతథంగా అత్తగారితో చెప్పింది.

"ఓసి దానమ్మ కడుపుకాలా! ఎందుకూ పనికిరాని కొడుక్కి పెళ్ళెందుకు చేసింది? కోడలికి ఎలాగోలా పిల్లలు పుట్టాలని వెధవపని చేయిస్తుందీ? అదసలు ఆడదేనా?" శారదమ్మ తిట్ల దండకం మొదలుపెట్టింది.

"మీ రెండు కుటుంబాల మధ్య బంధుత్వం రాకపోకలు ఇలాగే కొనసాగుతూ వుంటే మీ అబ్బాయి నాతో సవ్యంగా సంసారం చేస్తారనే నమ్మకం నాకు లేదు. అందుకే ఇంకమీదట ఆ ఇంటి గడప తొక్కనని ఆయన చేత ఒట్టు పెట్టించాను. తప్పా అత్తయ్యా?"

"తప్పు లేదమ్మా! నువ్వు కాబట్టి పెద్ద మనసుతో వాడిని క్షమించావు. మరో ఆడదైతే అరచి యాగీ చేసేది" అంది శార

దమ్మ. ఆవిడకి నిజంగానే సీత దేవతలా కనిపిస్తోంది. ఆరోజు రాత్రి ఏం గొడవ పడ్డారోగాని, మళ్ళీ ఆమె నోరు తెరిచి భర్తని ఒక్కమాట కూడా అనడం వినలేదావిడ.

భర్తని ఇదివరకులాగే ప్రేమగా చూసుకుంటోంది. అది ఆమె మంచి మనసుకి నిదర్శనం. కానీ సీత భర్తని పడకగదిలో కోసే రంపపుకోత ఆవిడకి తెలియదు.

కామేశ్వర్రావు ఏదైనా ఆలోచిస్తూ పరధ్యాసగా వుంటే 'ప్రభ గుర్తుకొస్తోందా' అని వ్యంగ్యాన్ని గొంతులో ప్రతిఫలించనివ్వకుండా అడిగేది.

'ప్రభ అందమైనదా? నేను అందమైనదాన్నా? మొహమాట . పడకుండా చెప్పండి' అనేది.

అన్నిటినీ మించి పడకలు వేరుచేసి భర్తని దారుణంగా శిక్షించింది. పోలీసు వాళ్ళ దెబ్బల్లా పైకి కనబడని ఆ రంపపు కోతని దిగమింగి మామూలుగా వుండడానికి అతను చాలా కష్టపడుతున్నాడు.

శారదమ్మకి సీతపట్ల అభిమానంతో కూడిన భయం ఏర్పడింది. సీత మంచి అమ్మాయి కాబట్టి భర్త చేసిన తప్పుని క్షమించి అతన్ని తనకి అనుగుణంగా మార్చుకోగలిగిందని ఆవిడ ప్రగాఢ నమ్మకం. భర్తకి తనంటే వున్న భయాన్ని అత్తగారికి తనపైగల అభిమానాన్ని సీత క్యాష్ చేసుకుంది. పైకి మంచితనాన్ని ప్రదర్శిస్తూనే ఇంటి పెత్తనాన్ని గుప్పిట లోకి తీసుకుంది.

★ ★ ★

"అమ్మా! పెద్దమామ్మగారు, చెల్లాయీ వచ్చారు" మూడేళ్ళ స్వప్న వచ్చి చెప్పింది.

సీత ముఖం అప్రసన్నమయింది. అదీ క్షణమాత్రమే. ఆమె మనసులో ఏదో ఆలోచన తళుక్కుమంది. వెంటనే చిరునవ్వు ముఖాన పులుముకుని బయటకొచ్చింది.

"రండి, చాలా రోజులకి వచ్చారే! కులాసాగా వున్నారా? " అని ఆహ్వానించింది.

శారదమ్మ అప్పటికే హాల్లోకొచ్చి నిలబడింది. ఎదురుగా వున్న తోటి కోడలిని, ఆమె చెయ్యి పట్టుకుని నిలబడిన రెండేళ్ళ రమ్యని చూడగానే ముఖం నల్లబడింది. ముఖ్యంగా రమ్యని, స్వప్నని చూస్తుంటే ఒకే పోలికలతో కవలపిల్లల్లా వున్న ఆ ఇద్దరూ తన కొడుకు పిల్లలే అనే నిజం మనసుని ముల్లులా పొడిచింది. కొడుకుచేత ఆ పాపాన్ని చేయించిన సూర్యకాంతమ్మ రాక్షసిలా, తన సంతానాన్ని తనే భక్షించే పులిలా కనిపించసాగింది. రక్తం సలసలమరిగి పోతుంటే ఆమెలోని ఆవేశం కళ్ళలో ఎర్రజీరగా ఎగిసింది.

"బాగున్నావా శారదా? " ఆమె మనోభావాలెలా ఉన్నాయో తెలియని సూర్యకాంతమ్మ అడిగింది.

"ఆc! నీదయవల్ల" నిరసనగా అంది.

ఆవిడ స్వరంలోని మార్పుని గ్రహించలేని సూర్యకాంతమ్మ "చెల్లాయిని ఆడించవే స్వప్నా!" అంది సోఫాలో కూర్చుంటూ.

స్వప్న, రమ్య చేతిని పట్టుకుని అక్కడనుంచి వెళ్ళిపోబోతుంటే సీత ఆపింది.

"రమ్యని చిన్నప్పుడు చూసి వాళ్ళమ్మ పోలిక అనుకున్నాను. కాని ఇప్పుడు చూస్తుంటే కాదనిపిస్తోంది. అలా అని బావగారి పోలికా కాదు" అంది అదోలా నవ్వుతూ.

సూర్యకాంతమ్మ ముఖం క్షణం ముడుచుకుంది. తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అంది, "రమ్య వాళ్ళమ్మమ్మ పోలిక."

"పిల్లలకి అమ్మ పోలికో, అమ్మమ్మ పోలికో వస్తే ఫర్వాలేదు. పక్కింటాయన పోలిక వస్తేనే గొడవ" వ్యంగ్యంగా అంది సీత.

ఆవిడ ముఖం ఎర్రబడింది.

ఈసారి శారదమ్మ అందుకుంది.

"నీ కోడలిని పిల్లలు పుట్టేందుకు ఎవరి దగ్గరకి తీసుకెళ్ళావ్? " మరో అర్థం ధ్వనించేలా ఆవిడ అడిగిన ప్రశ్నకి సూర్యకాంతమ్మ ముఖం ఎర్రబడింది.

"నువ్వేం మాట్లాడుతున్నావో, నీకు తెలుసా? "

"నా ఉద్దేశం... ఏ డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళావు అని? "

"డాక్టరు గాయత్రి అని, పెద్దమసీదు పక్కన" కోపాన్ని దిగమింగుతూ చెప్పింది.

"అయినా డాక్టరు మాత్రం దేముళ్ళేమిటి? ఒక్కొక్కసారి భార్యలో ఏ లోపం లేకపోయినా భర్తలో లోపం వుంటే పిల్లలు పుట్టరు."

"అత్తయ్యా డాక్టర్లకంటే మీ తోడికోడలే తెలివైనవారు. ప్రభకి పిల్లలు పుట్టడం వెనుక ఆవిడ కృషి, తెలివితేటలు ఎక్కువ వున్నాయి" అంది సీత అదోలా నవ్వుతూ.

"బాగానే వుంది" అంది సూర్యకాంతమ్మ ఇబ్బందిగా.

"పిల్లలు పుట్టకపోతే ఎవరినైనా పెంచుకోవాలి తప్ప ఇంకొకళ్ళ సంసారంలో నిప్పులు పొయ్యడం దేనికి? " అంది శారదమ్మ మెటికలు విరుస్తూ.

వాళ్ళిద్దరి మాటల్లోని శ్లేషని అర్థం చేసుకోలేనంత అమాయకురాలు కాదావిడ. ఆ అత్తాకోడళ్ళిద్దరూ అన్యాపదేశంగా అన్న ప్రతీమాట తనని ఉద్దేశించి అన్నదే అని ఆవిడకి అర్థమయింది. ఇంక అక్కడ కూర్చోలేక లేచింది.

"రా రమ్యా, ఇంటికి వెళ్దాం" ఆవిడ మనుమరాలిని ఎత్తుకుంది.

"వుండమనమ్మా! నేను చెల్లితో ఆడుకుంటాను" అంది స్వప్న పేచీ పెడుతూ.

"వెళ్ళనియ్యి. ఆవిడకసలే గాభరాగా వుంది. పాపం! పెద్దతనం కదూ? " అంది సీత కూతురిని ఎత్తుకుంటూ.

'వస్తాను' అని సూర్యకాంతమ్మ జనాంతికంగా అని ముందుకి నడిచింది. ఆవిడ 'వస్తాను' అని చెప్పినా మళ్ళీ ఎప్పుడూ ఆ ఇంటికి రాదని శారదమ్మకి, సీతకి తెలుసు. ఆ ఇంటికొచ్చి ఇంకా అవమానింపబడాలని సూర్యకాంతమ్మకీ లేదు.

★ ★ ★

తనకి ఎమ్‌సెట్‌లో మంచి ర్యాంకు రాదని రమ్యకి పరీక్ష రాస్తున్నప్పుడే తెలుసు. ఇంటర్మీడియెట్ రెండో సంవత్సరం అరవై శాతం మార్కులతో గట్టెక్కింది. ఆమెకి చదువుకోవాలని లేదు. మనుషులంటే అసహ్యం! ముఖ్యంగా తల్లి, తండ్రి, నాయనమ్మలపై ఆమె నరనరాన అసహ్యం పేరుకుని పోయివుంది. తను ఊహ తెలిసిన దగ్గర నుంచి పొందుతున్న అవమానాలకి కారణం వాళ్ళే! ఆమె మనసులోని అగ్ని అలా రాజుకుంటూనే వుంది.

హరికి ఎమ్‌సెట్‌లో స్టేట్ సెకండ్ రేంక్ వచ్చింది. నారాయణరావుకి, ప్రభకి ఒకకంట పన్నీరు.. మరోకంట కన్నీరు అన్నట్టుంది.

హరికంటే తెలివైన రమ్యకి మంచి రేంకు రాలేదనే బాధ హరికి స్టేట్‌రేంకు వచ్చిందని ఆనందం. నారాయణరావు కూతురి ప్రవర్తనలో వచ్చిన మార్పుని కనిపెట్టకపోలేదు. తన గుండెలపై ఆడుకున్న చిట్టితల్లి... తన చెయ్యి పట్టుకుని తిరుగుతూ తనని క్షణం కూడా విడవని తన

## కొత్తగాలి...

**తవ్వితీస్తేనే**
**వెలికి వస్తాయి**
**ఖ'నిజాలు'!**

*– అంబటి వెంకట శివారెడ్డి,*
*యర్రగుంట్ల*

బంగారు తల్లి తనని తప్పుకుని తిరగడం చూస్తే అతని గుండెలలో మంట పెట్టినట్ట వుతోంది.

ఎంతో తెలివైన రమ్య చదువులో వెను కబడిపోడానికి కారణం కూడా అర్థమ యింది. అప్పుడే వికసిస్తున్న రమ్య మన సులో తనని కామేశ్వర్రావు కూతురని లోకం చేసే అవహేళన, తను పొందిన అవమానం తాలూకు బాధ బలంగా నాటుకుపోయాయి. పదే పదే ఆ విష యాన్ని ఆలోచిస్తూ చదువు మీద శ్రద్ధ చూపించలేకపోతోంది.

ఎమ్‌సెట్ రిజల్ట్స్ వచ్చిన రెండో రోజున అతను కూతుర్ని అడిగాడు, "లాంగ్ టర్మ్ కోచింగ్ తీసుకుని మళ్లీ ఎమ్‌సెట్‌కి ప్రిపేరవుతావామ్మా? "

"...నాకు ఇంట్రెస్ట్ లేదు" రమ్య అతనివైపు చూడకుండానే అంది.

"...మరేం చేస్తావ్? బీఎస్సీలో చేరు. తరువాత ఎమ్మెస్సీ చదవచ్చు."

రమ్య జవాబివ్వలేదు. అతని ఉనికిని భరించలేనట్టు అక్కడనుంచి వెళ్ళిపో యింది.

రమ్య బీఎస్సీలో చేరింది. అప్లికేషన్ ఫారంలో తండ్రి లేక గార్డియన్ అని ఉన్న కాలమ్‌లో తండ్రి అనే అక్షరాలని కొట్టేసి గార్డియన్‌గా అతని పేరు రాసింది. ఆమెకి సంబంధించినంత వరకు తండ్రి లేడు. నారాయణరావుని తండ్రిగా ఆమె అంగీక రించలేకపోతోంది.

★ ★ ★

"నేను వైదేహిని" ఫోన్‌లో ఆమె స్వరం వినగానే ప్రభ స్వరంలో ఏదో అడ్డుపడ్డట్ట యింది.

"ఎలా ఉన్నావ్? "

ఆమె అడిగిన దానికి సమాధానమివ్వ కుండా అంది.

"రమ్య ఎలా ఉంది? " వైదేహి స్వరం లోని ఆత్రుత, ఆందోళనలని అర్థం చేసుకో గలదు ప్రభ.

"బాగానే ఉంది"

"నీతో ఎలా ఉంటోంది? "

"ఇదివరకటి కంటే చాలా నయం. అది పెద్ద సమస్య కాదు. నువ్వు ఆ విషయమై ఆలోచించి మనసు పాడుచేసుకోకు"

ఆమె అబద్ధం చెబుతోందని వైదేహికి తెలుసు.

"హరికి ఎమ్‌సెట్‌లో స్టేట్ సెకండ్ ర్యాంక్ వచ్చిందని పేపరులో చూసాను. రమ్య..."

"బీఎస్సీలో చేరింది" క్లుప్తంగా అంది.

"లాంగ్ టర్మ్ కోచింగ్‌కి పంపవల సింది"

"ఇంట్రస్ట్ లేదట" పొడిగా అంది.

"పోన్లే! తనకి ఏది ఇంట్రస్టయితే అదే తీసుకోమను. నేను అమెరికా వెళ్తున్నాను. బిజినెస్ టూర్. వచ్చాక నీ దగ్గరకొస్తా"

"సరే!" ప్రభ ఫోన్ పెట్టేసింది. అప్పటి వరకు ఉగ్గబట్టుకున్న దుఃఖం ఆనకట్టలేని ప్రవాహంలా ఆమెని ముంచెత్తింది.

హరికంటే ఎంతో తెలివైన రమ్య ఏవ రేజ్ స్టూడెంటులా మిగిలిపోవడం ఆమెకి బాధ, వేదనలను కలుగచేస్తోంది.

★ ★ ★

నారాయణరావు భార్యని పిలిచాడు. "ప్రభా! రేపు ఇంకొక మనిషికి భోజనం వండగలవా? "

"ఎందుకు వండలేనూ? ఇంతకీ ఎవరొ స్తున్నారు భోజనానికి? "

"ఇక్కడే కాలేజీలో చదువుకుంటున్న ఒక అబ్బాయి. బి.ఎస్.సి. ఫైనలియర్ చదువు తున్నాడుట. అతనికి 'నా' అనే వాళ్లెవరూ లేరుట. వారాలు చేసుకుని చదువుకుంటు న్నాడు. మన షాపులో ఏదైనా పని ఇప్పిం చమని అడిగాడు. పుస్తకాలు కొనుక్కోడా నికి డబ్బు లేదు. కాలేజీ నుంచి అలసి

పోయి వచ్చి షాపులో పనిచేసి ఇంకెప్పుడు చదువుకుంటాడు? అందుకే అతనికి పుస్తకాలు కొనిచ్చి రేపు ఇంటికి భోజనానికి రమ్మని పిలిచాను. ఇంక నుంచి ప్రతి ఆదివారం అతను మన ఇంటికి భోజనానికి వస్తాడు"

"దానికేం భాగ్యం, ఒక మనిషికి అన్నం పెడితే మన ఆస్తేమీ తరిగిపోదు. అయినా లేనివాడికి అన్నం పెడితేనే పుణ్యం" అంది సూర్యకాంతమ్మ.

ఆవిడ నోటివెంట 'పుణ్యం' అనే మాట వినగానే కిసుక్కున నవ్వింది రమ్య.

మనుమరాలు ఎందుకు నవ్వుతోందో అర్థంగాక అయోమయంగా చూసింది సూర్యకాంతమ్మ.

నారాయణరావుకి మాత్రం కూతురెందుకు నవ్వుతోందో అర్థమయింది. నాయనమ్మ నోట పుణ్యం అనే మాట విని నవ్వుతోంది.

గత కొద్ది రోజులుగా రమ్యలో కనిపిస్తున్న ఈ మార్పు అతన్ని భయపెట్టసాగింది. గతంలో నాయనమ్మ పూజ చేస్తుంటే ఆమె పక్కనే కూర్చుని భక్తిగా శ్లోకాలు వల్లెవేసే రమ్య ఇప్పుడు ఆమె వైపే వెళ్లడం లేదు. పైగా ఆవిడ పూజ చేస్తుంటే వెక్కిరింతగా నవ్వుతోంది.

★ ★ ★

"రావోయ్, రా!" చిరునవ్వుతో ఆహ్వానించాడు నారాయణరావు.

అతను మెట్లెక్కి వరండాలోనే ఆగిపోయాడు.

"నమస్కారమండీ!"

"నమస్తే! లోపలికిరా! అక్కడే ఆగిపోయావేం" అతను మొహమాటంగానే లోపలికి వచ్చాడు.

"కూర్చో"

"ఫర్వాలేదు సార్!"

"కూర్చోవయ్యా!" మరోసారి చెప్పాడు.

బిడియపడుతూ కూర్చున్నాడు.

## కొత్తగాలి...



**పూజలు చేద్దామని**
**ఎక్కడికో వెళ్తున్నావు!**
**ద్వేషం లేనివాడే**
**అసలు దేవుడు**

– పెరుక రాజు,
నర్శింగాపూర్

లోపల నుంచి సూర్యకాంతమ్మ వచ్చింది.

"మా అమ్మగారు"

అతను లేచి నిలబడి మర్యాదగా నమస్కరించాడు.

"అమ్మా! నిన్న నేను చెప్పిన అబ్బాయి ఇతనే. పేరు ప్రభాకర్!"

"దీర్ఘాయుష్మాన్ భవ! కూర్చో నాయనా! అబ్బాయి నీ గురించి చెప్పాడు. చదువుపై ఆసక్తి, పట్టుదల నిజంగా మెచ్చుకోదగినవి" అభినందిస్తున్నట్టు అంది.

"మీలాంటి పెద్దల ఆశీస్సులు, సహాయ సహకారాలు లేకపోతే నేను చదవగలిగే వాడిని కానండీ!" వినయంగా అన్నాడు.

"గుర్రాన్ని నీళ్ల దగ్గరకి తీసుకెళ్లగలం కాని నీటిని తాగించగలమా? నీకు చదువుపై శ్రద్ధ ఉంది కాబట్టి చదువుకుంటున్నావు" అంటున్న తల్లిని రమ్య వింటుందని కళ్లతోనే హెచ్చరించాడు నారాయణరావు.

ఆవిడ మౌనం వహించింది. ఇంతలో లోపలనుంచి బాబి వచ్చాడు.

"మా అబ్బాయి హరి. ఇంట్లో అందరం బాబి అని పిలుస్తాం. ఇంజనీరింగ్‌లో చేరబోతున్నాడు, "బాబీ! ఇతని పేరు ప్రభాకర్. ఇవాళ మన ఇంటికి గెస్టుగా వచ్చాడు. ఇక్కడే బీఎస్సీ ఫైనలియర్ చదువుతున్నాడు. ఎంత మంచి స్టూడెంటో

## కొత్తగాలి...

**నీరు.. నిప్పు**
**నింగి**
**నేల.. గాలి**
**అన్నీ అమ్మే**

- కొలకలూరి ఇనాక్
హైదరాబాద్

తెలుసా? టెన్త్‌లో, ఇంటర్‌లో కూడా స్టేట్ ర్యాంకులే!"

"మీరు నన్ను మరీ ఆకాశానికి ఎత్తేస్తున్నారు సార్!" బిడియంగా తలదించుకున్నాడు ప్రభాకర్.

"కంగ్రాచ్యులేషన్సండీ!" బాబి అన్నాడు. మొహమాటంగా నవ్వేడు ప్రభాకర్.

"బాబీ! అక్కని పిలుచుకురా" అని, మళ్ళీ ప్రభాకర్‌కి చెప్పాడు, "మా అమ్మాయి రమ్య. మొన్ననే బీఎస్సీ ఫస్టియర్‌లో జాయినయిందయ్యా! తను చాలా తెలివైనది. టెన్త్‌లో బాబి, రమ్య ఇద్దరూ స్టేట్ రేంకర్లే. ఎమ్‌సెట్‌లో బాబికి సెకండ్ రేంకొచ్చింది. కాని రమ్యకి మంచి రేంక్ రాలేదు."

"లాంగ్‌టర్మ్ కోచింగ్ తీసుకొని ఎమ్‌సెట్ మళ్ళీ రాయవలసింది?"

"చెప్పాను. వినలేదు."

బాబీ గదిలోకి వెళ్ళేసరికి రమ్య గోళ్ళు కొరుకుతూ కూర్చుని వుంది.

"అక్కా!" వాడు పిలిచాడు.

ఆమె తల ఎత్తలేదు.

"అక్కా!" మళ్ళీ పిలిచాడు.

"ఏమిటి?" విసుగ్గా అడిగింది.

"నాన్నగారు నిన్ను రమ్మంటున్నారు. మన ఇంటికి గెస్ట్ వచ్చారు"

తమ్ముడి నోటివెంట 'నాన్నగారు' అనే మాట వినగానే ఆమె అణువణువూ భగ్గుమంది.

'ఆయన మన నాన్నకాదురా పిచ్చివెధవా!' అని వాడికి చెప్పాలనిపిస్తోంది. కాని ఏదో తెలియని భావం ఆమెని అలా చెప్పకుండా ఆపుతోంది.

"నేను రానన్నానని చెప్పు" అంది నిరసనని స్వరంలో ప్రకటిస్తూ.

గతకొద్ది రోజులుగా ఆమె ప్రవర్తనలోని తేడాని వాడు గమనించకపోలేదు.

"ప్లీజ్, రా అక్కా!" బతిమాలాడు.

"నేను రానని చెప్పానా? నీకు చెముడా?" అరిచింది. రమ్య ఎందుకలా ప్రవర్తిస్తోందో అర్థంకాక వాడు బిత్తరపోయి బయటకొచ్చేసాడు.

ఆమె వాడిపై అరవడం హాల్లో ఉన్న ముగ్గురూ విన్నారు. నారాయణరావు ముఖం మ్లానమయింది. కూతురిని ప్రభాకర్‌కి పరిచయం చెయ్యాలనుకోడంలో అతని ఉద్దేశం వేరు. ప్రతి సంవత్సరం డిస్టింక్షన్‌తో పాసవుతున్న అతన్ని చూసయినా ఆమెలో చదువుకోవాలనే స్ఫూర్తి కలుగుతుందని అతని ఆశ.

"ప్రభా! టైము పన్నెండు కావస్తోంది. ఇంకెందుకు ఆలస్యం, వడ్డించేయ్. ప్రభాకర్ చదువుకోవాలిగా" అన్నాడు మామూలుగా ఉండడానికి ప్రయత్నిస్తూ. ప్రభ బయటికి వచ్చి చిరునవ్వుతో అతన్ని పలుకరించింది.

"నా భార్య!" పరిచయం చేసాడతను. ప్రభాకర్ ఆమెకి నమస్కరించాడు.

ప్రభ, సూర్యకాంతమ్మ లోపలికి వెళ్లారు భోజనాల ఏర్పాటు చెయ్యడానికి.

"ప్రభాకర్! నువ్వు భోజనం కోసం వాళ్లింటికి వీళ్లింటికి ఎందుకు వెళ్లడం.. మా ఇంట్లోనే రోజూ తినవచ్చుగా?"

"వద్దు సార్! ఇప్పటికే నాకెంతో సాయంచేసి నన్ను రుణగ్రస్తుడిని చేసారు. ఈ కరువు రోజులలో వారానికోరోజు ఒక మనిషికి అన్నం పెట్టడమే బరువు. కాదం

టున్నందుకు మరోలా అనుకోకండి. మీ అభిమానానికి కృతజ్ఞుడిని" చెమర్చిన కళ్లతో కృతజ్ఞత ఉట్టిపడే స్వరంతో అంటున్న స్ఫురద్రూపి అయిన ఆ యువకుడిని చూసిన నారాయణరావు మనసులో అతనిపట్ల తొలిచూపులో కలిగిన అభిమానం రెట్టింపయింది.

లోపలనుంచి భోజనానికి రమ్మని పిలుపు వినిపించింది.

"రావోయ్.. కాళ్లు కడుక్కో" నారాయణరావు కుర్చీలోంచి లేచాడు. ప్రభాకర్ అతన్ని అనుసరించాడు. పెరట్లో కుళాయి దగ్గర కాళ్లు కడుక్కుని వచ్చి అతను వరండాలో ఆగిపోయాడు.

"రా ప్రభాకర్! ఇలా వచ్చి కూర్చో!" నారాయణరావు డైనింగ్ టేబుల్ దగ్గర కుర్చీని ఇవతలకి లాగుతూ పిలిచాడు.

"విస్తరాకు ఇప్పించండి. నేను ఇక్కడ తింటాను"

"భలేవాడివే! అక్కడ కూర్చుని భోజనం చెయ్యడానికా నిన్ను మా ఇంటికి, భోజనానికి పిలిచింది? మాతో కలిసి భోజనం చేస్తావని పిలిస్తే!" నారాయణరావు అతని భుజం చుట్టూ చెయ్యి వేసాడు. జీవితంలో మొదటిసారిగా చవిచూస్తున్న ఆదరాభిమానాలు మనసుని ఉక్కిరిబిక్కిరి చేస్తుండగా మంత్రముగ్ధునిలా లోపలికి నడిచాడు.

ప్రభ వేడి వేడి అన్నం, కూరలు పళ్లేలలో వడ్డించింది. సూర్యకాంతమ్మ నెయ్యి వేసింది.

ప్రభాకర్‌కి అప్రయత్నంగానే తనకి భోజనం పెట్టే గృహస్థుల కసుర్లు, విసుర్లు గుర్తుకొచ్చాయి. సోమవారంనాడు అతని భోజనం లాయర్ వీరభద్రంగారి ఇంట్లో. ఆయన భార్య, గుమ్మంలో అతన్ని చూస్తూనే "ఇవాళ సోమవారం కదూ! నువ్వు భోజనానికి వస్తావని మరిచేపోయాను. నా మతిమండా! పోన్లే! పొద్దుట వండిన అన్నం చాలా మిగిలిపోయింది.

## కొత్తగాలి...

**కొత్తిమీర నుండి**
**వేడి సాంబారు దాకా**
**అన్నీ క్యారీ బ్యాగుల్లోనే**
**మనిషిప్పుడు**
**డిస్పోజబుల్!?**

– నమ్మి కనకనాగేశ్వరరావు, పెనుగొండ

కరువు రోజులలో పారేసుకుంటామా ఏమిటి?" అంటూనే విస్తరాకు అరుగు మీద వేసి, పొద్దుట మిగిలిన అన్నం, కూర తెచ్చి వడ్డిస్తుంది. సాంబారు ఫ్రిజ్‌లో నుంచి తెచ్చిపోస్తుంది. అదిపోయిన సోమవారం నాటిదని అతనికి తెలుసు. పగలంతా ఏమీ తినకుండా కాలేజీకి వెళ్ళి పాఠాలు విని, రాత్రి ఎనిమిదిగంటలకి అన్నం ముందు కూర్చుంటే కడుపులో కరకరమంటున్న ఆకలికి ఏదైనా రుచిగానే ఉంటుంది.

మిగతా రోజులలోనూ అంతే! విసుక్కుంటూ విస్తరిలో ఎత్తిపడేసేవాళ్లు, అతనికి ఫ్రీగా అన్నం పెడుతున్నందుకు అతని చేత పనిచేయించుకునే వాళ్లు. వాళ్లు ఏది పెడితే అది మహాప్రసాదంలా తినే అతనికి ఈ ఆప్యాయత, ఆదరణ మనసుకి షడ్రసోపేతమైన భోజనంలా ఉన్నాయి.

"కొంచెం పప్పు వేసుకో! అన్నం మరీ కొంచెం కలుపుకున్నావే.. వయసులో ఉన్న కుర్రాడివి అంత తక్కువ తింటే చదువేం చదువుతావు" సూర్యకాంతమ్మ కొసరి కొసరి వడ్డిస్తోంది.

"ఇక చాలండీ, తినలేను" అని ప్రభాకర్ వద్దంటున్నా వినలేదావిడ. భోజనం కాగానే బయలుదేరాడు ప్రభాకర్.

"రాత్రి కూడా ఇక్కడే భోజనం చేద్దువుగాని మొహమాటపడకు" అంది సూర్యకాం

తమ్మ.

"నేను రోజుకి ఒక్కపూటే, అదీ రాత్రి పూటే తింటానండీ! ఇవాళ కాలేజీకి సెలవు కదా అని పగటిపూట వచ్చాను. అయినా చాలా తినేసాను. ఇంక రాత్రికి సూది మొన కూడా నా కడుపులో పట్టదు."

"ఇప్పుడు తిన్నది రాత్రిదాకా ఉంటుందా? అరగదటయ్యా?" అన్నా నవ్వి ఊరుకున్నాడు. తర్వాత-

"వస్తానమ్మా! వస్తానండీ" అని వెళ్లిపోయాడు.

"పాపం! ఏ తల్లికన్న బిడ్డడో! దబ్బపండులా ఉన్నాడు. తెలివైనవాడు" అంది సూర్యకాంతమ్మ ప్రశంసగా.

"అవునమ్మా! ఈ కుర్రాడు జీవితంలో పైకి వస్తాడని నమ్మకం నాకు ఉంది. అందుకే అతన్ని నేను చదివిస్తానని మాట ఇచ్చాను. అవును, నువ్వు, ప్రభ భోజనం చెయ్యలేదుగా? తినేసెయ్యండి".

"రమ్య, నేను కలసి తింటాం" అనబోయి ఆగిపోయింది ప్రభ.

'రమ్య తనతో కలిసి అన్నం తిని.. కాదు..మాట్లాడి ఎన్ని రోజులయింది?' ఆమె కేసరోల్స్ తెచ్చి అన్నం కూరలు వేరే తీసి టేబిల్‌పైపెట్టి అత్తగారికి వడ్డించింది.

ఆమె వంటగది సర్దుకుంటుండగా రమ్య వచ్చి పెద్ద చప్పుడుతో గిన్నెలుమూత తీసి వడ్డించుకుని తింది.

★ ★ ★

ప్రతిరోజూ తమ ఇంట్లోనే భోజనం చెయ్యమని నారాయణరావు పదే పదేచెబుతున్నా ప్రభాకర్ మాత్రం అంగీకరించలేదు. సున్నితంగా తిరస్కరించాడు. అదే వినయం... మాటల్లో సౌమ్యత... క్రమంగా ఆ ఇంట్లోవాళ్ళు ఆదివారం ఎప్పుడొస్తుందా, ప్రభాకర్ ఎప్పుడొస్తాడా అని ఎదురు చూసేంత మంచి అనుబంధం ఏర్పడింది అతనితో.

రమ్య మాత్రం ఎప్పుడూ అతనికి ఎదురుపడిన సందర్భం రాలేదు. ఒక ఆదివారం... ప్రభాకర్ భోజనం చేసి వెళ్ళడానికి ఉద్యుక్తుడవుతుండగా నారాయణరావు అతన్ని ఆగమని గదిలోకి వెళ్ళి ఒక పేకెట్టు తెచ్చి అతనికివ్వబోయాడు.

"కొత్త బట్టలు... దసరా పండుగకి పిల్లలతో బాటు నీక్కూడా కొన్నాను"

ప్రభాకర్ కళ్ళలో నీళ్ళూరాయి.

"నాకు కొత్తబట్టలెందుకు సార్? మీరు వాడి తీసేసిన బట్టలేవైనా ఉంటే ఇవ్వండి"

"తప్పు. అలా మాట్లాడకు. దసరా పండుగనాడు ఈ బట్టలు వేసుకో. అంతే కాదు, పండుగ మూడు రోజులూ నీ భోజనం ఇక్కడే"

"మీ రుణం ఎలా తీర్చుకోను సార్?"

"అంత పెద్ద మాటలెందుకు... నువ్వు బాగా చదువుకుని వృద్ధిలోకి వచ్చి పెద్ద ఉద్యోగం చేస్తున్నప్పుడు నన్ను గుర్తుపెట్టుకో అది చాలు!"

ఫకాల్న నవ్వేరెవరో. చప్పున వెనుదిరిగాడతను. గుమ్మంలో నిలబడివున్న ఆ అమ్మాయి లావణ్యానికి, అందానికి కాదు అతను నివ్వెరపోయినది.

"ఆమె ఎందుకు నవ్వుతోంది? ఆమెకి తన మాటలలో నవ్వు తెప్పించిన విషయం ఏముంది?"

కూతురు అసందర్భంగా నవ్వడం నారాయణరావుకి నచ్చలేదు! అతను ఆమెని అక్కడనుంచి లోపలకి వెళ్ళమని కళ్ళతోనే ఆదేశించాడు.

కాని ఆమె లోపలకి వెళ్ళలేదు. అలా నవ్వుతూనే ఉంది.

ప్రభాకర్ చప్పున వంగి నారాయణరావు పాదాలని తాకి నమస్కరించి అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

రమ్య ఇంకా నవ్వుతూనే వుంది.

నారాయణరావు కోపాన్ని దిగమింగి



ఆమెవైపు చూసాడు.

"ఎందుకమ్మా నవ్వుతున్నావ్? "

"చేసిన పాపాలని పోగొట్టుకోడానికి మీ అమ్మ పూజలు చేస్తుంది. మీరు దానాలు చేస్తున్నారు. అందుకని నవ్వొచ్చింది."

"ఏమిటమ్మా ఆ మాటలు? పూజలతో, దానాలతో చేసిన పాపాలు పోతాయా? అయినా అంత పాపం మేమేం చేసామని? "

"ఏం చేసారో మీ అంతరాత్మలనడగండి" రమ్య గదిలోకి వెళ్ళిపోయింది.

అతను నిస్తేజుడయ్యాడు. కూతురు అలా ఎద్దేవాగా మాట్లాడ్డం ఈ మధ్య సర్వ సాధారణమయిపోయినా ఆమె అలా మాట్లాడిన ప్రతిసారీ అతనికి బాధగానే వుంటుంది. కూతురికి తనకి మధ్య వున్న

దుర్భేద్యమైన గోడనెలా ఛేదించాలో అత నికి అర్థం కావడం లేదు.




చిన్నగది... నిజానికి అది గది కాదు. కారు షెడ్. ఫణి భూషణరావుగారు ఆ పాత కారుషెడ్లో అద్దె లేకుండా ప్రభాకర్‌ని ఉండనిస్తున్నాడు. అతనికి తన ఇంట్లో ఒక పూట భోజనం కూడా ఆయనే ఏర్పాటు చేసాడు.

ప్రభాకర్ షెడ్‌లోకి వస్తూనే చాప పర చుకుని కూర్చున్నాడు. అతని కళ్ళముందు నవ్వుతున్న రమ్య కనిపిస్తోంది.

'ఆమె ఎందుకలా నవ్వింది? తను, నారాయణరావుగారు మాట్లాడుకున్న మాటలలో కామెడీ ఏమీ లేదే' అతను ఆలోచిస్తున్నాడు.

తలుపు తట్టిన శబ్దమయింది. అతను లేచివెళ్ళి తలుపు తీసాడు. ఎదురుగా ఫణి భూషణరావుగారి నౌకరు.

"అబ్బాయిగారు మిమ్మల్ని పిలుస్తు న్నారు."

"వస్తున్నాను, పద" అతను తలుపు దగ్గ రగా లాగి వచ్చాడు.

హాలులో కూర్చుని మొబైల్ ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతున్న మురళి అతన్ని చూస్తూనే సెల్ ఆఫ్‌చేసి... పొద్దుటి నుంచీ కనవబడలేదేం నువ్వు" అనడిగేడు.

"పొద్దుటంతా రూమ్‌లోనే ఉన్నానండి. గంట క్రితమే భోజనానికి వెళ్ళొచ్చాను"

"ఎక్కడికి.. ఇవాళ నీ భోజనం ఎక్కడ?"

"నారాయణరావుగారి ఇంట్లో..."

"నీ పనే బాగుందే! రోజుకొకళ్ళ ఇంట్లో భోజనం... రోజూ కొత్త రుచులు..." ఫెళ్ళున నవ్వేడు మురళి. ప్రభాకర్ అభా వంగా అతని వైపు చూసాడు.

"సర్లే! రేపు గెస్ట్‌హౌస్‌లో పార్టీ ఉంది. ఏర్పాటు చెయ్యి. నాన్నగారు అడిగితే...." ఏంచెప్తావన్నట్లు కనుబొమ్మలెగరేసి నవ్వేడు.

"మీరు మీ ఫ్రెండ్సుతో అక్కడ చదువు కుంటున్నారని చెబుతాను."

"దట్స్ గుడ్!" మురళి పర్సుతీసి రెండు వేల రూపాయలు అతనికి అందించాడు.

ప్రభాకర్ డబ్బు తీసుకుని వచ్చేసాడు.

ఫణిభూషణ్‌రావుగారికి తన కొడుకు సి.ఏ. చదవాలని, తన ప్రాక్టీసుకి అతన్ని వారసుడిని చెయ్యాలని ఆశ. అయనకి మురళి బి.కామ్ చదివే రోజులలో సగం రోజులు కాలేజీకి వెళ్ళలేదని తెలియదు. అయినా అతను ఫస్టుక్లాసులో ఎలా పాస య్యాడో తెలియదు. గత అయిదేళ్ళుగా మురళి సి.ఏ. పరీక్ష రాస్తూనే ఉన్నాడు. కాని పాసవడం మాత్రం జరగడం లేదు. కొడుక్కి సి.ఏ చదివే తెలివితేటలు ఉన్నా అతను దారి తప్పాడని ఆయన తెలుసుకో లేకపోతున్నాడు.

మురళికి చదువు రావడం లేదుగాని, స్నేహితులు నేర్పిన అలవాట్లు వ్యసనాలై అతన్ని తమ బానిసని చేసుకున్నాయి.

మురళి గురించి తనకి ఆశ్రయమిచ్చిన ఫణిభూషణరావుగారితో అబద్ధం చెప్పడా నికి ప్రభాకర్‌కి నోరు రాదు. చెప్పకపోతే మురళి ఆగ్రహానికి గురవుతాడు. అలా అని అతను చెడిపోతే చూస్తూ వూరుకోలే

కపోతున్నాడు. అతన్ని సరైన దారిలో పెట్టడానికి ప్రభాకర్ చెప్పిన హితోక్తులేవీ పనిచెయ్యలేదు.

"షటప్! మైండ్ యువర్ బిజినెస్!" అని ఒక్క అరుపుతో తన ఆధిక్యతని, ప్రభాకర్ స్థానాన్ని గుర్తుచేసాడు మురళి.

ప్రభాకర్‌కి తన స్థానమేమిటో తెలిసింది. తను హద్దుమీరడం అనవసరం అనిపించింది. కాని, మురళి తండ్రితో తనని చెప్పమన్న అబద్ధం చెప్పాక రెండు రోజులపాటు ఫణిభూషణరావుగారికి ద్రోహం చేసినట్లు ఫీలవుతాడు. ప్రభాకర్ జేబులో మురళి ఇచ్చిన డబ్బు బరువుగా ఉంది. అంతకు మించి అతని గుండె బరువుగా వుంది.

'భగవంతుడా! నాచేత మళ్ళీ అబద్ధం చెప్పించి పాపం చేయిస్తున్నావా?' అని వేదనగా నిట్టూర్చాడు.

★ ★ ★

స్టీరియో సిస్టమ్‌లో నుంచి మ్యూజిక్ వినిపిస్తోంది. రమ్య కుర్చీలో కూర్చుని కాళ్లూపుతూ చిటికెలు వేస్తోంది.

"రమ్యా!" నారాయణరావు పిలుపు వినబడగానే ఆమె ముఖంలో అప్రసన్నత పిలిచినట్టే వచ్చేసింది. "ఏం కావాలి?" అతని వైపు చూడకుండానే అంది.

"కాస్సేపు చదువుకోవచ్చు కదమ్మా! ఇప్పటివరకు టి.వి. చూసావు. ఇప్పుడు" అతని మాట పూర్తికాకుండానే స్టీరియో వాల్యూమ్ మరింత పెంచింది.

ఆ గదే కాదు ఇల్లంతా మ్యూజిక్‌తో హోరెత్తిపోతోంది.

అతనికి అర్థమయింది. రమ్య తను అవునన్నది కాదంటుంది. కాదన్నది అవునంటుంది. ఒక విధంగా తనపై గల తిరస్కారాన్ని, అయిష్టతని మౌనంతో ప్రకటిస్తోంది. తనని సాధిస్తున్నాననుకుని తన కెరియర్‌ని చేజేతులా పాడుచేసుకుంటోంది. ఎలా ఆమెలో వ్యతిరేకతని పోగొట్టడం? ఆమెకి చదువుపట్ల శ్రద్ధాసక్తులను ఎలా కలగచెయ్యటం?"

అతను స్టీరియో స్విచ్ ఆఫ్ చేసాడు. రమ్య కుర్చీలోంచి లేచి తిరిగి స్విచ్ ఆన్ చెయ్యబోయింది. నారాయణరావు కూతురి చెయ్యిపట్టి ఆపేసాడు.

"నేను నీతో మాట్లాడాలి"

"నాకు నీతో మాట్లాడాలని లేదు" విసురుగా అంది.

"నేనేం చేసానమ్మా?" నిస్పృహాయంగా అడిగేడతను. "నువ్వు నాతో ప్రేమగా ఎందుకుండడం లేదు? నువ్వు నన్ను నాన్నా అని పిలిచి ఎన్ని నెలలయింది?"

"నువ్వు నా తండ్రివి కాదని తెలిసాక 'నాన్నా' అని ఎలా పిలవమంటావ్? నువ్వు నా గార్డియన్‌వి. కాలేజీ అప్లికేషన్ ఫారమ్‌లో కూడా అలాగే రాసాను" కసిగా నవ్వింది.

నారాయణరావు బాధని దిగమింగి అన్నాడు.

"పోనీ, నేను నీ గార్డియన్‌నే అనుకో! నీ మంచి చెడ్డలను చూసే బాధ్యత నాపై ఉందా లేదా? ఎప్పుడూ చదువులో ఫస్ట్ ఉండే నువ్వు ఇలా వెనుకబడి పోవడం నాకెంత బాధని కలిగిస్తోందో తెలుసా?"

"నువ్వు బాధపడ్డమే నాకు కావలసింది" వాడిగా ఉన్న బాణం సూటిగా గుండెలో దిగబడినట్టయింది ఆ సమాధానంతో.

"నేను నీకేం లోటు చేసానమ్మా?"

"అన్నీ ఎక్కువే చేసావు. అందుకు నా కృతజ్ఞతలు. వెళ్లు. నా గదిలోంచి బయటకి వెళ్లు" చేతులు జోడిస్తూ అని, తిరిగి స్టీరియో ఆన్ చేసింది.

నారాయణరావు విహ్వలంగా చూసి ఇవతలికి వచ్చేసాడు.

★ ★ ★

రమ్య రెస్టారెంట్‌లో కార్నర్ టేబిల్

దగ్గర కూర్చుని ఉంది. బేరర్ మెనూ కార్డుతో ఆమె దగ్గరకి వచ్చాడు.

ఆమె కార్డు చూడకుండానే అంది, "నేను కాస్సేపాగి ఆర్డరిస్తాను."

"ఓకే మేడమ్" అతను వెళ్లాడు.

ఆ టైములో రెస్టారెంటు ఖాళీగా వుంది. రెండు మూడు టేబిల్స్ దగ్గర మాత్రం కస్టమర్లున్నారు.

రమ్య రిలాక్స్డ్‌గా కూర్చుంది. రోజూ నాలుగున్నరకి కాలేజీనుంచి నేరుగా ఇంటికి వెళ్ళే తను ఇవాళ ఐదున్నర అవుతున్నా ఇంటికి రాకపోవడంతో ఇంట్లో అందరూ కంగారు పడుతుంటారు అనుకోగానే ఆమెకి పైశాచిక ఆనందం లాంటిది కలిగింది.

బ్యాగ్‌లోనుంచి సెల్ తీసి నెంబర్ డయల్ చేసింది.

"హలో!" అవతల దీప్తి స్వరం వినగానే ఆమెకి ఎక్కడలేని హుషారు వచ్చింది. ఇంటికి వెళ్లాక మూగగా ఒంటరిగా ఉండే ఆమె మాట్లాడేది ఫ్రెండ్స్‌తోనే. సెల్‌ఫోన్‌లో దీప్తితో సంభాషిస్తున్న ఆమెని రెండు టేబిల్స్‌కి అవతల కూర్చుని కాఫీ తాగుతున్న ఓ యువకుడు గమనిస్తున్న విషయం ఆమెకి తెలియదు.

పావుగంట తర్వాత ఫోన్ ఆఫ్ చేసి "ఎక్స్క్యూజ్ మి" అని బేరర్‌ని పిలిచింది.

మసాలా దోసె ఆర్డరిచ్చి, అది రాగానే తినడం మొదలుపెట్టింది.

టేబిల్ మీద ఎడమచేతి దగ్గరగా వున్న సెల్‌ఫోన్ మోగింది. ఆమె డిస్‌ప్లేలో నెంబరు చూసి కట్ చేసింది.

ఐదు నిమిషాల తరువాత మళ్లీ ఫోన్ మోగింది. మళ్లీ అదే నెంబర్. అది నారాయణరావు సెల్‌నెంబర్. తన సెల్‌నెంబరు ఆయనకి తెలియదు. తను చెప్పలేదు. ఎవరు చెప్పి ఉంటారు? ముడివడిన భ్రుకుటితో చూస్తూ ఆలోచిస్తోంది.

మళ్లీ సెల్ మోగింది.

ఈసారి వెంటనే సెల్ ఆన్ చేసింది.

"చెప్పు దీప్తీ!"

"మీ డేడీ నువ్వింకా ఇంటికి రాలేదని కంగారు పడుతున్నారు. నాకు ఫోన్‌చేసి నీ సెల్‌నెంబర్ అడిగారు"

"మాట్లాడారు" అంది క్లుప్తంగా.

"ఓకే!" దీప్తి ఫోన్ పెట్టేసింది.

రమ్య బేరర్‌ని పిలిచి కాఫీ తెమ్మంది.

పావుగంట తర్వాత బిల్ చెల్లించి బయటకొచ్చింది. అప్పుడు టైమ్ ఏడుగంటలు కావస్తోంది. పరధ్యానంగా వున్న రమ్య టేబిల్ మీద సెల్‌ఫోను వదిలెయ్యడం ఆమెనే గమనిస్తున్న ఆ యువకుడు చూస్తూనే ఉన్నాడు. కాని, ఆమెని వెనక్కి పిలిచి ఆ విషయం చెప్పలేదు.

ఆమె బయటకి వెళ్లగానే ఆమె కూర్చున్న టేబిల్ దగ్గరకొచ్చి సెల్‌ఫోను తీసి జేబులో పెట్టుకున్నాడు.

★ ★ ★

"నిన్న క్లాసులవగానే రెస్టారెంటుకి వెళ్లావా?" దీప్తి అలా అడగ్గానే రమ్య విచిత్రంగా చూస్తూ అడిగింది.

"ఎందుకలా అడుగుతున్నావ్?"

"అక్కడ నుంచి నాతో సెల్‌ఫోనులో మాట్లాడాక సెల్‌ఫోను అక్కడ వదిలేసావా?"

"అవును ఇంటికి వెళ్లాక చూస్తే సెల్‌ఫోను లేదు. వెనక్కి వచ్చి రెస్టారెంట్‌లో అడిగినా ఆ పాటికే ఎవరికో దొరికి ఉంటుంది. ప్రయోజనం ఉండదని ఊరుకున్నాను. అవును నేను సెల్‌ఫోను రెస్టారెంటులో మరచిపోయిన విషయం నీకెలా తెలుసు?"

మురళీ అనే అతనికి నీ సెల్‌ఫోను దొరికిందట. అతను నువ్వు నీ సెల్‌ఫోన్‌లో స్టోర్ చేసుకున్న నా సెల్ నెంబర్‌కి ఫోన్ చేసి అడిగాడు. అతను ఈరోజు

## గజదొంగతో సత్కారం




భారత స్వాతంత్ర్య సమరానికి అనంతపురం జిల్లా అందించిన మెరిక ల్లాంటి నాయకులలో పప్పూరు రామాచార్యులు సుప్రసిద్ధులు. ఆయనకు తండ్రిగారి నుంచి ధైర్య సాహసాలు అబ్బినాయి. ఆయన తండ్రి పేరు పప్పూరు నరసింహాచార్య. సంస్కృతాంధ్రాలలో పండితులు. హరికథలు, పురాణ ప్రవచనాలలో మంచి పేరు పొందారు.

ఒకసారి ఆయన బుక్కపట్టణం పరిసర అటవీ ప్రాంతంలో ప్రయాణం చేయవలసి వచ్చింది. గజదొంగల ముఠా ఏలుబడి ప్రాంతమది. తమ రాజ్యంలో అడుగుపెట్టిన ఆచార్యులను అడ్డగించి ఆయన దగ్గర ఉన్న డబ్బు దస్కం మొత్తం తమ స్వాధీనం చేయమని బెదిరించారు. కాని ఆచా ర్యులెంత మాత్రం భయపడలేదు. అతిసహజ హావభావ కంఠస్వరాలతో "వచ్చారా? రాలేదె అని వెతుకుతున్నా! మీ నాయకుడితో పనుంది. అతని కోసం వచ్చా. అతని దగ్గ రకు నన్ను తీసుకెళ్ళండి!" అన్నాడాయన. ఆయన మాట లతో వారు దిగ్భ్రమ చెందారు. ఆయనను తమ నాయకుడి దగ్గరకు తీసుకెళ్లారు. ఆ నాయకుడిని చూడగానే ఆచా ర్యులు, "నేడెంత సుదినం! ఇప్పటికి నేను మిమ్ము చూడగ లిగాను" అనడంతో, ఆ గజదొంగ ఉబ్బి తబ్బిబ్బై ఆచార్యు లను ఉచితాసనంపై కూర్చోబెట్టి మర్యాదలు చేశాడు. ఆచా ర్యులు కొంతసేపు హరికథాగానం చేయగా విని, వారిని ఘనంగా సత్కరించి, మర్యాదగా తన మనుషుల సహాయంతో సాగనంపాడు.



కాలేజీకి వచ్చి నీ సెల్‌ఫోను నీకు అందజే స్తానన్నాడు"

"థ్యాంక్ గాడ్!" తృప్తిగా ఊపిరి పీల్చు కుంది. ఇంతలో కాలేజీ ఆవరణలోకి హోండాసిటీ కారు వచ్చి ఆగింది. కారు దిగి తమవైపు నడిచి వస్తున్న ఆ యువ కుడిని చూస్తూనే దీప్తి అంది, "బహుశా అతనేనేమో!"

ఆమె అంచనా తప్పలేదు. ఆ యువ కుడు నేరుగా వాళ్ల దగ్గరకి వచ్చాడు.

"ఎక్స్క్యూజ్ మి. నా పేరు మురళి. నిన్న సాయంకాలం రెస్టారెంట్‌లో టేబిల్ మీద మీ సెల్‌ఫోను వదిలి వెళ్లారు. నేను చూసి మిమ్మల్ని పిలిచినా మీరు వినిపిం చుకోలేదు" అతను చేతిలోని సెల్‌ఫోన్‌ని రమ్య వైపు జాపాడు.

"థ్యాంక్‌యూ వెరీమచ్ రెస్టారెంట్‌లో నా ఫ్రెండ్‌తో మాట్లాడాక సెల్ టేబిల్‌పై పెట్టటం గుర్తుంది. ఇవాళ కాలేజీకి వచ్చాక దీప్తి చెప్పేవరకు నా సెల్‌ఫోన్ మిస్సయిన విషయమే తెలియలేదు. అయామ్ సారీ! మీకు ట్రబులిచ్చాను" అంది అతని చేతిలో నుంచి ఫోనందు కుని.

"బట్ మిమ్మల్ని కలుసుకున్నందుకు నాకు మాత్రం చాలా హేపీగా వుంది" అన్నాడతను ఆమె కళ్లలోకి చూస్తూ.

అప్పటివరకు చిరునవ్వుతో మాట్లాడు తున్న రమ్య ముఖం గంభీరంగా మారిపో యింది.

"బై, సీ యూ!" అతను వెళ్లిపోయాడు.

"సినిమా హీరోలాంటి ఒకబ్బాయి నిన్ను కలుసుకోడం.. హేపీగా వుందని ఒక అందమైన అమ్మాయితో చెప్పాడంటే అర్థ మేమిటి? లవ్ ఎట్ ఫస్ట్ సైటా" కొంటెగా నవ్వుతూ అంది దీప్తి.

"నోర్మూసుకో! లవ్వూ లేదు ఏం లేదు" అంది రమ్య మరింత గంభీరంగా మారి పోతూ.

"చూస్తూండు. నేను జోస్యం చెబుతున్నాను. అతను వారం తిరక్కుండా నీతో 'ఐ లవ్ యు' అంటాడు."

"నువ్వు చదువు మానేసి జ్యోతిష్యం నేర్చుకుంటే గిట్టుబాటవుతుందేమో చూడు" అంది రమ్య.

★ ★ ★

ఉదయం ఐదున్నరకి మెలుకువ వచ్చినా రమ్య బద్ధకంగా పడుకూనే ఉంది. తలగడ పక్కనే ఉన్న సెల్ మోగింది.

మత్తుగా కళ్లు విప్పి ఫోన్‌లో గ్రీన్ బటన్ నొక్కి చెవికి ఆనించుకుంది.

"హలో!"

"గుడ్ మార్నింగ్!" అవతలివైపు వినిపించిన పురుష స్వరం కొత్తది.

"ఎవరూ? "

"మురళి.. నిన్న మీ సెల్‌ఫోను తెచ్చిచ్చాను."

"ఓ! మీరా! గుడ్ మార్నింగ్!" అనాసక్తిగా, అయిష్టంగా అంది.

"మీ సెల్‌ఫోన్ మీకు తెచ్చిచ్చినందుకు కనీసం నాకు కాఫీయైనా ఇప్పించరా? "

రమ్యకి విసుగ్గా అనిపించింది. 'తను రెస్టారెంట్‌లో సెల్‌ఫోను మరచిపోయి ఎంత పొరపాటు చేసింది! తన సెల్ నెంబర్ అతనికి తెలిసిపోయింది. ఇంక ప్రతిరోజూ ఫోన్ చేసి తనని విసిగిస్తాడేమో!'

"మీతో రెస్టారెంట్‌లో కూర్చుని కాఫీ తాగేంత స్నేహం మనిద్దరి మధ్య లేదు" సౌమ్యతని స్వరంలోకి అరువు తెచ్చుకుని అంది.

"ఇది చాలా అన్యాయం రమ్యగారూ! సపోజ్ మీరు మీ మొబైల్‌ని ఏ ఆటోలోనో వదిలేసారనుకోండి. ఆటోడ్రైవర్ నిజాయితీగా మీ ఫోను మీకు తెచ్చిచ్చాడే అనుకోండి. అతని నిజాయితీకి సంతోషించి, అతనికి కనీసం వంద రూపాయలైనా ఇవ్వరా? నేను మిమ్మల్ని ఒక కప్పు కాఫీయేగా అడిగాను"

"నా మొబైల్ తెచ్చిచ్చినందుకు మరోసారి థ్యాంక్స్ చెబుతున్నాను. నాకు కాలేజీకి టైమవుతోంది.. వెళ్లాలి" రమ్య ఫోన్ కట్‌చేసి బాత్‌రూమ్‌లోకి వెళ్లింది.

స్నానం చేసి బయటకొచ్చి తనకెవరైనా ఫోన్ చేసారేమో అని సెల్ ఫోన్ చూస్తే మిస్డ్‌కాల్స్ లేవు. కాని మురళి పంపిన మెసేజ్ ఉంది.

'యు ఆర్ సో బ్యూటిఫుల్
యు ఆర్ సో స్వీట్
యు ఆర్ సో సాఫ్ట్
యు హేవ్ కిల్లింగ్ లుక్స్
దట్స్‌వై అయామ్ లవింగ్ యు
హాలో ఐయామ్ టాకింగ్ ఎబౌట్ ఎ రోజ్.. దటీజ్ యు - మురళి'

రమ్య ముడిపడిన భ్రుకుటితో ఆ మెసేజ్‌ని చదివి డిలీట్ చేసేసింది.

★ ★ ★

సాయంకాలం క్లాసులయ్యాక రమ్య, దీప్తి బయటకొచ్చారు.

"నా జోస్యం నిజం కాబోతోంది" అంది దీప్తి.

"అంటే? " అంది రమ్య.

"అటు చూడు" అంది.

దీప్తి చూపించిన వైపు చూసిన రమ్య భ్రుకుటి ముడివడింది.

కాలేజీ ఆవరణలో పార్క్ చేసివున్న లాన్సర్ కారుని ఆనుకుని, నిలబడివున్నాడు మురళి. ఆమె అతన్ని చూడనట్టు ముఖం తిప్పుకుంది.

అతను ఆమెని సమీపించాడు. "హలో" అన్నాడు.

రమ్య అతన్ని పలుకరించలేదు. తనని

కాదన్నట్టు జవాబివ్వకుండా ఊరుకుంది.

అతను ఆమె పక్కనే నడుస్తూ అన్నాడు, "ప్లీజ్! మీతో కలిసి ఒక కప్పు కాఫీ తాగాలని ఉంది"

"సారీ!" అతనివైపు చూడకుండానే అంది.

"కాఫీ మీరు నాకు ఇప్పించక్కర్లేదు. నేనే మీకు ఇప్పిస్తాను."

"నో థ్యాంక్స్!" నడక వేగం పెంచి దారినపోతున్న ఆటోని పిలిచి ఎక్కేసింది.

★ ★ ★

ఇంటికి వచ్చాక బ్యాగ్‌లో నుంచి సెల్‌ఫోను తీసి చూసింది. సైలెంట్ మోడ్‌లో వున్న ఫోన్‌లో ఆరు మిస్డ్ కాల్స్ వున్నాయి. అన్నీ మురళి ఫోన్ కాల్సే.

"సిమ్ వెంటనే మార్చెయ్యాలి. లేకపోతే వీడు ఇలాగే విసిగిస్తాడు" అనుకుంది విసుగ్గా.

కాని మరునాడు సాయంకాలం కాలేజీ గేటు బయట మురళిని చూసి తను సిమ్ మార్చడం వలన ప్రయోజనం లేదనిపించింది.

'హాయ్!' అన్నాడతను ఆమెని సమీపిస్తూ. అతనివైపు చూడకుండా నడక వేగం పెంచింది.

"ఫోన్ చేస్తే లిఫ్ట్ చెయ్యవు. ఎదురుగా వచ్చి పలుకరిస్తే మాట్లాడవు. ఏమిటి ప్రాబ్లెమ్? " ఏకవచనంలోకి దిగిపోయాడు.

'నువ్వే పెద్ద ప్రాబ్లమ్!' అనబోయి తమాయించుకుంది. "నా సెల్‌ఫోన్ తెచ్చిచ్చినందుకు మరోసారి థ్యాంక్స్ చెబుతున్నాను. పదే పదే నాకు ఫోన్‌చేసి నన్ను కలుసుకోవాలని ప్రయత్నించి విసిగించొద్దు" సీరియస్‌గా చూస్తూ అంది.

"ఓకే! రాను. కాని నాతో కలిసి కాఫీ తాగితే మైలపడిపోతావా? "

"ముందే చెప్పాను. మళ్ళీ చెబుతున్నాను. మనమిద్దరం కలిసి కాఫీ తాగేంత

## కొత్తగాలి...

**ఆమె కారు.. అతడు బైకు**
**దూకుడే,**
**ఎదురు కావు**
**ఎప్పుడూ**
**వెనుకబడటమే!**

– కొలకలూరి ఇనాక్, హైదరాబాద్

పరిచయం మన మధ్య లేదు".

"నేను నీ స్నేహాన్ని కోరుకుంటున్నాను"

"ప్లీజ్!" అసహనంగా అంది.. "నాకు మీతో స్నేహం చెయ్యాలని లేదు. మీతో మాట్లాడలని లేదు. మరోసారి నన్ను కలుసుకునే ప్రయత్నం చెయ్యొద్దు" నడక వేగం మరింత పెంచింది.

మురళి ఆమెని వెంబడించే ప్రయత్నం చెయ్యలేదు. ఆమెనే చూస్తుండిపోయాడు. ఆమెని ముగ్గులోకి దింపలేనందుకు అతనికి ఉక్రోషంగా ఉంది.

★ ★ ★

నారాయణరావు షాపులో బిజీగా వున్నాడు. క్రిస్మస్ గ్రీటింగ్ కార్డుల కోసం వచ్చే వాళ్లతో షాపు రద్దీగా ఉంది.

"నమస్తే సార్!" చిరపరిచితమైన స్వరం విని నారాయణరావు తల ఎత్తాడు.

ఎదురుగా ప్రభాకర్!

అతన్ని చూడగానే ఆయన ముఖం విప్పారింది.

"రావోయ్ రా!" ఆహ్వాన పూర్వకంగా అన్నాడు. అంతలో కస్టమర్లెవరో రావడంతో మళ్లీ బిజీ అయిపోయాడు. అరగంట తరువాత రద్దీ కొంచెం తగ్గి ఊపిరి పీల్చుకున్నాడు. ఇంకా నిలబడే ఉన్న ప్రభాకర్‌ని చూసి వాత్సల్యంగా అన్నాడు, "కూర్చోలేకపోయావా? అలా ఎంతసేపు నిలబడతావ్? "

"ఫర్వాలేదు సార్!"

ఇంతలో నారాయణరావు సెల్‌ఫోను మోగింది. నెంబరు చూసి వెంటనే రిసీవ్ చేసుకున్నాడు.

"రమ్య ఇంకా ఇంటికి రాలేదు" గాబ రాగా చెప్పింది ప్రభ.

"ఏ ఫ్రెండింటికో వెళ్లి ఉంటుంది. నువ్వు గాబరాపడకు".

"రోజూ నాలుగున్నరకే ఇంటికొచ్చేది" దాదాపు ఏడుస్తూ అంది.

"నువ్వు కంగారుపడకు. రమ్య ఫ్రెండ్సంతా నాకు తెలుసు... నేను వెళ్లి దాన్ని తీసుకొస్తాను" ఫోన్ పెట్టేసాడు.

భార్యకి ధైర్యం చెప్పాడేగాని, అతన్ని ఏదో తెలియని అధైర్యం ఆవహించింది.

రమ్య ఏదో తమ నుంచి దాస్తోంది. కొత్తగా ఎవరో స్నేహితులు దొరికారు. వాళ్లతో ఎక్కడికో వెళ్తోంది. ఆ స్నేహి తులు ఆడా, మగా అని ఆలోచించడం లేదతను. వాళ్లు మంచివాళ్లా, కాదా అని ఆలోచిస్తున్నాడు. వివర్ణమైన అతని ముఖాన్ని చూసి, ఫోన్‌లో నారాయణరావు సంభాషించిన దాన్నిబట్టి రమ్య ఇంకా ఇంటికి రాలేదని అర్థం చేసుకున్నాడు ప్రభాకర్.

"నేను కాలేజీకి వెళ్లి చూసిరానా సార్? "

"నేనే వెళ్తాను. నువ్వేమీ అనుకోకపోతే కాస్సేపు క్యాష్‌కౌంటర్‌లో కూర్చుంటావా? "

"క్యాష్ దగ్గర నేనెందుకు సార్? " ఇబ్బం దిగా అన్నాడు.

"నీపై నాకు నమ్మకం ఉంది. ఫర్వా లేదు. కూర్చో" అతను షాపులో సేల్స్‌మె న్‌కి కస్టమర్లు వస్తే చూసుకోమని చెప్పి స్కూటర్ స్టార్ట్ చేసాడు.

కాలేజీ బిల్డింగ్‌కి కాస్త దూరంలో ఉండ గానే అతనికి అర్థమయిపోయింది. రమ్య కోసం తను అక్కడ వెతకడం అనవసర మని. కాలేజీ గేట్లు మూసేసి ఉన్నాయి.

అతను క్షణకాలం పెదవి కొరుకుతూ ఉండిపోయాడు. 'ఎక్కడని వెతుకుతాడు? పద్దెనిమిదేళ్ల అమ్మాయి కాలేజీ నుంచి రాత్రి ఎనిమిది గంటలు కావస్తున్నా ఇంటికి రాలేదంటే లోకులు కాకుల్లా పొడ వరూ? ' అతనికి దుఃఖం వచ్చింది. అతను కర్తవ్య విమూఢంగా స్కూటర్‌ని ఆనుకుని నిలబడిపోయాడు.

ఇంతలో సెల్ మోగింది. అతను నిరా సక్తంగా ఫోన్ రిసీవ్ చేసుకున్నాడు.

'రమ్య ఇప్పుడే ఇంటికొచ్చింది' అంది ప్ర భ. "సరేలే!" అని, అతను గుండెలనిండా ఊపిరిపీల్చుకుని స్కూటర్ స్టార్ట్ చేసాడు. కూతురు ఇంటికి వచ్చిందనే సంతోషం కంటే ఆమె కాలేజీ నుంచి నేరుగా ఇంటికి రాకుండా ఎక్కడకి వెళ్లిందనే ప్రశ్న అతన్ని ముల్లులా పొడుస్తోంది.

"నిన్న కాలేజీ నుంచి ఆలస్యంగా ఇంటి కెందుకొచ్చావ్? " నారాయణరావు సూటిగా అడిగేడు.

"ఫ్రెండ్‌తో బయటికి వెళ్లాను" అతని వైపు చూడకుండానే అంది.

"ఫ్రెండంటే? "

"ఫ్రెండే"

"అదే ఎవరా ఫ్రెండ్? "

"దీప్తి అని నా క్లాస్‌మేట్!"

"మంచి పిల్లేనా? "

"మనుషుల ముఖాలమీద వీళ్లు మంచి వాళ్లు, వీళ్లు చెడ్డవాళ్లు అని రాసి ఉండదు"

"కాబట్టి స్నేహితులని ఎన్నుకోవడంలో జాగ్రత్తగా ఉండాలి. కాలేజీ నుంచి నేరుగా ఇంటికొచ్చే నిన్ను.. ఇంటికి వెళ్లడం ఆలస్య మైనా ఫర్వాలేదు అనే నిర్లక్ష్య ధోరణికి అలవాటుపడేలా చేసిన ఆ స్నేహితురాలి ప్రభావం నీపై పడకుండా జాగ్రత్తపడు. ముఖ్యంగా నువ్వు గుర్తుంచుకోవలసింది మరొకటి ఉంది. నేను రాత్రి పదిగంటల

# సహధర్మచారిణి




కల్లూరి సుబ్బారావుగారు 1921లో స్వాతంత్ర్య ఉద్యమంలో దిగేనాటికి గృహస్థు. భార్య లక్ష్మమ్మ దొడ్డ ఇల్లాలు. సుబ్బారావుగారిది కలిగిన కుటుంబం కాదు. ఉన్న కొద్దిపాటి పిత్రార్జితమూ 1925నాటికి ఆయన చేతిలో నిలవలేదు. దంపతులిరువురూ త్యాగశీలురే!



టంగుటూరి ప్రకాశం గారికి కల్లూరి సుబ్బారావుగారికీ నడుమ సాన్నిహిత్యం, అనేక విషయాల్లో అంతే సామ్యమూనూ. ఒకసారి ప్రకాశంగారు పనిగట్టుకొని కల్లూరు వచ్చారు. సుబ్బారావుగారితో మాట్లాడి, ఆయన్ను తోడ్కొని నంద్యాల వెళ్ళవలసివుంది. మాటలయ్యాక భోజనాదులు ముగించి ప్రయాణ సన్నాహాలు ప్రారంభించారు. సన్నాహాలనగా మరేమీ కాదు, ప్రయాణ ఖర్చుల సర్దుబాటు. అదే అప్పుడు కొదవ. అన్ని పెట్టెలు, గూళ్ళు, పుస్తకాలు, అంతటా వెదికారు. ఇల్లుపీకి పందిరేసినంత పనిచేశారు. చిల్లికాసూ కంటపడలేదు. ఇక అప్పుడు అప్పుకోసం ఏం చేయాలనే జిజ్ఞాసలో పడ్డారు.

సుబ్బారావుగారి భార్య ఇది గమనిస్తూనే వుంది. పరిస్థితి గమనించి, అదను చూసి, తన బంగారు ఆభరణమైన నాగరాన్ని భర్త చేతిలో పెట్టింది. వారిద్దరూ ఆమె మొహంవైపు చూశారు. దరహాసం దోబూచులాడుతుండగా ఆమె, "హిందూపురంలో దీనినమ్మి నంద్యాల వెళ్ళిరండి" అంది.

వరకు ఇంటికి రాను. నువ్వు వేళకి ఇంటికి రాకపోతే అమ్మ, నాన్నమ్మ ఎంత కంగారు పడతారు? ఈ వయసులో నాన్నమ్మకి ఇలాంటి టెన్షన్స్ అవసరమా? ఆవిడని ప్రశాంతంగా ఉండనియ్యి".

"పాపి చిరాయుః అన్నారు. ఆవిడంత తొందరగా పోదులే!" వెటకారంగా నవ్వింది రమ్య.

నారాయణరావులోని అణువణువూ భగ్గుమంది. ఈడ్చిపెట్టి ఆమెని కొట్టాలనిపించినా తమాయించుకున్నాడు.

"రమ్యా!" అన్నాడు గట్టిగా అరుస్తున్నట్టు. ఆమె ఖాతరు చెయ్యనట్టు గదిలోకి వెళ్ళిపోయింది.

నారాయణరావుకి ఆగ్రహావేశాలతో ఒళ్ళు తెలియడంలేదు.

నాన్నమ్మ అని, వయసులో పెద్దదని కూడా చూడకుండా ఎంత మాట అనేసింది? ఇంట్లో ఉన్నంతసేపూ పసిపిల్లలా తన దగ్గరే కూర్చున్న రమ్య... తన చెయ్యి పట్టుకుని అడుగులు వేసిన చిట్టి తల్లి.. తన దగ్గర మాటలు నేర్చుకున్న పిల్ల.. తననిప్పుడు ఈటెల్లాంటి మాటలతో హింసిస్తుంటే అతనికి తనమీద తనకే జాలేస్తోంది. తన చేతకానితనంపై కోపం.. నిస్సహాయత.. తను గుండెల మీద వేసుకుని పెంచిన రమ్య తన గుండెల మీద తంతోందే అనే బాధ అది.

★ ★ ★

హైదరాబాదులో ఇంజనీరింగ్ చదువుతున్న హరి నాలుగు రోజులు సెలవులకని ఇంటికొచ్చాడు.

"మిడ్స్‌లో క్లాస్ ఫస్టు నేనే నాన్నా!" అని వాడు సంబరంగా చెప్పడం, "వెరీగుడ్! కీపిటప్" అని తండ్రి వాడి తల నిమరడం రమ్య చూస్తూనే ఉంది. ఆమె మనసులో ఒక క్రూరమైన ఆలోచన వచ్చింది. తండ్రి బయటకి వెళ్ళేదాకా ఆగి ఆమె తమ్ముడి గదిలోకి వెళ్ళింది.

ఆ గదిలో వాడు చదువుకుంటున్నాడు.

చాలా నెలల తర్వాత తన గదిలోకి వచ్చిన ఆమెని చూసి "రా అక్కా!" అన్నాడు.

"ఏమిటో చాలా సంతోషంగా ఉన్నట్టు న్నావ్" అదోలా నవ్వుతూ అడిగింది.

"అవును. మిడ్స్‌లో క్లాస్ ఫస్టు నాదే? "

"ఈ సంగతి.. ఆయన, అదే నాన్నకి చెప్పావా"

"చెప్పాను" అన్నాడు హరి.

"నారాయణరావు మన తండ్రి కాదురా ఫూల్! కేవలం మన గార్డియన్ అంతే!"

హరి కళ్లు వెడల్పయ్యాయి. ఆ కళ్లలో అపనమ్మకం. "ఏం కాదు. ఆయన మన నాన్న!"

"కాదు" గట్టిగా అంది.

"అవును" అంతకంటే గట్టిగా అన్నాడు.

"కావాలంటే నాన్ననే అడుగు"

"అడుగుతాను. నాకేం భయం? అయినా నీకు నాన్నంటే కోపం! నాన్న మ్మంటే కోపం! ఎంత కోపముంటే వాళ్లు మనకేమీ కాదనేంత వరకూ వెళ్లావో! ఆయన మన నాన్న కాకపోతే మననెందు కంత ప్రేమగా చూస్తారు? "

"నేను చెబుతున్నది నిజం. ఆయన మన నాన్న కాదు" హరి కళ్లు చిత్రంగా ముడుచుకున్నాయి.

"నువ్వు అబద్ధం చెబుతున్నావు"

"ఒట్టు! నిజంరా! ఆయన మనని పెంచిన తండ్రి"

"అయితే మన నాన్నెవరు? "

"ఎవరంటే.." ఎందుకోగాని తమ తండ్రి కామేశ్వర్రావు అని వాడితో చెప్పలేకపో యింది.

"అదంతా ఒక పెద్ద కథ. నువ్వు కొంచెం పెద్దవాడి వయ్యాక చెబుతాను. ఈ విషయం నాక్కూడా కొంతకాలం కిందటే తెలిసింది. ఈ నారాయణరావు, సూర్యకాంతమ్మ మనని దారుణంగా మోసం చేసారు. అందుకే వాళ్లంటే నాకంత కోపం" రమ్య వాడి ముఖంలో మారుతున్న రంగులని కనిపెడుతూ అంది.

"నీకు నేను, నాకు నువ్వు తప్ప ఈ ప్రపంచంలో మనకెవరూ లేరు. మనం అనాథలం"

క్షణం ఆగి, "నువ్వు ఇదంతా మనసులో పెట్టుకోకు. బాగా చదువుకో" అని బయ టికి వచ్చేసింది.

తన మాటలు ప్రశాంతంగా ఉన్న వాడి లేత మనసుపై ఎలాంటి ప్రభావం చూపి స్తాయో ఆమె ఊహించగలదు. ఆమెకి సంతృప్తిగా ఉంది. తమ్ముడిని తండ్రికి దూరం చేసెయ్యాలి. ఆయనని నరకయా తనకి గురి చెయ్యాలి. వాళ్లవల్ల తను పొందిన అవమానాలకి అదే ప్రతీకారం?

★ ★ ★

రమ్య గదిలో నుంచి వెళ్లాక హరి చేతు లలో ముఖం దించుకుని కూర్చున్నాడు. వాడికి దుఃఖం వస్తోంది.

అక్క చెప్పింది నిజమేనా? తను ప్రాణంగా ప్రేమించే తమని ప్రాణాధికంగా ప్రేమించే తండ్రి నిజంగా తమ తండ్రి కాడా? అయితే తమ తండ్రి ఎవరు?

నారాయణరావు ఆ గదిలోకి వచ్చేప్పటికి హరి మంచం మీద వెల్లకిలా పడుకుని సీలింగ్ వైపు తదేకంగా చూస్తున్నాడు. సాధారణంగా ఆ టైములో చదువుకుంటూ ఉండేవాడు. ఈ రోజు అంత త్వరగా పడు కోడం.. నిద్ర కూడా కాదు ఏదో విష యమై దీర్ఘంగా ఆలోచించడం.. వాడి ముఖం మామూలుగా లేకపోవడం గమ నించాడతను.

"ఏం నాన్నా? ఒంట్లో బాగా లేదా? " లాలనగా అడిగాడు.

ఘనీభవించిన మేఘానికి చల్లగాని తగిలి వర్షించినట్టు వాడు తండ్రి ఒడిలో తల దూర్చి వెక్కి వెక్కి ఏడవడం మొద

లు పెట్టాడు.

"ఏమయింది నాన్నా? ఏమయిందిరా?" అతను గాబరాగా ప్రశ్నించాడు. వాడి దుఃఖం మరింత ఉధృతమయింది.

అతను ఎంతో లాలించిన మీదట అతి ప్రయత్నం మీద దుఃఖాన్ని కంట్రోల్ చేసుకుని అడిగేడు, "నువ్వు మా నాన్నవి కాదా నాన్నా!" నారాయణరావు గుండె క్షణకాలం కొట్టుకోడం ఆగింది. ముఖం పాలిపోగా అడిగేడు, "ఎవరు చెప్పారు?"

"అక్క..."

అతని శరీరంలో రక్తప్రసరణ ఆగినట్ట యింది. వాడిని చుట్టుకున్న అతని చేతులు అప్రయత్నంగానే వదులయ్యాయి.

"నువ్వు మా నాన్నవి కావుట. మా నాన్న వేరే ఎవరో అని నువ్వు మమ్మల్ని పెంచిన తండ్రివని చెప్పింది. మన అసలు నాన్న ఎవరని అడిగితే నేను పెద్దయ్యాక చెబుతానంది"

అప్పుడే ఆ గదిలోకి రాబోయిన ప్రభ వాడన్న మాటలని స్పష్టంగా వింది. షాక్ తిన్నట్టు చేష్టలుడిగి నిలబడిపోయింది. భార్య అక్కడకి రావడం చూసిన నారాయ ణరావుకి ఆ సమయంలో ఆమె అక్కడకి రావడం అనవసరం అనిపించింది. వాడ డగిన ప్రశ్నకి ఆమె కూడా జవాబు ఇవ్వ వలసి ఉంటుంది. అందుకే అతను కను సైగతో ఆమెని అక్కడ నుంచి పంపే సాడు. గుండె పగిలిన ప్రభ శోకమూర్తిలా అక్కడ నుంచి వెళ్లిపోయింది.

'రమ్య హరి మనసులో విషాన్ని గుమ్మ రించింది. అది వాడి మనసులోని సున్ని తమైన భావాలని చంపేసేలోగా వాడిని కాపాడుకోవాలి.. ఎలా?' నారాయణరావు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

"అక్క చెప్పింది నమ్ముతున్నావా నాన్నా?" లాలనగా అడిగాడు.

హరి తల అడ్డంగా ఊపాడు, "లేదు. కాని అక్కకి నీ మీద ఎందుకంత కోపం?

**కొత్తగాలి...**

**విలుకానికేనా**
**పాపాయికీ ముఖ్యమే**
**బొటనవేలు**

– బద్ది నాగేశ్వరరావు,
అనకాపల్లి

అది కూడా ఈ మధ్యనే. ఇదివరకు ఇలా ఉండేది కాదు."

"అది మా దురదృష్టం" నారాయణరావు కొడుకుని దగ్గరకి తీసుకున్నాడు. అతని కళ్లు వర్షిస్తున్నాయని అతనికే తెలియదు.

★ ★ ★

"అరకేజీ సర్ఫ్ ఇవ్వండి" అంటూ వచ్చాడు రాయుడు. సేల్స్‌బాయ్ సర్ఫ్ పేకెట్టు అందించాడు.

రాయుడు కౌంటర్‌లో కూర్చున్న నారా యణరావుకి వందనోటు అందిస్తూ అడి గేడు ఆరాగా, "నాలుగు రోజుల క్రిందట మా ఆవిడ టీ పేకెట్టు తెమ్మంటే షాపు కొచ్చాను. షాపులో మీరు లేరు."

'ఏదో పని మీద బయటకి వెళ్లాను" అన్నాడు బిల్‌తో బాటు మిగిలిన డబ్బు అందిస్తూ.

"అవును కౌంటర్లో కూర్చున్న కుర్రాడు చెప్పాడు. అతనిపై మీకు నమ్మకం కాబట్టే కేష్ కౌంటర్ దగ్గర కూర్చోబెట్టారు."

"అవును అతను చాలా మంచివాడు. ఇక్కడే కాలేజీలో బీఎస్సీ ఫైనలియర్ చదు వుతున్నాడు."

"అతను మీఇంటికి వచ్చిపోతుంటాడుట"

రాయుడి కుతూహలానికి కోపం వచ్చినా సహనంగా అన్నాడు, "అతను వారాలు చేసుకుని చదువుకుంటున్నాడు. వారంలో ఒక రోజు మా ఇంటికి భోజనానికి వస్తాడు."

"ఆ అబ్బాయికి మీ అమ్మాయినిచ్చే ఉద్దేశం మీకుంది కాబోలు!"

"రాయుడుగారూ!" తీవ్ర స్వరంతో పిలిచాడు.

"అహఁ! నా ఉద్దేశం.. అబ్బాయి యోగ్యుడు, బుద్ధిమంతుడు అయినప్పుడు మీకా ఉద్దేశముంటే తప్పేమిటని? "

"అతనికి వారంలో మిగతా ఆరు రోజులూ ఆరు కుటుంబాల వాళ్ళు భోజనం పెడుతున్నారు. వాళ్ళు కూడా అదే ఉద్దేశంతో అతనికి అన్నం పెడుతున్నారా? "

"ఆ అబ్బాయి మీకైతే సరిపోతాడు. మీ అమ్మాయికి అతనికి ఈడూజోడూ బాగా కుదురుతుంది" వంకరగా నవ్వి రాయుడు నిష్క్రమించాడు.

నారాయణరావుకి అతని మాటలలోని అర్థం బోధపడింది. అక్రమ సంతానమైన రమ్యకి, అనాథ అయిన ప్రభాకర్‌కి జోడీ సరిపోతుందని కదూ అతని మాటలకి అర్థం. అసహాయతతో కూడిన వేదన అతని మనసుని కుదిపేసింది.

'లోకం దృష్టిలో తనెంత చులకనయిపోయాడు? అసలు రమ్యకి తను పెళ్ళి చెయ్యగలడా? ' తిరస్కారపూరితమైన కూతురి ప్రవర్తనతో గాయపడి వున్న అతని మనసు మరో కోణంలో సమస్య ఎదురవబోతోందనే భయంతో మరింత వ్యాకులపడింది. 'రమ్య అందగత్తె. తను కట్నకానుకలని బాగా ముట్టచెప్పగల స్థితిలో వున్నాడు. అయితేనేం? ఆమె అక్రమ సంతానమని తెలిస్తే ఆమెనెవరు పెళ్ళి చేసుకుటారు? రాయుడు చెప్పినట్టు ఏ అనాథకో ఇచ్చి పెళ్ళి చెయ్యవలసిందేనా? ' అతనికి సుడిగుండంలో చిక్కుకుపోతున్నట్టుంది.

★ ★ ★

సూర్యకాంతమ్మ కొడుకు, కోడలి ముందు అపరాధ భావనతో తలెత్తుకోలేకపోతోంది. రమ్య చదువు గాడి తప్పడం, తల్లిని, తండ్రిని శత్రువుల్లా చూడడం ఆవిడ భరించలేకపోతోంది. ఇంత జరుగుతున్నా కొడుకు కాని, కోడలు కాని 'ఈ వినాశనానికి కారకురాలివి నువ్వే' అని ఆవిడని నిందించడం లేదు. కనీసం తనపై ఏహ్యతనయినా ప్రకటించడం లేదు. వాళ్ళిద్దరి గుండెల్లోని మంట వాళ్ళ కళ్ళలో వేదనగా ప్రతిఫలిస్తూ ఆవిడ మనసుని దహిస్తోంది. పశ్చాత్తాపం పాపానికి ప్రాయశ్చితం అనేది నిజమే కదా? తను చేసిన పాపానికి భగవంతుడు తననెలా శిక్షిస్తాడో తెలియదు. కాని ఈలోగా తనని తనే శిక్షించుకోవాలి.

నాలుగు రోజుల సంఘర్షణని అనుభవించిన తర్వాత ఆవిడ కొడుకుతో చెప్పింది. "నేను కొన్నాళ్ళు రామాపురంలో వుండి వస్తానురా!"

"ఇప్పుడా? అక్కడికెందుకమ్మా? " ఆశ్చర్యంగా అడిగేడు నారాయణరావు.

"ఊరికే! కొంచెం మార్పుగా వుంటుంది. ఇక్కడ చెయ్యడానికి పనేమీ లేక బొత్తిగా తోచడం లేదు నాకు"

'చేసిన పాపాలని కడుక్కోడానికి మీరు దానాలు చేస్తున్నారు. మీ అమ్మ పూజలు చేస్తోంది' అని రమ్య వ్యంగ్యంగా అన్న మరుసటి రోజు నుంచే ఆవిడ పూజ చెయ్యడం మానేసింది. అది గుర్తు చేసుకుని అన్నాడు "రమ్య చిన్నపిల్ల. అదేదో కోపంలో అంటే నువ్వు పట్టించుకోకు"

"అది అన్నదని కాదు.. నాకే ఉండబుద్ధి కావడం లేదు."

నారాయణరావు, ప్రభ ఎంత నచ్చచెప్పినా ఆవిడ ఊరికి వెళ్ళే ప్రయత్నం నుంచి విరమించుకోలేదు. గత్యంతరంలేక నారాయణరావు తల్లిని రామాపురంలో దింపి వచ్చాడు.

★ ★ ★

**చి॥** నారాయణని, చి॥ సౌ॥ ప్రభని, దీవించి వ్రాయునది. మీరు ఇద్దరూ చిన్న వాళ్ళయినా నన్ను క్షమించమని అడుగుతున్నాను. నిజానికి క్షమార్పణ కోరే అర్హత కూడా నాకు లేదు.

ప్రభా! నారాయణలోని లోపం గురించి తెలిసి కూడా వాడికి పెళ్ళి చెయ్యడం నేను చేసిన పెద్ద తప్పు. వంశాభివృద్ధి జరగాలనే స్వార్థంతో నిన్ను వ్యభిచరించమని ప్రోత్సహించడం మరో తప్పు. నేను వేశ్య కంటే హీనంగా దిగజారిపోయి ప్రవర్తించాను.

నేను చేసిన తప్పువల్ల మీ జీవితాలు అల్లకల్లోలవుతాయని నేను ఆనాడు ఊహించలేకపోయాను. నేను చేసిన తప్పుకి భగవంతుడు నాకే శిక్ష విధిస్తాడో తెలియదు. కానీ నన్ను నేనే శిక్షించుకోవాలనుకున్నాను. పూర్వకాలంలో రాజులు నేరం చేసిన వాళ్ళకి ద్వీపాంతర వాసాన్ని శిక్షగా వేసేవాళ్ళట. ఈ వయసులో మీ నీడలో నిశ్చింతంగా గడపవలసిన నేను ఇక్కడ ఒంటరిగా జీవితం గడపడం కంటే పెద్ద శిక్ష ఏముంటుంది? ఇంక ఎప్పటికీ తిరిగి రాను.

సూర్యకాంతమ్మ

ఆ ఉత్తరాన్ని చదివి ప్రభ కన్నీళ్ళు పెట్టుకుంది.

"అమ్మ ఇంక మన దగ్గరకి రాదు ప్రభ!" అని పసివాడిలా ఏడ్చాడు నారాయణరావు.

ప్రభ మనసులో ఒకప్పుడు ఆవిడపై ఏహ్యత, తిరస్కార భావాలుండేవి. ఇప్పుడు వాటి స్థానంలో ఆవిడపై జాలి ఏర్పడింది.

★ ★ ★

రమ్య కాలేజీ నుంచి ఇంటికొచ్చేప్పటికి అలవాటుకి విరుద్ధంగా నారాయణరావు ఇంట్లో వున్నాడు. అతని ముఖం లంఖణాలు చేసినట్టు పీక్కుపోయి వుండడం, తల్లి చాలా సేపు ఏడ్చిందనడానికి సాక్ష్యంగా ఆమె కనురెప్పలు వాచి వుండడం రమ్య ఒక్క చూపులోనే గమనించింది.

కూతురు రావడం చూసి ప్రభ కిచెన్ లోంచి టిఫిన్ ప్లేటు పాలు తెచ్చి డైనింగ్ టేబిల్ మీద పెట్టింది. రమ్య బ్యాగ్‌లో నుంచి లంచ్ బాక్సు తీసి టేబిల్‌పై పెట్టి, టిఫిను తింది. ఆమె పాలు తాగుతుండగా నారాయణరావు ఆమె దగ్గరకి వచ్చాడు.

"అమ్మలూ! బామ్మ రామాపురం వెళ్ళింది. నీకు తెలుసుకదా!"

రమ్య తల ఎత్తలేదు.

"ఇంక ఎప్పటికీ ఇక్కడకి రానని ఉత్తరం రాసింది" అతని గొంతు వణికింది.

"నాకు సంబంధం లేని వ్యక్తి గురించి నాకెందుకు చెబుతున్నావ్!" టక్కున ఖాళీ గ్లాసు టేబిల్ మీద పెట్టి లేచింది.

"ఎవరే గంగలో దూకితే నాకేం? " అని అక్కడినుంచి లేచి, తన గదిలోకి వెళ్ళిపోయింది.

నారాయణరావు నిశ్చేష్టుడయి నిలబడిపోయాడు.

రమ్య గదిలోకొచ్చి హరి సెల్‌కి ఫోన్ చేసి మాట్లాడింది. వాడితో మాట్లాడుతుంటే తన ఒంటరితనాన్ని మరచిపోయింది. హరి ఫోన్ పెట్టేసాక సెల్ మోగింది. డిస్‌ప్లేలో మురళి సెల్‌నెంబర్. రమ్య చిరాగ్గా చూసి ఆఫ్ బటన్ నొక్కింది. క్షణం తర్వాత మళ్ళీ ఫోన్ మోగింది. మళ్ళీ మురళే. ఫోన్‌ని వైబ్రేటింగ్ మోడ్‌లో పెట్టి తలగడ కింద పెట్టి పుస్తకం తెరిచింది.

నాయనమ్మ రామాపురం నుంచి ఎప్పటికీ ఇక్కడకి రానని ఉత్తరం రాసింది. కొద్దిసేపటి క్రిందట తండ్రి చెప్పడం గుర్తుకొచ్చింది. ఆమె గుండె కలుక్కుమంది.

తనకి ఊహ తెలిసినప్పటి నుంచి బామ్మ దగ్గర చేసిన గారాబం, అల్లరి గుర్తుకొచ్చాయి. ఆవిడ తనని పక్కలో పడుకోబెట్టుకుని రామాయణ, భారతాలని కథలుగా చెప్పడం గుర్తుకొచ్చింది.

తల్లి డైరీని తను చదవకుండా వుండి వుంటే ఆ చేదు నిజం తనకి ఎప్పటికీ తెలిసేది కాదు. తను ఈ కుటుంబంపై పెంచుకున్న మమకారం కూడా చెక్కుచెదిరేది కాదు. తను వాళ్ళని ద్వేషించేది కాదు. కాని ఆమెలోని మరో వ్యక్తి వాళ్ళని అమితంగా ప్రేమిస్తోందని ఆమెకే తెలియదు. రమ్యకి ఉన్నట్టుండి దుఃఖం ముంచుకొచ్చింది. తలగడలో ముఖం దాచుకుని ఏడుస్తుండిపోయింది.

★ ★ ★

తను 'హలో' అన్నా పట్టించుకోకుండా పరుగులాంటి నడకతో వెళ్ళిపోతున్న రమ్యని వెంబడిస్తూ అడిగేడు మురళి.

"ఎన్నిసార్లు ఫోన్ చేసినా ఫోన్ లిఫ్ట్ చెయ్యలేదు" తనపై హక్కున్నట్టు నిలదీస్తున్న అతన్ని చూస్తే అమెకి పట్టరాని ఆగ్రహం కలిగింది.

"మీరెందుకిలా నా వెంటపడి వేధిస్తున్నారు? దయవుంచి ఇంతటితో మన పరిచయాన్ని మరచిపోండి"

"అది ఈ జన్మలో సాధ్యపడదు. బికాజ్ ఐ లవ్‌యు! ఐ లవ్ యు ఫ్రమ్ మై హార్ట్ ఆఫ్ ది హార్ట్స్!" ఆమె కళ్ళలోకి లోతుగా చూస్తూ అన్నాడు.

రమ్య క్షణం స్థాణువయింది. ఒంట్లోని రక్తమంతా ముఖంలోకి వచ్చినట్టు ఎర్రబడిపోయిందామె ముఖం.

"మీపై నాకు అలాంటి అభిప్రాయం లేదు. మరోసారి నాతో ఈ విషయం మాట్లాడక్కర్లేదు. నన్ను కలుసుకునే ప్రయత్నం చెయ్యొద్దు. మీకు అర్థమయిందనుకుంటాను" పదునైన స్వరంతో హెచ్చరికగా అని అక్కడ నుంచి వెళ్ళిపోతున్న రమ్యని కోరిక నిండిన కళ్ళతో కసిగా చూసాడు మురళి.




**రా**త్రి పదిగంటలకి ఇంటిముందు ఆటో దిగుతున్న రమ్యని చూసి వీధి వరండాలో పచార్లు చేస్తున్న నారాయణరావు స్థిమితపడ్డాడు. అతను షాపులో వుండగా ప్రభ ఫోన్ చేసి రమ్య ఇంకా ఇంటికి రాలేదని చెప్పింది. తను రమ్య కోసం వెదకడం వ్యర్థమని అతనికి తెలుసు. దారి తప్పిన చిన్న పిల్లకోసం వెతకవచ్చు కాని ఎక్కడికి వెళ్తోందో తమతో చెప్పకుండా వెళ్తున్న పిల్లకోసం ఎక్కడని వెతుకుతాడు? కాలేజీ నుంచి నేరుగా ఇంటికి రాకుండా రాత్రి తొమ్మిది- పది గంటల మధ్య వచ్చే ఆమె కోసం ఆందోళనగా ఎదరుచూడడం, ఆమె ఇంటికి రావడం ఏమాత్రం ఆలస్యమయినా ఆమె ఏ ప్రమాదంలో చిక్కుకుందోనని కంగారు పడడం అలవాటయిపోయిందతనికి.

ఇంటి మెట్లెక్కుతున్న రమ్యని చూసి అప్పటివరకూ అనుభవిస్తున్న ఆందోళన మాయమై రిలీఫ్‌గా అనిపించిందతనికి. కూతురు ఆలస్యంగా ఇంటికి వచ్చిన కారణాన్ని నిలదియ్యలేని తన అశక్తతకు తనపై తనకే జాలి వేసింది అతనికి. అశక్తత కూడా కాదు. తనేం అడిగినా ఆమె జవాబివ్వదనే అధైర్యం. రమ్య పెదవో

వలో వెళ్తోందేమో అనే అనుమానం అతనికి ఏ కోశానా లేదు. ఆమెకి ఎవరో స్నేహితులు కొత్తగా దొరికారు. ఆ స్నేహితుల ప్రభావంతో ఆమె చదువుని కూడా నిర్లక్ష్యం చేస్తోందనే వేదనతో అతని మనసు నలిబిలి అవుతోంది.

రమ్య స్నానం చేసి వచ్చి ఫ్రిజ్‌లోంచి మంచినీళ్ళు తీసుకుని తాగి తన గదిలోకి వెళ్ళిపోవడాన్ని అతను గమనిస్తూనే వున్నాడు.

ఆ రోజు రమ్య బర్త్‌డే అని ప్రభ చేసిన పాయసం టేబిల్‌పై అలాగే వుంది. అతను పాయసం వున్న గిన్నెని ఫ్రిజ్‌లో పెట్టాడు. ఆ ఉదయం లేస్తూనే అతను కూతురి దగ్గరకి వెళ్ళి చెప్పాడు, "మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే! విష్ యు ఎ వెరీ హేపీ బర్త్‌డే!"

"బర్త్‌డేనా? తల్లి తండ్రి వున్న అదృష్ట వంతులకే బర్త్‌డే! నాలాంటి అనాథకి కాదు" నిరసనగా ముఖం తిప్పుకుంటూ అంది. కొరడా దెబ్బలా తగిలాయి ఆ మాటలు. మొహం పాలిపోగా "రమ్యా" అన్నాడు. ఆ పిలుపు ఆర్తనాదంలా వుంది.

"నీకు రక్తం పంచి ఇవ్వకపోయినా, ప్రేమని పంచిన నేనున్నాను"

"అని నువ్వనుకుంటే సరిపోతుందా? నాకు సంబంధించినంత వరకు బాబి తప్ప ఈ ఇంట్లో ఎవరూ లేరు. నాకేమీ కారు"

హతాశుడయ్యాడతను. అతనికి దుఃఖం రావడం లేదు. కాని మనసు గాయపడి కన్నీరు కారుస్తోంది. 'రమ్యలో మార్పు తీసుకురావడం ఎలా?'

"ఓకే! నీ గార్డియన్‌గానే అడుగుతున్నాను. నీ ఫ్రెండ్సు ఎవరు? వాళ్లతో రాత్రి పదిగంటల వరకు ఎక్కడ తిరిగి వస్తున్నావు?"

"భయపడకండి. నేను బాయ్ ఫ్రెండ్సుతో తిరగడం లేదు. ఈ ఇంటి పరువుని ఇంకా దిగజార్చడం నా అభిమతం కాదు" వ్యంగ్యంగా అంది.

ఆ వ్యంగ్య బాణం సూటిగా అతని గుండెల్లో దిగబడింది. అతను ఏం అడిగినా రమ్య జవాబివ్వదని, ఒకవేళ ఇచ్చినా ఇలాంటి వ్యంగ్యమే ఆ జవాబులో వుంటుందని అర్థమైన అతను చేసేదేం లేక గది బయటకొచ్చాడు.

ఆడపిల్లలకి జాగ్రత్తలు, మంచి చెడులు చెప్పే బాధ్యత తల్లిది. కాని రమ్య ప్రభని శత్రువులా చూడ్డమే కాదు, అసలామె ఉనికినే పట్టించుకోడం మానేసింది. ఒకవేళ ప్రభ చొరవ తీసుకుని కూతురిని హెచ్చరించాలనుకున్నా ఆమె మాటని రమ్య ఖాతరు చెయ్యదని అతనికి తెలుసు. ఎలా రమ్యని దారిలో పెట్టడం? అతనికి ఈ సమస్యకి పరిష్కారం కనబడ్డం లేదు.

"ఏం జరిగింది సార్? ఎందుకలా వున్నారు?" మ్లానమైన నారాయణరావు ముఖాన్ని చూస్తూ అడిగేడు ప్రభాకర్. అతను ఆత్మీయ స్వరంతో అలా అడగగానే నారాయణరావు కళ్ళలో నీళ్ళూరాయి.

"రమ్య సరిగ్గా చదువుకోడం లేదయ్యా. కొత్తగా ఎవరో స్నేహితులు దొరికారు దానికి. ఆ స్నేహితులు మగవాళ్లేమోనని కొంచెం కూడా అపనమ్మకం లేదు నాకు. కాని వాళ్ళతో కలిసి రాత్రి పదిగంటల వరకు ఎక్కడ తిరుగుతోంది. నేనడిగినా చెప్పడం లేదు".

"ఆమె ఎక్కడికెళ్తున్నారో నాకు తెలుసు" అన్నాడు ప్రభాకర్.

"నాతో రండి"

నారాయణరావు స్కూటర్ స్టార్ట్ చేసాడు. ప్రభాకర్ అతని వెనుక ఎక్కి ఎక్కడికి వెళ్ళాలో చెప్పాడు. గమ్యం చేరాక నారాయణరావుకి దిగ్భ్రమతో నోట మాట రాలేదు.

"అనాథ శరణాలయమా? రమ్య

ఇక్కడి కొస్తోందా? "

"ప్రతిరోజు సాయంకాలం నేనిక్కడ పిల్లలకి ఒక గంట చదువు చెబుతాను సార్! రమ్యగారు ఇక్కడికొచ్చి వాళ్లతో గడుపుతారు. వాళ్లకి మ్యాథ్స్‌లో డౌట్లు చెబుతారు. ఆ పసిపిల్లలతో తనూ ఒక పసిపిల్లలా ఆడతారు."

నారాయణరావుకి రమ్య ప్రవర్తనలో నిగూఢంగా వున్న అర్థమేదో బోధపడినట్టుంది. తమని తల్లిదండ్రులుగా అంగీకరించని ఆమెకి తనో అనాథననే భావం నరనరాన జీర్ణించుకుపోయింది. తనని ఇంతగా ప్రేమించే తమపై ద్వేషంతో ఈ అనాథలకి దగ్గరయి వాళ్ళని ప్రేమిస్తోంది.

నీళ్ళు నిండిన కళ్ళకి అక్కడ పిల్లలతో ఆడుతున్న రమ్య కనిపించింది. నిశ్శబ్దంగా వెనుదిరిగాతడను. ప్రభాకర్ అతన్ని అనుసరించాడు.

★ ★ ★

రమ్య కాలేజీనుంచి నేరుగా ఇంటికి వెళ్ళకుండా తను తరచుగా వెళ్ళే రెస్టారెంటుకి వెళ్లింది.

'అనాథ శరణాలయానికి వెళ్ళాలి. ఇవాళ కూడా ఇంటికి ఆలస్యంగా వెళ్లాలి తను. తండ్రి ఆలస్యంగా వచ్చినందుకు కారణాన్ని అడుగుతాడు. ఫ్రెండ్సుతో కలిసి పార్టీకి వెళ్లానని అబద్ధం చెప్పాలి. అప్పుడు చూడాలి ఆయన ముఖం'.

ఒక అబద్ధంతో ఇంట్లో వాళ్లకి టెన్షన్ కలిగిస్తున్నందుకు తనని తాను అభినందించుకుంది.

రమ్య తను ఎప్పుడూ కూర్చునే టేబిల్ దగ్గర కూర్చుని బేరర్ రాగానే కాఫీ తెమ్మంది.

ఇంతలో టేబిల్‌కి అవతలివైపు సరిగ్గా ఆమెకెదురుగా కుర్చీ లాక్కుని కూర్చున్నాడు మురళి. రిలాక్స్‌డ్‌గా కూర్చుని వున్న ఆమె అతన్ని చూసి నిటారుగా అయింది.

"...ఇక్కడ కూడా దాపురించావా? " అన్నట్టు చురుక్కున చూసి లేచింది.

"నా ఉనికిని కూడా భరించలేకపోతున్నావన్నమాట! ఫర్లేదు. నువ్వు నన్ను ప్రేమించకపోయినా మనం కలిసి కాఫీ తాగవచ్చు" అన్నాడు చిరునవ్వుతో.

రమ్య తిరస్కారంగా అతన్ని చూసి అక్కడనుంచి వచ్చెయ్యబోయింది.

అతను ఆమెని వెళ్లనివ్వకుండా ఆమె దారికి కాలు అడ్డం పెట్టాడు.

"ప్లీజ్!" పళ్ళు బిగువున అంది.

"నా ప్రేమని అంగీకరించు" షరతు పెడుతున్నట్టు అన్నాడు.

"నువ్వు నన్ను వెంటబడి వేధిస్తున్నావని, అల్లరి పెడుతున్నావని పోలీసులకి ఫోన్ చేస్తాను. ఈవ్ టీజింగ్ నేరం కింద అరెస్టు చేయిస్తాను" బ్యాగ్‌లోంచి సెల్ తీసింది.

మురళి కళ్ళు ఎర్రబడ్డాయి.

"ఏం చూసుకునే నీకంత మిడిసిపాటు? అందంగా వున్నావని పొగరా? అసలు నీ పుట్టుక ఎలాంటిదో తెలిస్తే నిన్నెవరు ప్రేమిస్తారే? నీ తండ్రి కొజ్జా! నీ తల్లి ఎవడితోనో పోయి నిన్ను కంది. నీ..." ఇంకా ఏదో అనబోతున్న అతని చెంప చెళ్ళుమంది.

ఆగ్రహావేశాలతో ఉడికిపోతూ అరిచింది రమ్య.

"రాస్కెల్! మర్యాదగా మాట్లాడు! మరోసారి వెంటపడితే నిన్ను చంపేస్తాను!"

రెస్టారెంటులోని జనం స్తంభించిపోయారు. మురళి అవమానంతో ప్రతీకారంతో రగిలిపోతూ బయటకొచ్చి తన కోపాన్నంతటినీ కారుమీద చూపిస్తూ డోర్ తీసి కారు స్టార్ట్ చేసాడు.

రమ్య విసురుగా బయటికొచ్చింది. ఆమె మనసు అవమానంతో మండిపోతోంది.

తన పుట్టుక గురించి చిన్నప్పటినుంచి పొందిన అవమానం ఒక ఎత్తయితే ఇవాళ ప్రత్యక్షంగా పొందిన అవమానం మరో ఎత్తు అనిపించింది! ఆమె జ్వలిస్తున్న అగ్ని పర్వతంలా వుంది.

అసలు ఆ ఇంటికి వెళ్ళాలనిపించడం లేదు. కొన్నాళ్ళు కనీసం తను చదువు పూర్తి చేసేవరకూ ఆర్థికంగా వాళ్లపై ఆధారపడక తప్పదనే వాస్తవం ఆమెని ఇంటిదారి పట్టేలా చేసింది. ఇంటికి వెళ్తూనే గదిలోకి వెళ్లి తలుపు మూసుకుంది. ఆ రాత్రి భోజనానికి కూడా బయటికి రాలేదు. నారాయణ రావు ఆమె గది తలుపులు కొట్టి భోజనం చెయ్యమని బతిమాలి విఫలుడయ్యాడు.

★ ★ ★

"హలో! నేను దీప్తిని మాట్లాడుతున్నాను" అవతలి స్వరం విని, అనుమానంగా డిస్‌ప్లేలో నెంబరు చూసి అడిగింది రమ్య, "... బయటనుంచి ఫోన్ చేస్తున్నావా? నీ సెల్ నెంబర్ కాదు ఇది".

"... నా సెల్‌లో బేలన్స్ అయిపోయింది"

"జలుబు చేసిందా? గొంతుకలా వుంది?"

"అవును" అంటూనే వరసగా రెండు సార్లు తుమ్మింది.

"ఓకే, చెప్పు ఏమిటి విశేషం?"

"విశేషమే! రేపు నా బర్త్‌డే! రేపు సాయంకాలం మన ఫ్రెండ్సుందరికీ పార్టీ అక్షయ హోటల్ పక్కన గెస్ట్ హవుస్‌లో"

"ఓకే!"

"ప్లీజ్ కమ్ రమ్యా! డోంట్ మిస్!"

"ఓకే అంటున్నానుగా?"

"రేపు సాయంకాలం సరిగ్గా అయిదున్నరకి తప్పకుండా రావాలి, సరేనా?" దీప్తి ఫోన్ పెట్టేసింది.

మరునాడు ఆదివారం కాలేజీకి సెలవు కాబట్టి నిదానంగానే తయారయి పార్టీకి బయలుదేరింది. గెస్ట్ హవుస్ దగ్గర ఆటో ఆపి, ఆటో అతనికి డబ్బులిచ్చి అప్రయత్నంగానే హోటల్ అక్షయవైపు చూసింది. నెల రోజుల కిందట అదే రోడ్డులో వెళ్తున్నప్పుడు చూస్తే కస్టమర్లతో కళకళలాడుతూ కార్ పార్కింగ్‌కి కూడా చోటు దొరకని ఆ హోటల్ ఇప్పుడు నిర్మానుష్యంగా వుంది. గేటు దగ్గర సెక్యూరిటీ ఎవరో కస్టమర్‌కి కాబోలు చెబుతున్నాడు "హోటల్ రిపేర్లో వుంది. సర్వీసెస్ లేవు" అని.

రమ్య గెస్ట్ హవుస్ గేటు దగ్గర వాచ్‌మేన్‌ని అడిగింది, "ఇక్కడ బర్త్‌డే పార్టీ జరుగుతోంది. దీప్తి వాళ్ళు వచ్చారా?"

"లోపల వున్నారు వెళ్లండి"

రమ్య లోపలకి నడిచి ఎదురుగా సోఫాలో కూర్చుని వున్న మురళిని చూసి పాముని చూసినట్టు ఆగిపోయింది. అనూహ్యంగా అతన్ని అక్కడ చూసిన షాక్‌లో ఆమె మెదడు క్షణం పనిచెయ్యడం మానేసింది.

"వెల్ కమ్" ఆమెని సమీపిస్తూ అన్నాడు. అప్రయత్నంగా ఒక అడుగు వెనక్కి వేసింది.

"ఇక్కడ దీప్తి బర్త్‌డే పార్టీ జరుగుతోంది... రమ్మని ఫోన్ చేసింది" తడబడుతూ అంది.

"దీప్తి ఫోన్ చేసినట్టు మరో అమ్మాయి చేత నేనే నీకు ఫోన్ చేయించాను. నిన్ను ఇక్కడకి రప్పించాను".

రమ్య క్షణం ఊపిరి పీల్చుకోడం మరచిపోయింది. మరుక్షణం తేరుకుని వెనుదిరిగి అక్కడనుంచి ఒక్కంగలో బయటపడబోయింది.

మురళి ఆమె చెయ్యి పట్టి ఆపేసాడు.

"ఛీ! వదులు!" అతని చేతిలో నుంచి

తన చేతిని విడిపించుకోడానికి విశ్వప్రయత్నం చేస్తూ అంది.

"నన్ను కొట్టిన చెంపపై ముద్దుపెట్టు. వదులుతాను" అతని నుంచి ఆల్కహాల్ వాసన. అతన్ని చెంపదెబ్బ కొట్టినందుకు ప్రతీకారం తీర్చుకోడానికే తనని అక్కడికి రప్పించాడని అర్థమైన ఆమె నిలువెల్లా కంపిస్తూ అరిచింది, "యూ! స్కౌండ్రల్ వదలరా నన్ను!"

మురళి ఆమె రెండో చేతిని కూడా బలంగా ఒడిసి పట్టుకున్నాడు.

"...నువ్వు నన్ను కొట్టినందుకు ప్రతీకారం తీర్చుకుని అప్పుడు వదులుతాను" వెకిలిగా నవ్వుతూ ఆమెని బెడ్ రూమ్‌లోకి లాక్కెళ్ళాడు.

"హెల్ప్! హెల్ప్" ఆమె గొంతు చించుకుని అరుస్తోంది. మురళి ఆమెని బెడ్ మీదకి తోసాడు. కాలెత్తి అతని కడుపులో బలంగా తన్నింది. 'అబ్బా!' బాధతో విలవిలలాడుతూ పట్టు సడలించాడు. అదే అదునుగా రమ్య ఆ గదిలోంచి బయటపడింది.

"... జాన్సన్! శేషూ! అజయ్!" మురళి బిగ్గరగా అరిచాడు. పక్కగది తలుపు ధడాల్న తెరుచుకుని బయటకొచ్చిన ఆ ముగ్గురూ ఆమెని వెంబడించారు. గుమ్మం దాటబోతున్న రమ్యకి వాళ్ళ ఉద్దేశ్యం అర్థమై పరిగెట్టబోయింది. అప్పటికే ఆలస్యమయింది. వాళ్ళలో ఒకడు ఆమెని ఒడిసి పట్టుకున్నాడు. నిస్సహాయంగా గింజుకుంటున్న ఆమెని బెడ్ రూమ్‌లోకి ఈడ్చుకొచ్చాడు. మిగిలిన వాళ్ళు... వాడిని అనుసరించారు.

"ఎంత పొగరే నీకు? నన్ను రెస్టారెంటులో అందరిముందూ చెంప దెబ్బ కొడతావా? ఇవాళ కడుపులో తంతావా? నీ బతుకు నాశనం చేస్తాను" పళ్ళు కొరుకుతూ అన్నాడు మురళి.

ఆమె జుట్టు పట్టి గుంజుతూ, "ఫ్రెండ్స్! ఇన్నాళ్ళుగా మనందరం దేన్నయినా కలిసే పంచుకున్నాం. ఇప్పుడు దీన్ని కూడా..." కన్నుగీటి వికటంగా నవ్వేడు.

"...థ్యాంక్ యూ బ్రదర్!" కోరస్‌గా అరిచారు వాళ్ళు.. రమ్య వాడి కబంధ హస్తాలలోనుంచి తప్పించుకోవడానికి విశ్వప్రయత్నం చేసి విఫలురాలయింది. తన ప్రయత్నం వృథా అని, తన జీవితం ఆరోజుతో సర్వనాశనం కాబోతోందని అర్థమయిందామెకి.

వాడు రమ్యని తేలిగ్గా బొమ్మని ఎత్తినట్టు ఎత్తి బెడ్ మీదకి విసిరేసాడు.

రమ్య ఎంత షాక్‌లో వుందంటే అరవడం మరచిపోయింది. ఇద్దరు ఆమెని కదలనివ్వకుండా బలంగా పట్టుకున్నారు. కాళ్ళ దగ్గర నిలబడిన మురళి షర్టు విప్పుకోవడం ఆమె భయోత్పాతం నిండిన కళ్ళతో చూస్తోంది.

'... ప్రాణం పోకూడదూ? తనువున్న చోట భూమి రెండుగా చీలిపోయి తను అందులో కూరుకుపోకూడదూ?' ఆమెకి కన్నీళ్ళు రావడం లేదు కాని ఆమె మనసు వెక్కి వెక్కి ఏడుస్తోంది.

ఇంతలో ఏమయిందో తెలియదు. మురళి బంతిలా ఎగిరి అవతల పడ్డాడు. అతన్ని అంత బలంగా కొట్టిన వ్యక్తిని ఆ ముగ్గురూ అవాక్కయి చూస్తున్నారు.

".... నువ్వా! నువ్వెందు కొచ్చావురా

## కొత్తగాలి...

**జీవితం**
**ఇంతేననుకుంటే**
**అది నరకం**
**ఎంతో ఉందనుకుంటే**
**అది నాకం**

– సి.కామేశ్వరరావు, కాశీబుగ్గ

ఇక్కడకి? " ప్రభాకర్‌ని చూసి, మురళి మండిపడుతూ అరిచాడు. తనని కొట్టింది అతనేనంటే ఇంకా నమ్మకం కలడగం లేదు అతనికి.

"... తప్పు సార్! మీరు చేస్తున్నది చాలా తప్పు!" ప్రభాకర్ నచ్చ చెబుతు న్నట్టు అన్నాడు.

"ఆ అమ్మాయిని వదిలెయ్యండి. ఆమె జోలికి రాకండి"

"ఎంగిలి మెతుకులు తినే కుక్కా! నాకు నీతులు చెబుతున్నావా? " మురళి చెయ్యె త్తాడు.

ప్రభాకర్ చెయ్యి మెరుపు వేగంతో కది లింది. అతని పిడికిలి బలంగా మురళి ముక్కుని తాకింది. అతను బాధతో విలవి లలాడుతూ చాపచుట్టలా పడిపోయాడు. అప్పుడు మిగతా ముగ్గురిలో చలనం వచ్చింది. ఒక్కుమ్మడిగా ప్రభాకర్‌పై పడ్డారు. అతను ఒక్కడు. వాళ్ళు ముగ్గురూ అతన్ని పచ్చడికింద కొట్టగలరు. కాని రమ్యని రక్షించాలనే సంకల్పం అత నిలో తెగువనిచ్చింది. ప్రతిరోజూ క్రమం తప్పకచేసే వ్యాయామం అతని శరీరాన్ని దృఢంగా మార్చింది. ఎక్కడ తగులు తోందో కూడా చూసుకోకుండా వాళ్ళని కొడుతున్నాడు. అరగంటలో వాళ్లని మట్టి కరిపించాడు.

సుడిగాలిలో చిక్కిన పూలరెమ్మలా ఆపాదమస్తకం కంపిస్తున్న రమ్యని బయ టికి తీసుకొచ్చాడు. ఆ పోరాటంలో అత నికీ గాయాలయ్యాయి. అలసట, నిస్సత్తువ కమ్ముకొస్తున్నా రమ్యని సురక్షితంగా ఇంటికి చేర్చాలనే సంకల్పంతో "ఐయామ్ ఓకే!" అని తనకి తనే సజెషన్స్ ఇచ్చుకుం టున్నాడు. అప్పటికి రమ్య కొంతవరకు షాక్‌లోంచి బయటపడింది. భయంక రంగా మూల్గుతూ నేలమీద పొర్లుతున్న వాళ్ల వైపు ఏహ్యతతో కూడిన భయంతో చూసి అతన్ని అనుసరించింది.

గేటు దగ్గర వాచ్‌మెన్ భయంతో బిక్క చచ్చి వున్నాడు. ప్రభాకర్‌ని చూసి వణికి పోతూ "నేనేమీ చూడలేదు. నాకేం తెలి యదు" అన్నాడు. లోపల వాళ్లని తను చితకబాదడం అతను చూసాడని అర్థమ యింది ప్రభాకర్‌కి.

"వెళ్ళి వాళ్ళకి మంచినీళ్ళియ్యి. లేకపోతే చస్తారు" అని ముందుకు నడిచాడు.

ఆటోకోసం ఎదురుచూస్తూ రోడ్డువార నిలబడ్డారు. "మీరు ఇక్కడికెందుకొ చ్చారు? " హఠాత్తుగా ప్రభాకర్ అడిగాడు. పరధ్యానంగా వున్న రమ్య ఉలిక్కిపడింది.

"ఆc? "

"మీరు గెస్ట్‌హౌస్‌కి ఎందుకొచ్చారు? "

జుగుప్సతో కంపించిపోతూ చెప్పింది రమ్య. తను రెస్టారెంటులో సెల్‌ఫోన్ మరచిపోవడం, మురళి కాలేజీకి వచ్చి ఫోన్ ఇవ్వడం, ఆ పరిచయాన్ని కొనసా గించాలనుకోవడం, తన విముఖత, ముందు స్నేహమని, తర్వాత ప్రేమ అని తనవెంట పడి వేధించడం, మోసంతో తనని గెస్ట్‌హౌస్‌కి రప్పించడం వరకూ అ న్నీ వివరంగా చెప్పింది. కొన్ని క్షణాలు మౌనంగా ఊరుకున్నాడు.

"మురళికి లేని అలవాటు లేదు. అతని కన్ను పడిన ఏ అమ్మాయినీ వదలడు. మీరు చాలా జాగ్రత్తగా వుండాలి. చీకటి పడకుండా ఇంటికి వెళ్తూండండి. కొన్నాళ్ళు శరణాలయానికి కూడా వెళ్ళకండి"

రమ్య తల వూపింది. "మీరు ఇక్కడకి ఎలా వచ్చారు? మురళి మీకు ముందే పరిచయమా? "

తల పంకించాడు ప్రభాకర్.

"కొందరి పేదరికం... కొందరి ధనమ దాంధకారం... కొందరి జులుం, కొందరి నిస్సహాయత- ఇవేగా సంఘంలో మను షుల మధ్య అంతరాలని సృష్టిస్తున్నది?

మురళి తండ్రి ఫణిభూషణరావుగారు వారింటి అవుట్‌హౌస్‌లో నాకు ఆశ్రయమిచ్చారు. అందుకు ప్రతిఫలంగా మురళి నాచేత పనిచేయించుకుంటాడు. ఇంట్లో పనిచేసినా నేను బాధపడేవాడిని కాదు. అతను అతని స్నేహితులు గెస్ట్‌హౌస్‌లో పార్టీ చేసుకుంటే మందు, సోడాలు వగైరా నేను తెచ్చివ్వాలి. ఇక్కడ అతను వేసే వేషాలను ఫణిభూషణరావుగారికి చెప్పకూడదు. స్నేహితులతో కంబైన్డ్ స్టడీస్ చేస్తున్నాడని కథలు చెప్పి ఆయన్ని మాయ చెయ్యాలి. ఆయన ముందు అబద్ధం చెప్పిన ప్రతీసారి ఆయనకి ద్రోహం చేస్తున్నాననిపిస్తుంది."

రమ్యకి అతను చెబుతున్న మాటలు చెవికి ఎక్కడం లేదు.

తను ఆ దుర్మార్గుల చేతులలో భంగపడకుండా భగవంతుడే అతన్ని అక్కడికి పంపాడా అనుకుంటోంది. జరిగిపోయిన సంఘటన కల్గించిన భయం నుంచి ఆమె ఇంకా తేరుకోలేదు.

ప్రభాకర్ దారినపోతున్న ఆటోని ఆపి, ఎడ్రస్ చెప్పి "ఎక్కండి" అన్నాడు.

"మీరు కూడా నాతో రాగలరా?" అడిగింది బేలగా. అతను ఆమె పరిస్థితిని అర్థంచేసుకుని ఆటో ఎక్కి బాగా చివరకి జరిగి కూర్చున్నాడు. ఆటో ఇంటిని సమీపిస్తుండగా అతను ఆటో ఆపించి దిగిపోయాడు. రమ్య ప్రశ్నార్థకంగా చూసింది.

"మీతో నేను కలిసి రావడం ఎవరైనా చూస్తే బాగుండదు. మరో చిన్న మాట. జరిగినది మీ నాన్నగారికి తెలియనివ్వకండి. ఆయన తట్టుకోలేరు" రమ్య తల ఊపింది. ఆటో ముందుకు కదిలింది.

★ ★ ★

"రమ్య కాలేజీకి వెళ్ళడం మానేసి మూడు రోజులయిందయ్యా!" నారాయణరావు స్వరంలోని ఆందోళన, నిస్సహాయత వెనుక కూతురి భవిష్యత్తు ఏమయిపోతుందోననే భయం ప్రస్ఫుటమవుతోంది.

ప్రభాకర్‌కి ఏం మాట్లాడాలో తెలియలేదు.

"ఇంట్లో కూర్చుని చదువుకునే ఆర్ట్స్ గ్రూప్ కూడా కాదు. దానిది సైన్సు గ్రూప్ కదా!"

"ప్రస్తుత పరిస్థితుల్లో ఆమె కాలేజీకి వెళ్ళకపోవడమే మంచిది సార్!"

"అంటే?"

"నా ఉద్దేశం. ఆమెకి చదువుకోవాలని లేనప్పుడు మీరు బలవంతంగా చదివించలేరు కదా?" అతనివైపు చూడకుండా అన్నాడు.

"కాదు. ఏదో దాస్తున్నావు నువ్వు. ఏదో జరిగింది. లేకపోతే రమ్య వున్నట్టుండి కాలేజీకి వెళ్లడం మానదు. చెప్పు, ఏం జరిగింది?"

ఇంకా నారాయణరావు ముందు అబద్ధం చెప్పలేననిపించిందతనికి. అతను ఆ రోజు జరిగిందంతా చెప్పాడు. వింటున్న నారాయణరావు చేతులు గుండెలపైకి వెళ్ళాయి. కళ్లలో నీళ్లు చిప్పిల్లుతుండగా ప్రభాకర్ చేతుల్ని పట్టుకున్నాడు.

"నువ్వు దేముడివి ప్రభాకర్! నువ్వుగాని ఆ టైముకి అక్కడకి వెళ్ళకపోతే రమ్య ఏమయిపోయివుండేది?" దుఃఖోద్వేగంతో కదిలిపోయాడతను.

కొద్దిసేపటి తర్వాత అడిగేడు. "తనని కొట్టావని మురళి నీపై కక్ష కడతాడేమో!"

తల పంకించాడు ప్రభాకర్. "ఆ సంఘటనలో తప్పంతా నాదేనని నిందమోపి, దానికి వికృతమైన రంగులు పులిమి తండ్రి చేత నన్ను అక్కడనుంచి వెళ్ళగొట్టించాడు"

"అరెరె! ఇప్పుడెలామరి?"

"ఫ్రెండ్ రూమ్‌లో వుంటున్నాను.

వాడికి తెలియని లెక్కలు చెబుతున్నం దుకు వాడి రూమ్‌లో వుండనిచ్చాడు. మరో నాలుగు నెలలో పరీక్షలయిపోతే ఎలాగూ ఇక్కడి నుంచి వెళ్ళిపోతాను."

నారాయణరావు కళ్ళలో నీళ్ళూరాయి. అతను ప్రభాకర్‌ని కౌగిలించుకొని ఇన్నాళ్ళ దుఃఖం, బాధ కరిగిపోయేలా ఏడ్చాడు.

రమ్య తులసికోట దగ్గర కూర్చుని వుంది. తను కాలేజీకి వెళ్ళి వారంరోజులు. ఆ సంఘటన జరిగిన మరునాడు దీప్తి ఫోన్‌చేసి అడిగింది, కాలేజీకి రాలేదేమని. ఒంట్లో బాగాలేదని అబద్ధం చెప్పింది. మరో నాలుగు రోజుల తర్వాత ఒంటరితనం మరీ బాధపెడుతుంటే తనే దీప్తికి ఫోన్‌చేసింది. తనంటే ప్రాణంపెట్టే దీప్తి ముభావంగా మాట్లాడి ఫోన్ పెట్టేయడం ఆమెకి ఆశ్చర్యంతో బాటు బాధని కలిగించింది. ఆమె తన స్నేహాన్ని కట్ చేసిందని అర్థమయింది.

"రమ్యగారూ!" ఆలోచిస్తున్న ఆమె ప్రభాకర్ పిలుపుతో ఉలిక్కిపడింది. జరిగిన సంఘటన ఆమె మనసుని ఎంతగా గాయపరచిందో పీక్కుపోయివున్న ఆమె ముఖం చూస్తే అర్థమయిందతనికి. అతను తను తెచ్చిన పుస్తకాలని ఆమెకి అందించాడు. ఆమె నిరాసక్తంగా వాటిని అందుకుంది.

"ఈ పేపర్ కటింగ్ చూసారా?" కొంచెం పాతబడివున్న న్యూస్‌పేపరుని ఆమెకి అందించాడు.

ఆమె కొంచెం ఆసక్తితో దాన్ని చూసింది. మూడేళ్ళ కిందటి న్యూస్‌పేపర్ కటింగ్ అది. దానిలో టెన్త్ క్లాసులో టాప్ రేంకర్ల ఫోటోలు ప్రచురించారు. అందులో హరి ఫోటోతో బాటు తన ఫోటో కూడా వుంది. దాన్ని చూసి రమ్య ముఖంలో వేదన ప్రతిఫలించింది. ఒకప్పుడు స్టేట్ లెవెల్‌లో అత్యధిక మార్కులు సాధించిన విద్యార్థులలో తను ఒకర్తి. ఇప్పుడు తన కెరీర్‌ని తన చేజేతులా నాశనం చేసుకుంది.

"మీరు లాంగ్‌టర్మ్ కోచింగ్ తీసుకుని, ఎమ్‌సెట్ మళ్ళీ రాయండి రమ్యా! మీకు మంచి రేంకు వస్తుంది. నాకు నమ్మకం వుంది" నచ్చచెబుతున్నట్టు అన్నాడు.

"నేను చదవలేను. నాకు ఇంట్రెస్ట్ లేదు" అతనివైపు చూడకుండానే అంది.

"నెగెటివ్ థింకింగ్ వద్దు. ఒక స్నేహితునిగా చెబుతున్నాను".

"నాకు స్నేహంపై నమ్మకం లేదు. నాకు మనుషులంటే భయం".

"పోనీ, మనుషులతో వద్దు. పుస్తకాలతో స్నేహం చెయ్యండి. పుస్తకాలు ఎంత గొప్ప స్ఫూర్తినిస్తాయో, ఓదార్పునిస్తాయో, లక్ష్యంవైపు ధైర్యంగా సాగిపోయే ఆత్మవిశ్వాసాన్నిస్తాయో మీకు తెలియదు. నెక్స్ట్ అకడమిక్ ఇయర్ స్టార్టవడానికి జూన్ దాకా టైమ్ వుంది. ఈలోగా కాలక్షేపం కోసం పుస్తకాలు చదవండి" ప్రభాకర్ వెళ్ళిపోయాడు.

రమ్య అనాసక్తిగా ఒక పుస్తకాన్ని చేతులలోకి తీసుకుంది. ముందు యాథాలాపంగా రెండు లైన్లు చదివిన ఆమె తనకి తెలియకుండానే ఆ పుస్తకంలో లీనమైపోయింది. అది రవీంద్రుని గీతాంజలికి తెలుగు అనువాదం. చిన్నతనంలో తనకి సాహిత్యాభిలాష కలిగించిన నాయనమ్మ అప్రయత్నంగా గుర్తొచ్చిందామెకి. ప్రభాకర్ తెచ్చి ఇచ్చిన రెండు పుస్తకాలని రెండు గంటలలో చదివేసింది. రెండు రోజుల పాటు వాటినే మళ్ళీ మళ్ళీ చదివింది. మళ్ళీ అతను ఎప్పుడొస్తాడా, ఎప్పుడు పుస్తకాలు తెస్తాడా అని ఎదురుచూస్తోంది. ప్రభాకర్ మళ్ళీ పుస్తకాలు తెచ్చాడు. గోర్కీ, టాల్‌స్టాయ్, చెకోవ్, కొడవటిగంటి, విశ్వనాథ, శ్రీశ్రీ, ఠాగూర్, ప్రేమ్‌చంద్, శరత్ చంద్ర నవలలు, కథలు, కవితలు, చారిత్రా

త్మక రచనలు, జీవిత చరిత్రలు.. ప్రతీ పుస్తకాన్ని కుతూహలంతో చదువుతోందామె.

ప్రభ, నారాయణరావు ఆమెలో మార్పుని గమనించారు. గతంలో ఏం అడిగినా పుల్ల విరుపుగా సమాధానమిచ్చేది. ఇప్పుడు సమాధానమే చెప్పడం లేదు. పుస్తకాలే ప్రపంచమన్నట్టు ఎప్పుడు చూసినా ఏదో ఒక పుస్తకం చదువుతూనే వుంటోంది. రమ్య వున్నట్టుండి ఎందుకు కాలేజీకి వెళ్ళడం మానేసిందో ప్రభకి తెలియదు. కొన్నాళ్ల తర్వాత నారాయణరావు ఆమెకి చెప్పాడు. రమ్య ఆ రాత్రి క్షేమంగా ఇంటికి తిరిగి వచ్చిందని సంతోషించినా ఎంత ప్రమాదం నుంచి బయటపడిందో తలచుకుంటే ఆమెకి ఇవాళ్టికీ నిద్రపట్టదు. ఆమె అర్థాంతరంగా చదువు ఆపెయ్యడాన్ని జీర్ణించుకోలేకపోతోంది. తన బాధని ప్రభాకర్ దగ్గర వ్యక్తంచేసింది.

"మీరామెని చదువుకోమని బలవంతపెట్టకండి. కొన్నాళ్ల తర్వాత ఆమె అంతట ఆమే చదువుకుంటానని అడుగుతారు. మిమ్మల్ని కేవలం ఓదార్చడానికి నేనీ మాటలని చెప్పడం లేదు" అన్నాడు ప్రభాకర్.

అతని మాటలు ప్రభకి కొండంత ధైర్యాన్నిచ్చాయి.




ప్రభాకర్ పరీక్షలన్నీ బాగా రాసాడు. ఆఖరి పరీక్ష వ్రాసి అతను రమ్య దగ్గరకి వచ్చాడు.

"నేను రేపు హైదరాబాద్ వెళ్తున్నానండీ" అన్నాడు.

"ఎందుకు? " రమ్య అడిగింది.

"నాకో లక్ష్యం వుంది, దాన్ని సాధించడానికి"

'ఏమిటా లక్ష్యం' అని రమ్య అడగలేదు. గత ఆరునెలలుగా ఆమె పెదవి విప్పి మాట్లాడింది తక్కువ. పగలూ రాత్రి తేడా లేకుండా పుస్తక పఠనంలో నిమగ్నమయింది. ఇల్లుదాటి బయటికి వెళ్ళలేదు. ప్రభాకర్ పుస్తకాలు తెచ్చి ఇచ్చేవాడు. ఇప్పుడు కూడా అతని చేతిలో పుస్తకం వుంది. దాన్ని ఆమెకి అందిస్తూ అన్నాడు, "ఈ పుస్తకాన్ని మీ కోసం తెచ్చాను. దీన్ని మీరు తిరిగి ఇవ్వక్కర్లేదు"

ఆమె సంభ్రమంగా అందుకుంది. మొదటి పేజీలో "ఐ విష్‌యు ఆల్ సక్సెస్ ఇన్ యువర్ లైఫ్- ప్రభాకర్" అని అతని చేతి రాతతో వుంది.

"థ్యాంక్ యూ!" అంది అస్పష్టంగా. అతను వెళ్ళిపోయాడు. రమ్య కుతూహలంతో ఆ పుస్తకాన్ని తిరగేసింది. అది వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన పుస్తకం.

"విజయం సాధించడమే నీ లక్ష్యమైతే అదే తపనతో నిరంతరం శ్రమించు. విజయం నీ స్వంతమవుతుంది. మొదటి ప్రయత్నంలో అపజయమెదురైనా నిరాశ పడకు" అనే వాక్యాలు ఆ పుస్తకంలో ఒక పేజీలో అండర్‌లైన్ చెయ్యబడి ఉన్నాయి. ఆ వాక్యాలని పదేపదే చదువుతోందామె. ఆమెలో ఏదో సంచలనం. మొదటిసారిగా తన గురించి తను ఆలోచించుకుంది.

తన చదువు ఎందుకు గాడి తప్పింది? లోకం తను కామేశ్వర్రావు కూతురని హేళన చెయ్యడం.. తల్లి డైరీని చద

వడం.. తద్వారా తన జన్మ రహస్యాన్ని తెలుసుకోవడం.. వీటి మధ్య నలిగిపోయిన తన మనసు తన జీవిత లక్ష్యాన్ని మరచిపోయిందా? ఆమె మనసులో అస్పష్టమైన వేదన. రెండు మూడు రోజులపాటు ఆ పుస్తకాన్నే చదువుతూండిపోయింది.

మరో రెండు రోజుల తర్వాత తండ్రి దగ్గరికి వచ్చింది. "నేను లాంగ్ టర్మ్ కోచింగ్ తీసుకుని ఎమ్ సెట్ రాయాలనుకుంటున్నాను. నన్ను ఏదైనా రెసిడెన్షియల్ కాలేజీలో చేర్పిస్తారా?"

కొన్ని నెలల తరవాత తనంతట తానుగా తండ్రితో మాట్లాడిన మాటలవి.

నారాయణరావు సంభ్రమంగా చూశాడు.

"అదేమిటమ్మా అలా పరాయిదానిలా అడుగుతున్నావ్? తప్పకుండా చేర్పిస్తాను. నీకు మంచి రేంక్ వస్తుంది. నాకు తెలుసు. ఇంజినీరింగ్ చదువు. ఆపై చదువులు యుఎస్‌లో చెయ్యి" ఆమె భవిష్యత్తు కోసం తనేం చెయ్యడానికైనా సిద్ధమే అన్నట్లు అన్నాడు.

"నేను ఈ ఇంటికి దూరంగా వెళ్ళిపోవాలి. నా కాళ్ళ మీద నేను నిలబడాలంటే బాగా చదువుకోవాలి. నాలుగేళ్ళు కష్టపడితే ఏదో ఒక ఉద్యోగం వస్తుంది. అప్పుడు నన్ను నేను పోషించుకోగలను" అని రమ్య తన గదిలోకి వెళ్ళిపోయింది.

"ఈ ఇంటికి దూరంగా వెళ్ళిపోవాలి" అన్న రమ్య మాటలు ప్రభని, నారాయణరావుని బాధ పెట్టాయి. అతను బాధావేదనలను దిగమింగుకుని అన్నాడు.

"ఎంత డబ్బు ఖర్చు అయినా ఫర్వాలేదు. నువ్వు బాగా చదువుకోమ్మా"

నాలుగు రోజుల తరువాత రమ్య విజయవాడలో ఒక రెసిడెన్షియల్ కాలేజీలో చేరింది.

★ ★ ★

స్థలం... హైదరాబాద్. సాయంకాలం ఆరు గంటలకి ఇన్‌స్టిట్యూట్ నుంచి తన రూమ్‌కి తిరిగి వచ్చిన ప్రభాకర్ తలుపు సందులోంచి గదిలో పడి ఉన్న పోస్టల్ కవరుని పైకి తీశాడు. ఆ కవరుపై చేతి రాత నారాయణరావుది కాదు. తనకి ఉత్తరం రాసేంత ఆత్మీయులు ఆయన తప్ప తనకెవరున్నారా అని ఆశ్చర్యంతో అతను కవరుని ఓపెన్ చేశాడు.

'ప్రభాకర్! ఐ లవ్ యు' అని ఒకే ఒక వాక్యం రాయబడి ఉంది ఆ ఉత్తరంలో. సంతకం లేని ఆ ఉత్తరాన్ని అతను ఆశ్చర్యంగా అయోమయంగా పదేపదే చదువుతున్నాడు. నారాయణరావుకి తప్ప తన ఎడ్రస్ ఎవరికీ తెలియదు. చేతిరాతని బట్టి అది ఆడపిల్ల దస్తూరీ అని తెలుస్తోంది. కాని ఆ లవ్ లెటర్‌లాంటి ప్రేమ సందేశాన్ని తనకెవరు పంపారో అతనికి తల పగలకొట్టుకున్నా అర్థం కాలేదు. అతను ఆ విషయాన్ని పెద్దగా పట్టించుకోలేదు. ఆ ఉత్తరాన్ని మడిచి పెట్టెలో పుస్తకాల కింద పెట్టాడు. తరువాత చదువులో లీనమయ్యాడు.

★ ★ ★

కాలచక్రంలో సంవత్సర కాలం ఇట్టే గడిచిపోయింది. రమ్య ఎమ్ సెట్ పరీక్ష రాసి ఇంటికొచ్చింది. ఈ సంవత్సర కాలంలో రమ్య కాలేజీకి ఒకటి రెండు రోజులు సెలవు వచ్చినా ఇంటికి రాలేదు. నారాయణరావు ఫోన్ చేస్తే ముక్తసరిగా మాట్లాడేది. అతనే మనసొప్పక ప్రతినెలా వెళ్ళి ఆమెని చూసి వచ్చేవాడు.

"నేను ఇక్కడ హాయిగా ఉన్నాను. మీరిలా చీటికీ మాటికీ వచ్చి నన్ను డిస్టర్బ్ చెయ్యొద్దు" అని కరాఖండిగా చెప్పేసిందో సారి.

అతని మనసు చివుక్కుమంది.

కానీ ప్రిన్సిపాల్ రమ్య చదువులో క్లాసు ఫస్టు అని, ఎమ్ సెట్ లో మంచి ర్యాంకు వస్తుందని చెప్పడంతో తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు.

నారాయణరావు, ప్రభ ఎంతో ఆ త్రుతతో ఎదురుచూస్తున్న ఎమ్ సెట్ ఫలి తాలు మరునాడే వస్తాయని న్యూస్ పేపర్లలో, టివి ఛానల్స్‌లో ప్రకటించారు. అతను ఆరాటంగా కూతుర్ని అడిగాడు.

"నీ హాల్ టికెట్ నెంబర్ ఇవ్వమ్మా! ఇంటర్‌నెట్ ఓపెనవగానే రిజల్ట్ చూసి వస్తాను"

"ఎందుకూ? నేను చూసుకుంటానులే" అంది.

అది తనపై అయిష్టతో లేక ఆమెకి సరైన రేంక్ రాదని అధైర్యమో అతనికి తెలియదు. ఆ రోజంతా అతను అస్థి మితంగా గడిపాడు. మరునాడు రిజల్ట్స్ చూసుకోవడానికి రమ్య ఇంటర్నెట్‌కి వెళ్ళింది. గంటన్నర తరవాత ఇంటికొచ్చిన ఆమె ముఖం అభావంగా ఉంది.

నారాయణరావు వీధి వరండాలో అస్థి మితంగా పచార్లు చేస్తున్నాడు. కూతుర్ని చూడగానే వేగంగా కొట్టుకునే గుండెలతో ఉద్వేగంగా అడిగాడు, "అమ్మలూ! ఏ రేంక్ వచ్చింది? "

"ఫస్ట్ రేంక్! స్వరంలో ఏ భావమూ వ్యక్తం కాకుండా చెప్పి తన గదిలోకి వెళ్ళి పోయింది.

ముందు తను పొరపాటు విన్నాడేమో అనుకున్నాడు. తర్వాత తను అడిగిన దానికి ఆమె వెక్కిరింతగా జవాబిస్తోందను కున్నాడు. అప్పుడే ఫోన్ మోగింది. అతను యాంత్రికంగా లిఫ్ట్ చేశాడు.

"కంగ్రాచ్యులేషన్స్ నారాయణరావు గారూ! మీ అమ్మాయి రమ్యకి ఎమ్ సె ట్ లో స్టేట్ ఫస్ట్‌రేంక్ వచ్చింది అని స్వయంగా ప్రిన్సిపాల్ ఫోన్ చేసి చెప్పాక కానీ అతనికి నమ్మకం కుదరలేదు. సంతో షంతో క్షణకాలం మూగబోయిన అతను ఎలాగో గొంతు పెగుల్చుకుని ఒక్క క్షణం "సార్! రమ్యని పిలుస్తాను" అని మౌత్ పీస్ అరచేత్తో మూసి, "అమ్మా రమ్యా! మీ ప్రిన్సిపాల్‌గారు నీతో మాట్లాడుతారట" అని బిగ్గరగా పిలిచాడు.

రమ్య గదిలోంచి వచ్చి ఫోన్ తీసు కుంది. భర్త ముఖంలోని ఆనందాన్ని చూస్తూనే రమ్యకి మంచి రేంక్ వచ్చిందని అర్థమైన ప్రభ, భర్త ఆనందాతిరేకంతో "మన రమ్యకి స్టేట్ ఫస్టు ర్యాంక్ వచ్చింది" అని చెప్పగానే సంతోషంతో ఉక్కిరిబిక్కిరయింది. రమ్య ఫోన్ మాట్లాడి తన గదిలోకి వెళ్ళబోతుండగా నారాయణరావు ఒక్కంగలో ఆమెని సమీ పించి ఆమె చేతులని పట్టుకుని గిరగిర తిప్పాడు.

"రమ్యా! మై స్వీట్ ఛైల్డ్! కంగ్రాచ్యులే షన్స్!" అతని స్వరంలో అవధులు దాటిన ఆనందం!

రమ్య నిర్లిప్తంగా అతన్ని చూసి అతని చేతులలో నుంచి తన చేతులని విడి పించుకుని గదిలోకి వెళ్ళిపోయింది.

నారాయణరావు పూజగదిలో వెళ్లి దేముడి ముందు సాష్టాంగ పడ్డాడు. అతని కళ్లవెంట ఆనంద బాష్పాలు రాలి పోతున్నాయి.

జేబులోని సెల్ అదేపనిగా మోగడంతో ఇహలోకంలోకి వచ్చి వెంటనే రిసీవ్ చేసు కున్నాడు.

"నమస్తే సార్!" అవతల ప్రభాకర్ స్వరం వినగానే ఆనందాతిరేకంతో అన్నాడు.

"థ్యాంక్స్ ప్రభాకర్. థ్యాంక్‌యూ వెరీ మచ్!"

"దేనికి సార్? " విస్మయంగా అడిగాడు.

"రమ్యకి ఎమ్ సెట్ లో ఫస్టురేంక్ వచ్చిం

దయ్యా!"

"నిజమా సార్? ఇవాళ రిజల్ట్స్ వస్తాయని తెలుసు. మీ ఫోన్ కోసం ఎదురు చూసి టెన్షన్ తట్టుకోలేక చేసాను"

"రమ్యలో మార్పు రావడానికి కారకుడివి నువ్వు! నీకెలా కృతజ్ఞతలు చెప్పాలో అర్థం కావడం లేదు" అతని గొంతు బొంగురుపోయింది.

ప్రభాకర్ నవ్వేడు. "ఇందులో నా గొప్పతనం ఏముందండీ? రమ్యగారు చాలా తెలివైన అమ్మాయి. కష్టపడి చదివి ఫలితం సాధించారు. అక్కడ ఆమె వున్నారా? "

"ఆఁ! ఒక్క నిముషం" అతడు గది తలుపు తట్టి రమ్యని పిలిచి సెల్ ఫోన్ అందించాడు.

"ప్రభాకర్... నీతో మాట్లాడతాడట!"

ఆమె ఫోన్ అందుకుంది. "కంగ్రాచ్యులేషన్స్ అండీ!"

"థ్యాంక్ యూ!" అని ఆమె ఫోన్ తండ్రికిచ్చేసి అక్కడ నుంచి వెళ్లిపోయింది. నారాయణరావు మరికొద్దిసేపు తన సంతోషాన్ని అతనితో పంచుకుని ఫోన్ పెట్టేసాడు. అతను రమ్య కోసం వెతికాడు. ఆమె పెరట్లో జామచెట్టు మీద కాకి గూడుని చూస్తోంది. తల్లికాకి పిల్లలకి ఆహారం అందిస్తున్న ఆ దృశ్యాన్ని అపురూపంగా చూస్తోంది.

"రమ్యా!" ఆమెని పిలిచాడు. ఆమె తల తిప్పలేదు.

"నీకేం బహుమతి కావాలో కోరుకోమ్మా!"

"దేనికి? " ఆమె తండ్రివైపు చూడకుండానే అడిగింది.

"నువ్వు సాధించిన విజయానికి."

"చిన్నప్పటి నుంచీ నీ కారణంగా నేను పొందిన అవమానాలని తుడిచెయ్యి. అది చాలు."

ఆ సమాధానంతో నారాయణరావు, కూతురి నోరు తీపి చేద్దామని పాయసం కప్పుతో అక్కడకొచ్చిన ప్రభ అప్రతిభులయ్యారు.

ఇంతలో టి.వి. ఛానెల్స్ వాళ్లు బిలబిలలాడుతూ గేటు తీసుకుని రావడంతో క్షణాలలో మామూలుగా అయి వాళ్లని ఆహ్వానించాడు నారాయణరావు.

తండ్రి పిలుపుతో రమ్య బయటికొచ్చింది.

"మీ లక్ష్యం ఏమిటి? " అని ఒక విలేఖరి అడిగిన ప్రశ్నకి, "ఇంజనీరింగ్ పూర్తవగానే ఏదో ఒక ఉద్యోగంలో చేరి నా కాళ్లమీద నేను నిలబడాలి" అని రమ్య చెప్పిన సమాధానాన్ని విని నారాయణరావు, ప్రభ ముఖాలు చూసుకున్నారు.

'నేను ఈ ఇంటికి దూరంగా వెళ్లిపోవాలి' అని గతంలో రమ్య అన్నమాటలు ఆ ఇద్ద

## సరైన సమయానికే వచ్చా!

రెండోసారి అమెరికాకి వెళ్లి, తిరిగొచ్చారు స్వామి. ఎవరికీ ఏ సమాచారం ఇవ్వకుండానే, కలకత్తాలోని మఠానికి చేరుకున్నారు. ఎటువంటి స్వాగతాలూ కోరుకోని ఆయన.. తననెవరూ గుర్తుపట్టరాదని శ్వేతజాతీయుడి దుస్తులు వేసుకున్నారు. నేరుగా కాక, గోడదూకి మరీ లోపలికొచ్చిన



ఆయనను.. అప్పుడే భోజనాలకు కూర్చున్న మఠం సాధువులు గమనించి చుట్టుముట్టారు. వచ్చింది స్వామీజీ అని తెలుసుకుని విస్తుపోయి చూస్తున్న వారితో, 'నేను గోడ దూకి రావడం మంచిదైంది. కాస్త ఆలస్యమైతే, ఇక్కడి భోజన పదార్థాలన్నీ అయిపోయేవి' అన్నారాయన. అంతే! నవ్వులువిరిసి వాతావరణమంతా చల్లబడింది.

రికీ గుర్తొచ్చి గుండెల్లో కలుక్కుమంది.

★ ★ ★

ప్రభాకర్ ఆ ఉత్తరాన్ని మరోసారి చదివాడు. 'ప్రభాకర్! ఐ లవ్ యు!' ఒకే ఒక వాక్యం. అలాంటి ఉత్తరం వారానికొకటి వస్తూనే వుందతనికి. ఆ ఉత్తరం కాకినాడ నుంచి పోస్టు చేయబడిందని కవరుపై వున్న పోస్టల్ ముద్రని బట్టి తెలుస్తోంది. తన క్లాస్‌మేటో, కాలేజీమేటో రాసిందనుకున్నా ఆమెకి తన ఎడ్రస్ ఎలా తెలిసిందో ఎంత ఆలోచించినా అతనికి అర్థం కావడం లేదు. సంతకం లేని ఆ ప్రేమలేఖ అతనిలో ఎలాంటి స్పందనని కలిగించలేదు. అతను నిరాసక్తంగా ఆ ఉత్తరాన్ని పెట్టెలో పడేసాడు.

★ ★ ★

ఫోన్ మోగింది. నారాయణరావు రిసీవ్ చేసుకున్నాడు. అవతల ప్రభాకర్ స్వరం వినగానే అతనిలో ఉత్సాహం ఉరకలేసింది.

"చెప్పు. ఎలా వున్నావ్?"

"మీ దయవల్ల బాగున్నాను సార్!"

"ఇంకేమిటి విశేషాలు?"

"నేను సివిల్స్‌లో టాప్‌రేంక్ సాధించాను సార్"

"నిజంగానా? ఎంత మంచి వార్త చెప్పావ్?" సంభ్రమానందాలతో తలమునకలయ్యాడు.

"అంతా మీ భిక్షే సార్!" ప్రభాకర్ స్వరం గాద్గదికమయింది.

"నేను చేసినదేముందయ్యా? కష్టపడ్డావు. ఫలితం సాధించావు. ఒకసారి ఇక్కడికి రాకూడదూ?"

"రెండు రోజులలో బయలుదేరతానండి"

"చూడు, సరాసరి మా ఇంటికే వచ్చేయ్యాలి. అర్థమయిందా?"

"అలాగే సార్! అమ్మగారికీ విషయం చెప్పండి, వుంటాను" అతను ఫోన్ పెట్టేసాడు.

నారాయణరావు, ప్రభకి ఆ శుభవార్తని చెప్పాడు.

"ఆ అబ్బాయికి సరస్వతీ కటాక్షం వుంది. తెలివితేటలు, దానికి తగ్గ కఠోర శ్రమతో కష్టానికి తగిన ఫలితం సాధించాడు" అందామె ప్రశంసగా.

★ ★ ★

ప్రభాకర్ వస్తూనే నారాయణరావుకి, ప్రభకి పాదాభివందనం చేసాడు.

"నేనీనాడు ఈ స్థితిలో వుండడానికి కారకులు మీరు. మీ ఋణమెలా తీర్చుకోను సార్" తడికళ్లతో చూస్తూ అడిగాడు.

"నిజానికి నేనే నీకు ఋణపడి వున్నాను. రమ్యలో మార్పుకి కారణం నువ్వు. మా అమ్మాయి ఇంజనీరింగ్ చదవదనే అనుకున్నాను"

ప్రభాకర్ ఇబ్బందిగా కదిలాడు. ఒక్కొక్కసారి పొగడ్తలు కూడా ఎంత ఇబ్బంది కలిగిస్తాయో అతనికి మొదటిసారిగా అనుభవంలోకి వచ్చింది.

"మా కాలేజీ ప్రిన్సిపాల్‌గారికి నేనే సివిల్స్‌లో సెలక్టయ్యానని ఫోన్‌చేసి చెప్పాను సార్! ఇవాళ సాయంకాలం కాలేజీలో నాకు చిన్న సన్మానం చేస్తారుట."

"కంగ్రాచ్యులేషన్స్!"

"నేను అంతగొప్ప వాడిని కాను. సన్మానం వద్దంటే ఆయన వినలేదు."

"నువ్వు గొప్పవాడివి కాదనుకోడం నీ వినయానికి, సంస్కారానికి నిదర్శనం."

"రమ్యగారి చదువెలా సాగుతోందండి? బాగానే చదువుతోందనుకుంటున్నాను."

"మాకు ఉత్తరం రాయదు, సెలవులకి కూడా ఇంటికి రాదు. ఏవో కంప్యూటర్ కోర్సులు చేస్తోందిట. నేనే అప్పుడప్పుడు ఫోన్ చేస్తుంటాను" నారాయణరావు మామూలుగానే చెబుతున్నా ఆ స్వరంలో




## పత్తి విత్తుల కాఫీ

అనంతపురం పట్టణంలో స్వాతంత్ర్యోద్యమంలో చటుక్కున జ్ఞప్తికి వచ్చే వ్యక్తి పప్పూరు రామాచార్యులు. 1932లో గాంధీజీ సహాయ నిరాకరణ ఉద్యమం చేపట్టినపుడు పప్పూరు రామాచార్యులు చురుకుగా పాల్గొని జైలు పాలయ్యారు. ఒక సంవత్సర కాలం జైలువాసం చేశాడు. ఆ కాలంలో జైళ్ళలో వసతులు చాలా తక్కువ. జైలుకెళ్ళిన నాయకులలో చాలామందికి కాఫీ తాగే అలవాటు. కానీ జైలుకు కాఫీపొడి సరఫరా లేదు గనుక వీరికి కాఫీ ఇచ్చేవారు లేరు.




రామాచార్యులు జైలు అధికారులతో మాట్లాడారు. 'అయ్యా, కాఫీపొడి లేకపోతే పోనివ్వండి. పత్తిగింజలైనా తెప్పించి ఇవ్వండి'అని అడిగారు. జైలు ఉద్యోగులు అందరికీ ఆయన పట్ల గౌరవభావం. వారు పత్తిగింజలు తెప్పించారు. రామాచార్యులు వాటిని పదనుగా వేయించి, దంచి, పొడిచేసి, ఆ పొడిని జైలు అధికారులకు ఇచ్చి, దానితో కాఫీ చేయించి ఇవ్వమని చెప్పారు. అధికారులు రాజకీయ ఖైదీలందరికీ పత్తిగింజల కాఫీ చేయించి ఇచ్చారు. ఈ విధంగా సమయానికి సరైన ఉపాయాలు ఆలోచించి పని జరుపగల ధీశాలి పప్పూరువారు.

అంతర్లీనంగా ధ్వనించిన ఆవేదనని గమనించకపోలేదతను.

"తొంభై శాతం స్టూడెంట్సు కెరీర్ ఓరియంటెడ్‌గానే ఉన్నారండీ.. మిగతావన్నీ వాళ్ల దృష్టిలో సెకండరీయే!" అన్నాడు.

"నా సొదకేంగాని నువ్వు స్నానం చేస్తే మనం బ్రేక్‌ఫాస్టు తిని బయటకి వెళ్దాం. నువ్వెవరినైనా కలవాలనుకుంటే కలిసిరా. నేను షాపుకి వెళ్తాను. సాయంకాలం అటు నుంచే మీ కాలేజీకి వస్తాను."

ప్రభాకర్ తనకి కేటాయించిన గదిలోకి వచ్చాడు. స్నానమయ్యాక బయటికొచ్చి నారాయణరావుని అడిగాడు.

"నేనొకసారి ఇంటర్నెట్ సెంటర్‌కి వెళ్లొస్తా? మీకు బ్రేక్‌ఫాస్టుకి లేటయిపోతుందంటే కాస్సేపాగి వెళ్తాను".

"బయటకి వెళ్లక్కర్లేదు. రమ్య గదిలో కంప్యూటర్ ఉంది. అది ఇంజనీరింగ్‌లో చేరకముందే కొన్నాను. కంప్యూటర్ కొనగానే ఇంటర్నెట్ కనెక్షన్ పెట్టించాను" అంటూ రమ్య గదిలోకి దారి తీసాడతను. ప్రభాకర్ అనుసరించాడు.

అతను కంప్యూటర్ ఆన్ చేసాక నారాయణరావు ఫోన్ మోగడంతో బయటకి వెళ్లాడు.

మౌస్ కింద తన ఎడ్రస్ రాసి ఉన్న కవరు ప్రభాకర్ దృష్టిని ఆకర్షించింది. కవరు అతికించే ఉంది. "ఎవరు రాసారు? రాసి పోస్ట్ చెయ్యడం మరిచిపోయారా? " అనుకుంటూ ఆ కవరుని ఓపెన్ చేసాడు.

'ఐ లవ్ యు ప్రభాకర్!' అని ఒకే ఒక వాక్యం! అదే చేతిరాత! తను హైదరాబాదులో ఉండగా తనకి వచ్చిన పాతిక ఉత్తరాలలోనూ అదే చేతి రాత.

"ఈ ఉత్తరం రమ్య గదిలో ఉంది అంటే... ఆమే రాసిందా? ఆమె తనని ప్రేమిస్తోందా? " అతని ముఖంలోకి చివ్వున రక్తం ఎగసింది! అతను క్షణకాలం ఊపిరి పీల్చుకోవడం మరచిపోయాడు.

అతని కళ్లముందు రమ్య కనిపిస్తోంది. చిరునవ్వుతో... సిగ్గుపడుతూ... ఆరాధనగా చిరుకోపంతో... రకరకాల హావభావాలతో కనిపిస్తోంది. 'ఐ లవ్ యు' అని

ఆమె తన చెవి దగ్గర గుసగుసలాడుతున్న ట్టనిపిస్తోంది.

తనకి ప్రేమలేఖలు రాస్తున్న అజ్ఞాత ప్రేమికురాలు రమ్యే అని తెలిసిన ఆ క్షణం అతని వయసుని, మనసుని ఒక మధురమైన భావం ఊపేసింది. మరు క్షణం తన అంతస్తు గుర్తుకొచ్చింది. అతనా ఉత్తరాన్ని మడిచి ప్యాంటు జేబు లోకి తోసి ఇంటర్‌నెట్ ఓపెన్ చేసాడు.

★ ★ ★

ప్రభాకర్ ఫణిభూషణరావు గారింటికి వెళ్లేసరికి ఆయన క్లయింట్లతో బిజీగా ఉన్నాడు. ప్రభాకర్‌ని చూడగానే సంభ్ర మంగా ఆహ్వానించి డ్రాయింగ్ రూమ్‌లోకి తీసుకెళ్లాడు.

"నమస్తే సార్! కులాసాగా ఉన్నారా?" వినమ్రంగా అడిగాడు.

ఆయన కళ్ళలో నీళ్లు చిప్పిల్లాయి.

"నన్ను క్షమించు బాబూ! నీ మంచిత నాన్ని గుర్తించలేక మురళి మాటలు విని నిన్ను ఇంట్లోంచి వెళ్లగొట్టాను".

"మీరు పెద్దవారు. నన్ను క్షమాపణ అడగకూడదు. మురళీగారూ.." ఎలా అడ గాలో తెలియక అర్థోక్తిలో ఆగిపోయాడు.

"వాడు నా కొడుకు అని చెప్పుకోడానికి సిగ్గుపడుతున్నాను. వాడు నా చెయ్యి దాటిపోయాడు" అన్నారాయన.

కాస్సేపు తర్వాత "నా సొదకేంగాని నువ్వు సివిల్స్‌లో 'టాప్ ర్యాంకు' సాధిం చావని పేపర్లో చూసాను. కంగ్రాచ్యులేష న్సోయ్!"

"థ్యాంక్ యూ సార్"

మరికొద్దిసేపు మాట్లాడి ఆయన దగ్గర సెలవు తీసుకున్నాడు.

★ ★ ★

కాలేజీ వేదికపై ప్రిన్సిపాల్ మాట్లాడుతు న్నారు. "మన కాలేజీ పూర్వ విద్యార్థి ప్రభాకర్ సివిల్స్ ప్యాసై ఐ.ఏ.ఎస్.కి సెలక్టు కావడం మన కందరికీ గర్వకా రణం. ఏ వ్యక్తికైనా తన లక్ష్యాన్ని సాధిం చడానికి అకుంఠిత దీక్ష, పట్టుదల అవ సరం. కాలేజీలో చదువుకునే రోజులలోనే ఆ దీక్షని, పట్టుదలని నేను ప్రభాకర్‌లో చూసాను. అతను జీవితంలో ఉన్నత శిఖ రాలని అధిరోహిస్తాడనే నా నమ్మకం వమ్ము కాలేదు. మిస్టర్ ప్రభాకర్‌ని మా విద్యార్థులకి తన అమూల్యమైన సందే శాన్నివ్వమని కోరుతున్నాను."

ప్రభాకర్ లేచాడు. ప్రిన్సిపాల్ గారికి తన నమస్కారాలతో మొదలు పెట్టి మాట్లాడడం ప్రారంభించాడు.

"జీనియస్ ఈజ్ టు పర్సెంట్ ఇన్స్పి రేషన్ అండ్ నైన్టీఎయిట్ పర్సెంట్ పర్స్పిరేషన్- అనే సామెతని మీరు వినే ఉంటారు. విజయానికి మూలాధారం ఎక్కువ శ్రమ, తక్కువ తెలివితేటలు. ఈ ప్రపంచంలో కేవలం తెలివైనవారే పైకి రాలేదు. తెలివితేటలతో బాటు ఎక్కువ శ్రమించిన వారే జీవితంలో ఏదైనా సాధిం చగలుగుతారు. విజయం సాధించడానికి ముఖ్యంగా మనలోని నెగిటివ్ థింకింగ్‌ని పారద్రోలాలి.

ఆకలి, అవమానం, దారిద్ర్యం, సోమరి తనం, నిర్లక్ష్యం ఇవేవీ కూడా మనని మన లక్ష్యానికి దూరం చెయ్యకూడదనే సూత్రాల ప్రాతిపదికగా నేను ఐ.ఏ.ఎస్. కావాలన్న నా లక్ష్యసాధన కోసం అహర్నిశలూ శ్రమించాను. రోజుకి పద్దెనిమిది గంటలు చదువుతూనే ఉన్నాను. ఇది కేవలం నా గొప్పదనం అని నేననుకోవడం లేదు. నేను అనాథని. వారాలు చేసుకుని చదువు కున్నాను. నాకు అన్నం పెట్టిన తల్లులకి సభాముఖంగా కృతజ్ఞతలు తెలియజేసు కుంటున్నాను. ఒక పుణ్యాత్ముడు నాకు ఆశ్రయమిచ్చారు. వారికి కూడా కృతజ్ఞ తలు తెలియచేసుకుంటున్నాను. నా అనే

వాళ్లెవరూ లేని నాకు శ్రీ నారాయణరావు గారు ఆత్మీయతని పంచారు. నేనివాళ ఈ స్థితిలో ఉన్నానంటే అందుకు కారణం నారాయణరావుగారే. నాకు వారు పుస్తకాలు కొనిచ్చారు. కాలేజీ ఫీజు కట్టారు. నన్ను గ్రూప్ వన్ కోచింగ్‌కి పంపి ఆ ఖర్చంతా భరించారు. వారి రుణాన్ని నేనీ జన్మలో తీర్చుకోలేను. వారిని ఈ సభా సమక్షంలో గౌరవించకపోతే అది కృతఘ్నతే అవుతుంది. వారిని వేదిక మీదకి రావలసిందిగా కోరుతున్నాను" సభలో కూర్చున్న నారాయణరావు వారింప చూసాడు.

"ప్లీజ్ రండి సార్" అర్థించాడతను. ఇక తప్పదని లేచి వేదిక మీదకి వచ్చాడు నారాయణరావు. అంతకుముందు ప్రిన్సిపాల్‌గారు తన మెడలో వేసిన పూలమాలని తీసి ఆయన మెడలో వేసి పాదాభివందనం చేశాడు. నారాయణరావు చెమ్మగిల్లిన కళ్లతో అతనిపై ఆప్యాయతని వర్షిస్తూ అతన్ని లేవనెత్తి ఆలింగనం చేసుకున్నాడు.

★ ★ ★

లాయర్ వీరభద్రం నారాయణరావు దగ్గరకొచ్చాడు. "నమస్కారం, రండి" అతను ఆహ్వానించాడు. ఆయన ప్రతి నమస్కారం చెయ్యలేదు. ఆ నమస్కారాన్ని స్వీకరిస్తున్నట్టు దర్పంగా తలపంకించి, అడిగేడు.

"ప్రభాకర్ ఉన్నాడా? "

"లోపల ఉన్నాడండి. పిలుస్తాను. కూర్చోండి" అని నారాయణరావు లోపలకి వెళ్లాడు.

"నమస్కారం సార్!" ప్రభాకర్ లోపల నుంచి వచ్చి ఆయన్ని పలకరించాడు.

"ఏమోయ్! ఐ.ఎ.ఎస్‌కి సెలక్టయ్యావుట. నువ్వు గొప్పవాడివవుతావని నిన్ను చూసినప్పుడే అనుకున్నాను. ఇంక పెళ్లి చేసుకుంటే సరి! మంచి పొజిషన్‌లో ఉన్నావుగా"

ప్రభాకర్ నవ్వి ఊరుకున్నాడు.

"చల్లకొచ్చి ముంత దాచడమెందుకు కాని, విషయం సూటిగా చెబుతాను విను. మా అమ్మాయిని నువ్వు చూసావుగా? నా ఆస్తికి ఒక్కగానొక్క వారసురాలు. నిన్ను నా ఇంటి అల్లుడిగా చేసుకోవాలని నా కోరిక. మా అమ్మాయికి, నీకు ఈడూజోడూ బాగుంటుంది. అయినా అందం కంటే గుణం, కుటుంబ సాంప్రదాయం ముఖ్యం. ఏమంటావు" ఓరగా నారాయణరావుని చూస్తూ అన్నాడు.

"నాకు ఇప్పట్లో పెళ్లి చేసుకునే ఉద్దేశం లేదండీ!"

## తెల్లదొరకు గుణపాఠం

ఓసారి రైల్లో స్వామి వివేకానందుడు ప్రయాణిస్తున్న పెట్టెలోనే ఆంగ్లేయుడు కూడా ప్రయాణిస్తున్నాడు. ఓ బైరాగిగాడు తనతో పాటు ప్రయాణించడం ఆ యూరోపియన్‌కు కంటగింపుగా తోచింది. కొంత సేపటికి వివేకానందుడు సీటుమీదకొరిగి నిద్రపోయాడు. ఓ గంట తర్వాత లేచి చూస్తే ఆయన తలపాగా కనిపించలేదు. అది ఆ ఆంగ్లేయుడి పనే అని గ్రహించిన వివేకానంద అప్పటికి ఊరుకుండిపోయాడు. మరికాసేపటికి ఆ ఆంగ్లేయుడు పక్క పరచుకుని నిద్రలోకి జారుకున్నాడు. వెంటనే వివేకానందుడు అతడి చెప్పుల్ని తీసి రైలు కిటికీలోంచి శక్తికొద్దీ విసిరి పారేశాడు. కాస్సేపటికి నిద్రలేచిన ఆ ఆంగ్లేయుడు తన చెప్పులు లేకపోవటం గమనించి స్వామితో కోపంగా, 'నా చెప్పులేవీ?' అని అడిగాడు. వివేకానందుడు శాంతంగా, 'మీ చెప్పులు నా తలపాగాను వెతుక్కురావటానికి వెళ్లాయి' అని చెప్పాడు.



"ఇప్పట్లో పెళ్లి చేసే ఉద్దేశం నాకూ లేదు. నీకు పోస్టింగ్ వచ్చాకే పెళ్లి. ఎల్లుండి మంచి ముహూర్తం ఉంది. నిశ్చితార్థం జరిపిస్తాను"

"క్షమించండి. నాకు మీ అమ్మాయిని పెళ్లి చేసుకునే ఉద్దేశం లేదు" అని ప్రభాకర్ లోపలకి వెళ్లిపోయాడు.

వీరభద్రం నారాయణరావు వైపు కోరగా చూస్తూ అన్నాడు.

"మీరు చాలా తెలివైన వాళ్లండీ. అన్నం పెట్టి ప్రభాకర్‌ని ఆకట్టుకున్నారు. అటు అతన్ని చదివించిన పుణ్యమూ దక్కింది. ఇటు చవగ్గా ఐ.ఎ.ఎస్ అల్లుడిని పట్టేసిన ప్రతిఫలమూ దక్కింది.

"వీరభద్రంగారూ! నాకు అంతంత దూరాలోచనలు, దురాలోచనలు లేవు. చదువుకుంటున్న ఒకబ్బాయికి అన్నం పెడితే పుణ్యమనుకున్నాను. అతన్ని నేను చదివించిన మాట నిజం. అతనిలో సివిల్స్ ప్యాసవాలనే పట్టుదల, అందుకు తగిన తెలివితేటలు ఉన్నాయి. అందుకని చదివించాను. ప్రభాకర్ ఎంత అభిమాన ధనుడో మీకు తెలియదు. తనకి ఉద్యోగం వచ్చాక నేను అతనిపై ఖర్చు పెట్టిన డబ్బుని తిరిగి ఇచ్చే షరతుమీదే నా దగ్గర డబ్బు పుచ్చుకుని చదువుకున్నాడు" ఎర్రబడిన ముఖంతో అన్నాడు నారాయణరావు.

"ఎలాగైతేనేం పుణ్యం, పురుషార్థం రెండూ దక్కాయి కదా! అయినా మీ అమ్మాయిని ప్రభాకర్ పెళ్లి చేసుకుని తీరాలి కాబట్టే తెలివిగా అతని ముందు కాళ్లకి బంధం వేసారు. ఫణిభూషణరావు గారి గెస్టుహౌస్‌లో మీ అమ్మాయి, ప్రభాకర్ తప్పుచేస్తూ వాళ్ల అబ్బాయి మురళికి దొరికిపోయారుట. ఇది తప్పు కాదా అని నిలదీసినందుకు ప్రభాకర్ మురళిని చితకబాదాడుట" వంకరగా నవ్వేడు.

నారాయణరావుకి ఆగ్రహావేశాలతో ఒళ్ళు తెలియడంలేదు. "మురళి బారినుంచి రమ్యని రక్షించిన ప్రభాకర్ అతన్ని కొడితే అతగాడు ఆ సంఘటనకి ఇలాంటి వికృతమైన రంగు పులిమాడా?"

"ఇలాంటి రూమర్లకి భయపడి అది అబద్ధమని ఖండించవలసిన అవసరం కాని, సంజాయిషీ ఇచ్చుకోవలసిన అవసరం కానీ నాకు లేవు. దయ ఉంచి ఆ విషయాన్ని ఇంతటితో వదిలెయ్యండి"

"అహాః! నాకూ తెలియదు. ఊరంతా కోడై కూస్తుంటే నేనూ విన్నాను. మీ అమ్మాయి ప్రభాకర్ వల్ల గర్భవతి అయిందని, చదువు వంకతో ఆమెని విజయవాడ పంపించి ఆ గర్భాన్ని తీయించారని. అయినా నేను నోరు మూసుకుంటే సరిపోతుందా? లోకంనోరు మూయించగలరా?" హేళనగా నవ్వి నిష్క్రమించాడు వీరభద్రం.

నారాయణరావు ముఖం నెత్తురు లేనంతగా పాలిపోయింది. నింద అనేది ఇంత భయంకరంగా ఉంటుందని, అది కార్చిచ్చు కంటే వేగంగా వ్యాపిస్తుందని గతంలో ప్రభ విషయంలో, ఇప్పుడు రమ్య విషయంలోనూ అతనికి అవగతమయింది. రమ్య పుట్టుక గురించి తెలిస్తే ఆమెకి పెళ్ళవుతుందా అనేది ఒక ప్రశ్నార్థకమైతే, ఈ నింద ఆమె భవిష్యత్తుపై మాయని మచ్చగా మిగిలిపోతుందనేది నిర్వివాదాంశం. అసలు ఈ పరిస్థితులలో ఆమెకి పెళ్ళి చెయ్యగలనా? అనే వేదన అతని మనసుని నలిబిలి చేస్తోంది.

వీరభద్రం మాట్లాడిన ప్రతి మాటని లోపల ఉన్న ప్రభాకర్ వింటూనే ఉన్నాడు. రమ్యకి తనతో నీచ సంబంధాన్ని అంటగట్టిన మురళి ఆ పుకారు ఊరంతా వ్యాపించడానికి యథాశక్తి కృషి చేశాడని తెలుసు. నోటికొచ్చినట్లల్లా వాగుతున్న వీరభద్రాన్ని మెడపట్టి బైటకి

## బీమా సొమ్ముకోసం ఆత్మహత్యాయత్నం

తండ్రికి పక్షవాతం రావడంతో ఇంటర్ చదివే అశోక్‌పై ఇంటిబాధ్యత పడుతుంది.. ఉద్యోగాన్వేషణ కోసం హైదరాబాద్ చేరతాడతను. వారాలు గడిచినా ఉద్యోగం దొరక్కపోవడంతో నిరాశలో కూరుకుపోయి. ఆత్మహత్యే శరణ్యం అనుకుంటాడు. తను చనిపోతే ఇన్సూరెన్సు ద్వారా వచ్చే మూడులక్షలు కుటుంబానికి ఉపయోగపడతాయని ఆశిస్తాడు.. అందుకే తనచావు ఆత్మహత్యలా కాక యాక్సిడెంట్‌లో మరణించినట్లు ఉండాలని రోడ్డుమీద ట్రాఫిక్‌లో అడ్డదిడ్డంగా నడుస్తుంటాడు.. ఆ తర్వాత జరిగిన సంఘటన అతని జీవితాన్నే పూర్తిగా మార్చేసింది.. ఏమిటా సంఘటన? అది అతని జీవితాన్ని ఎలా పూర్తిగా మార్చేసింది?



అక్షరాక్షరంలో ఉత్కంఠ కలిగించే
ఓ నిరుద్యోగి బతుకుపోరు వెంకటేష్ ఆత్మకథ మీకోసం!
ఇది ప్రతి నిరుద్యోగీ తప్పక చదివి తీరాల్సిన నవల!

ఫిబ్రవరి చతుర లో చదవండి


గెంటాలనే ఉద్రేకం కలిగిందతనిలో. కాని ఆ సమయంలో అతనితో వాగ్వివాదాన్ని పెంచడం వలన అతను మరింత పేట్రేగి పోయి మరిన్ని అవాకులు చవాకులు పేల తాడు. అందుకే మౌనంగా ఊరుకున్నాడు.

మనుషులు డబ్బుకోసం పదవికోసం ఎంత పడిచస్తారో, వీరభద్రాన్ని చూస్తే అర్థమయిందతనికి. తన కులమేదో తెలి యదు కాబట్టి తనకి పెరటి అరుగు మీద విస్తరి వేసి అన్నం పెట్టించేవాడు. తన కూతుర్ని పొరపాటున కూడా తను వున్న వైపు రానిచ్చేవాడు కాదు. అలాంటిది ఇప్పుడు తను ఐఎఎస్‌కి సెలక్టు కాగానే తన కాళ్ళు కడిగి పిల్లనివ్వడానికి సిద్ధప డ్డాడు. తను నిరాకరించగానే రమ్యకి, తనకి మధ్య నీచ సంబంధం ఉందని నోటి తీట వదిలించుకున్నాడు.

'అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు' అనే సామెత వీరభద్రం లాంటి మనుషులని చూసే పుట్టి ఉంటుందనిపించిందతనికి.

తనకి అన్నం పెట్టి తనని చదివించ డంలో నారాయణరావుగారి స్వార్థం ఉందనే అతని ఆరోపణ మరింత అస హ్యాన్ని కలిగించింది.

★ ★ ★

రమ్య ఆఖరి పరీక్ష రాసి రూమ్‌కి వచ్చేప్పటికి హరి ఫోన్ చేశాడు.

"అక్కా! నీకో గుడ్ న్యూస్"

"ఏమిటిరా? "

"నాకు వీసా వచ్చింది. వచ్చే నెల పదో తారీఖున అమెరికా ప్రయాణం."

"కంగ్రాచ్యులేషన్స్‌రా!"

"థాంక్ యు! నువ్వు ఎగ్జామ్ ఎలా రాసావు"

"బాగా రాసాను."

"సెమిస్టర్ హాలిడేస్ కదా! ఇంటికి రా!"

"కంప్యూటర్ కోర్సులో జాయినయ్యాను. కుదరదు."

"ప్లీజ్ అక్కా! నాన్నగారు కూడా నువ్వొస్తే బాగుండేదనుకున్నారు."

"నాన్న..." పళ్ల బిగువున అంది.

"ఆయన మన నాన్నకాదురా ఫూల్!"

"నాన్నపై నీకు ఎందుకంత కోపం? "

"నేను కోపంతో అనడం లేదు. నేను చెప్పేది నిజం".

"సరేలే! నేను హైదరాబాద్‌లోనే ఫ్లయిట్ ఎక్కబోతున్నాను. కనీసం ఎయిర్‌పోర్టుకయినా వస్తావా? "

"ఓకే!" రమ్య ఫోన్ పెట్టేసింది.

హరి అమెరికా వెళ్లాక రమ్యకి కొన్నాళ్లు ఒంటరితనంగా అనిపించింది. వాడు ఇంజనీరింగ్ చదవడానికి హైదరాబాద్ వెళ్లాక తనొక్కర్తీ కాకినాడలో ఉంది. అది వేరే సంగతి. హరి, ఎమ్.ఎస్. పూర్తయి జాబ్ వచ్చేవరకు ఇండియా రాడని ఆమెకి తెలుసు. కొంతలో కొంత నయం వారానికోసారి ఫోన్ చేస్తాడు. రమ్య ఫోర్త్ ఇయర్ చదువుతుండగానే కేంపస్ సెలక్షన్స్ వచ్చాయి. ఆమె ఇన్ఫోసిస్‌లో సెలక్టయింది.! ఆ విషయం హరితో చెప్పింది.

"అంటే నువ్వు ఇంజనీరింగ్‌తో చదువు ఆపేసి జాబ్‌లో చేరిపోతావా? "

"అవును" అంది రమ్య.

"ఇంజనీరింగ్ బేసిక్ డిగ్రీ కదా! తర్వాత ఎమ్.ఎస్ లేదా ఎమ్.బి.ఏ చెయ్యి. మంచి ఫ్యూచర్ ఉంటుంది."

"నాకు జాబ్ చాలా అవసరం."

"ఏం? నాన్న పంపిస్తున్న పాకెట్‌మనీ సరిపోడం లేదా? " నవ్వేడు హరి.

"ఆయనపై ఆధారపడ్డం నాకిష్టం లేదు. నా మటుకు నాకు ఎప్పుడు చదువు పూర్తి చేసి జాబ్‌లో చేరదామా అనిపిస్తోంది."

హరి క్షణం మాట్లాడలేకపోయాడు. తమ భవిష్యత్తుని తీర్చిదిద్దాలని తండ్రి ఎంత తపన పడుతున్నది వాడికి తెలుసు. ఎంతో తెలివైన అక్క ఇంజనీరింగ్‌తో చదువు ఆపేసి ఉద్యోగంలో ఎందుకు చేరతానంటున్నది అర్థం కాలేదు. హరి ఆ రాత్రి తండ్రికి ఫోన్ చేసి ఆ విషయం చెప్పాడు.

ఇన్ఫోసిస్‌లాంటి పెద్ద కంపెనీలో రమ్యకి ఉద్యోగం వచ్చినందుకు సంతోషించాలో లేక ఆమె పైచదువు చదవనందుకు విచారించాలో అర్థం కాలేదు నారాయణరావుకి.

'ఈ ఇంటికి దూరంగా వెళ్లిపోవాలంటే, నా కాళ్లమీద నేను నిలబడాలి' అని రమ్య ఒకప్పుడన్న మాటలు గుర్తొచ్చి అతని మనసు చేదు తిన్నట్టయింది.

రమ్య ప్రభకి కాని, తనకి కాని ఎప్పుడూ ఫోన్ చెయ్యకపోయినా హరితో రెగ్యులర్‌గా మాట్లాడుతుండటంవల్ల దాని కబుర్లు తమకి తెలుస్తున్నాయి అనుకున్నాడు.

★ ★ ★

శ్రీ నారాయణరావుగారికి,

రమ్య రాయునది... నాకు మీ ఇంట్లో ఆశ్రయమిచ్చి ఇన్నాళ్లూ నన్ను పోషించి నన్ను చదివించినందుకు నా కృతజ్ఞతలు. ఆ రకంగా మీకు నేను ఋణపడి వున్నాను. అది తీర్చుకునే అవకాశం నాకు ఇన్నేళ్ళ తర్వాత లభించింది. మీరు నా కోసం ఖర్చుపెట్టిన ప్రతి రూపాయీ లెక్క రాసి వుంచాను. అది తీర్చేస్తాను. ఈ ఉత్తరంతోబాటు పదివేల రూపాయల చెక్ పంపుతున్నాను.

గతంలో మీకు నేను చెప్పినట్టు మీకూ నాకూ మధ్య ఎలాంటి బంధుత్వం లేదు. కనుక నా నుంచి ఉత్తరప్రత్యుత్తరాలని ఆశించవద్దు. మరోమాట నన్ను మీరు చూడ్డానికి రానవసరంలేదు.

రమ్య

ఆ ఉత్తరాన్ని చదివిన నారాయణరావు ముఖం తెల్లగా పాలిపోయింది. కళ్ళలో నీళ్ళు చిప్పిల్లుతుండగా "ప్రభా!" అని పిలిచాడు. ఆ పిలుపు ఆర్తనాదంలా వుంది.

ప్రభ వివర్ణమైన భర్త ముఖాన్ని, అతని చేతిలో ఉత్తరాన్ని చూసి ఒక్కంగలో అతన్ని సమీపించింది.

"ఏమయిందండీ? ఏమిటా ఉత్తరం? ఎవరు రాసారు? " మనసు కీడు శంకిస్తుండగా గుండె దడదడలాడుతుండగా అడిగింది.

అతనా ఉత్తరాన్ని ఆమెకి అందించాడు. ప్రభ ఆదుర్దాగా చదవడం మొదలుపెట్టింది. రెండు లైన్లు చదవగానే ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. నీళ్ళు నిండిన కళ్ళకి ఉత్తరంలోని అక్షరాలు మసగ్గా కనిపిస్తున్నాయి. కళ్ళు తుడుచుకుంటూ చదువుతోంది. రమ్య ఆ ఇంటితో అనుబంధాన్ని పూర్తిగా తెంచుకుందనే వాస్తవం తెలిసిన ఆమె మనసు తట్టుకోలేకపోతోంది. కాళ్ళలో సత్తువలేనట్టు కూలబడిపోయి వెక్కివెక్కి ఏడుస్తోంది.

★ ★ ★

వైదేహి వచ్చేటప్పటికి ఆ ఇల్లు నిశ్శబ్దంగా వుంది. తను చూస్తున్నది ప్రభ నేనా అని అనుమానం వచ్చింది ఆమెకి. ఆమె ముఖం పది లంఖణాలు చేసినట్లు పీక్కుపోయి వుంది. కళ్ళకింద నల్లటి వలయాలు, చెంపల దగ్గర నెరసిన వెంట్రుకలతో ఆమె వయసు హఠాత్తుగా పది సంవత్సరాలు పెరిగినట్టుంది.

వైదేహిని చూడగానే ఆమె గాజు కళ్ళలో చిన్న వెలుగు.

"ఇదేమిటి ఇంత హఠాత్తుగా వచ్చావ్? " అని, "ఏమండీ! ఎవరొచ్చారో చూడండి" అంది లోపల వున్న భర్తకి వినిపించేలా.

లోపలనుంచి నారాయణరావు వచ్చాడు. "మీరా! బాగున్నారా? "

"బాగున్నానండీ!" అంది జబ్బుపడిలేచిన వాడిలా వున్న అతన్ని చూస్తూ. ఆ ఇద్దరి పరిస్థితి ఆమెకి ఎన్నో భయసందేహాలను కలిగించాయి.

ప్రభ కాఫీ కలిపి తెచ్చింది. పది నిముషాలలో స్నానాదికాలను ముగించుకొచ్చిన వైదేహినిచూస్తూ "బ్రేక్‌ఫాస్టు రెడీ" అంది.

"నువ్వు మీ ఆయన భోజనం చేసి ఎన్నాళ్ళయింది? " అనడిగింది సూటిగా చూస్తూ.

"భోజనం చెయ్యకుండా ఎలా బ్రతుకుతున్నాం వైదేహీ! శుభ్రంగా తింటున్నాం" అంది నవ్వుతూ.

"... నీ సమస్య ఏమిటో చెప్పు!? "

"సమస్యలా? మాకేం సమస్యలు లేవే? "

"నువ్వు మంచి దానివని తెలుసుకాని, మరీ ఇంత మంచిదానివనుకోలేదు. రమ్య ఏదో కొత్త సమస్య తెచ్చింది. నాకు తెలుసు. నువ్వు నిజం చెప్తే బాగుంటుంది."

రమ్య ప్రస్తావన రాగానే ప్రభ కళ్ళలో నీళ్ళూరాయి.

"చెప్పు!"

"చెప్తే ఏంచేస్తావ్? "

"పరిష్కరించడానికి ప్రయత్నిస్తాను."

"వదిలెయ్యి" అంది ముఖం తిప్పుకుంటూ.

"ప్రభా! రమ్యకి నీకూ మధ్య అనుబంధం దెబ్బతిందని నాకు తెలుసు. కాని కొత్త సమస్య ఏమిటి? " బుజ్జగిస్తూ అడిగింది వైదేహి.

ప్రభ గదిలోకెళ్ళి రమ్య రాసిన ఉత్తరాన్ని తెచ్చి ఆమెకి అందించింది. ఆ ఉత్తరాన్ని చదివిన వైదేహి ముఖంలో రకరకాల భావాలు సుళ్ళు తిరుగుతున్నాయి.

## కొత్తగాలి...

**ఇస్తే వాగ్దానం**
**వదిలితే వాగ్బాణం**
**వాక్కుకెంత పవరో?**

– అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు

ఉత్తరాన్ని మడిచి ప్రభకిస్తూ నవ్వింది.

"దీనికన్నీ నా పోలికలే! నేను పట్టిన కుందేలుకి మూడు కాళ్ళనే మూర్ఖత్వం! నేనే తెలివైనదాన్ననే అహం! నా అహంపై కామేశ్వర్రావు దెబ్బ కొట్టేవరకు నేనిలాగే పొగరుగా తల బిరుసుగా వుండేదాన్ని! ఇదేం పెద్ద సమస్య కాదు. అయినా ప్రతి సమస్యకీ ఒక పరిష్కారం వుంటుంది. పద బ్రేక్‌ఫాస్టు చేద్దాం. నేను బయటికి వెళ్ళాలి. కాస్త పనుంది" అంది.

ప్రభ కళ్ళు తుడుచుకుని డైనింగ్ టేబిల్ దగ్గరకి నడిచింది.

★ ★ ★

'హలో!' అని ఫోన్‌లో పురుష స్వరం వినగానే "కామేశ్వర్రావు గారేనా?" అని అడిగింది వైదేహి.

"అవును, మీరెవరు?"

"నేను వైదేహిని"

"వైదేహా? ఏ వైదేహి?"

"నీకెంతమంది వైదేహిలు తెలుసు?" నవ్వింది.

"ఓ! నువ్వా.. చెప్పు!" అతని స్వరంలో ఏదో జంకు.

"మనం కలుసుకోవాలి"

"నీకు నాతో ఏంపని?"

"కొంచెం డబ్బు అవసరంలో వున్నాను. నువ్వు ఇవ్వాలి."

"నేను నీకెందుకివ్వాలి?"

"మన గతం మీ ఆవిడకి నేను చెప్ప కుండా వుండడానికి"

"బ్లాక్‌మెయిల్ చేస్తున్నావా?"

"తప్పదు"

"నువ్వు ఏం చెప్పినా మా ఆవిడ నమ్ము తుందనుకున్నావా?"

"నీ భార్యకి నీపై అంత నమ్మకమా?" ఎగతాళిగా అంది.

"ఓకే! నేనిప్పుడే నీ భార్యకి ఫోన్ చేస్తాను"

"రాక్షసీ! ఎంతకి తెగించావు?"

"తప్పదు మరి. నా అవసరం అలాం టిది."

"ఎంత కావాలి?" నిస్సహాయంగా వుందతని స్వరం.

"వెంటనే రామాలయానికి రా. అక్కడ అన్నీ తీరికగా మాట్లాడుకుందాం" అంది ఫోన్ కట్ చేస్తూ.

అప్పటికే ఆమె గుడిలో వుంది. ఎవరో ఒకామె గర్భగుడి చుట్టూ ప్రదక్షిణ చేస్తోంది.

పదినిముషాల తర్వాత గుడిలో ప్రవేశి స్తున్న కామేశ్వర్రావుని సులువుగానే గుర్తు పట్టింది వైదేహి.

అప్పటికీ ఇప్పటికీ అతనిలో మార్పేమీ లేదు. కొద్దిగా లావయ్యాడు. అంతే!

"కామేశ్వర్రావు!" తన కోసం కళ్ళింత చేసుకుని అక్కడంతా వెతుకుతున్న అతన్ని బిగ్గరగా పిలిచింది.

అతనామెని చూసి సమీపించాడు. అతని ముఖంలో ఆమెని, గుర్తుపట్టిన భావం.

"చెప్పు ఎంత కావాలి?" సూటిగా అడి గాడు, తమని ఎవరైనా గమనిస్తున్నారేమో నని బిత్తర చూపులు చూస్తూ.

"ఎలా వున్నావని అడుగుతావనుకు న్నాను"

"కనిపిస్తూనే వున్నావుగా? వేరే అడ గాలా?"

"...మన ప్రేమ ఫలితంగా నా కడు పులో పెరిగిన నీ బిడ్డ గురించి అడుగుతా వనుకున్నాను."

"బిడ్డా? నాకిదివరకే పెళ్ళయిందని నిన్ను పెళ్లి చేసుకోనని చెప్పాక అబార్షన్ చేయించుకోలేదా? పిల్లని కని పెంచుతు న్నావా?" హేళనగా నవ్వేడు.

"..పోనీ ఇదైనా చెప్పు. నీతో సంపర్కం లేకుండా ప్రభ పిల్లల్ని ఎలా కన్నది?

రమ్యకి నీ పోలికెలా వచ్చింది? "

కామేశ్వర్రావు ముఖంలో రంగులు మారాయి. వైదేహి నోటి వెంట ప్రభ ప్రస్తావన రావడంతో.

"...ఆ కవలలు నీకు పుట్టిన పిల్లలేమో అని అనుమానమైనా రాలేదా? "

క్షణం అతని ముఖంలో ఆశ్చర్యం, అప నమ్మకం దోబూచులాడాయి. మరుక్షణం పైశాచికానందం ప్రతిఫలించింది.

"ఆ పిల్లలు నీ పిల్లలా? అందుకేనా రమ్యకి నా పోలిక వచ్చింది? ప్రభకి నాకు అక్రమ సంబంధం వుందని లోకాన్ని నమ్మించాను. రమ్యకి నా పోలిక రావడం వల్ల వాళ్ళు నాకు పుట్టిన పిల్లలే అని గుడ్డి లోకం మరింత గుడ్డిగా నమ్ముతోంది!" విజయ గర్వంతో నవ్వేడు...

"నాకు లొంగని ప్రభ జీవితాన్ని ఎలా ముక్కలు చేసానో చూసావా? "

"ఇప్పుడే నీ భార్య దగ్గరకి వెళ్ళి ఇదంతా చెబుతాను."

"అవసరం లేదమ్మా! నేనిక్కడే వున్నాను" వెనుకనుంచి వినవచ్చిన స్త్రీ స్వరం విని గిరుక్కున వెనుదిరిగింది.

గర్భగుడి చుట్టూ ప్రదక్షిణ చేస్తున్న స్త్రీ ఆమె. కామేశ్వర్రావు ఆమెని చూసి అదిరి పడ్డాడు.

"సీతా! నువ్వు.. నువ్విక్కడ!" పాలిపో యిన ముఖంతో చూస్తూ అడిగేడు.

"...భగవంతుడు రప్పించాడు" పదు నుగా అంది సీత. ఆమె కళ్ళు అగ్ని గోళాల్లా వున్నాయి.

"నువ్వు మనిషివి కాదు. రాక్షసుడివి! నువ్వు చేసిన పాపానికి ఆ కుటుంబ పరువు బజార్న పడింది. నువ్వు నా భర్త వని చెప్పుకోడానికి కూడా అసహ్యం వేస్తోంది" సీత ఛీత్కరిస్తూ విసురుగా ముందుకి నడిచింది. కామేశ్వర్రావు ముఖంలో నెత్తురు ఇంకిపోయింది. ప్రభతో తనకి అక్రమ సంబంధం వుందని తెలిసి, కొన్నేళ్లుగా ఆమె తనని ఎలా శిక్షి స్తోందో అనుభవ పూర్వకంగా తెలుసత నికి. తన గతంలో వైదేహి వుందని తెలిసి ఇంకెలా శిక్షిస్తుందో? బలికి తీసుకెళ్తున్న మేకలా వెంట నడిచాడు కామేశ్వర్రావు.

★ ★ ★

వైదేహి ఇంటికొస్తూనే ఫ్రెష్ అయి సరా సరి డైనింగ్ టేబిల్ దగ్గరకొచ్చింది. స్తబ్దుగా కూర్చున్న ప్రభలో చైతన్యం వచ్చింది. గభాల్న వంటింట్లోకి వెళ్ళి డిష్ లన్నీ తెచ్చి టేబిల్ మీద సర్దింది.

ముగ్గురూ తినడం మొదలు పెట్టారు. "కామేశ్వర్రావుని కలుసుకున్నాను" హఠా త్తుగా ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా అంది వైదేహి.

"ఏమిటీ!" ప్రభ చేతిలోంచి ముద్ద జారి పోయింది. నారాయణరావు ఆందోళనగా చూస్తూ అన్నాడు.

"కొత్త సమస్యలొస్తాయేమో!"

"వస్తాయి. మీకు కాదు, కామేశ్వర్రావుకి, అతని భార్యకి మధ్య"

"అంటే? "

వైదేహి జరిగినదంతా చెప్పింది.

"జరిగిన దాంట్లో ప్రభ తప్పేమీ లేదని సీత నమ్మితే చాలా? లోకం నమ్మొద్దూ? అంతకు మించి రమ్య..." బాధగా అన్నాడు నారాయణరావు.

"పాపం సీత..! ఈ నిజం తెలిసి వాళ్ళ మధ్య ఏం గొడవలొస్తాయో!" అంది ప్రభ జాలిగా.

"నువ్వు చాలా మంచిదానివి ప్రభా!" అంది వైదేహి చెమ్మగిల్లిన కళ్ళతో.

వాళ్ళ భోజనాలు పూర్తి కావొస్తుండగా ఫోన్ మోగింది.

నారాయణరావు ఫోన్ తీసాడు.

'ఒక్క నిముషం' అని ఫోన్ పక్కన పెట్టి "ప్రభా! చూడు ఎవరో నిన్నే అడుగు

## డిసెంబరు -09
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. జి.పద్మావతి - వెంకట్రాయపురం, తణుకు
2. కొంగర ఉమామహేశ్వరరావు - చెంచుపేట, తెనాలి
3. పందరబోయిన కోటేశ్వరరావు - ధూళిపూడి, గుంటూరు జిల్లా
4. ఎం.పి.సుందరి - జెఎన్‌టీయు, హైదరాబాద్
5. ఎ.నరసింహావతారం - ఈస్ట్‌పాయింట్ కాలనీ, విశాఖపట్నం



### సరైన జవాబులు

1. ఇద్దరు 2. యామిని 3. శంకరం 4. ప్రభాకర్ 5. వినోబా భావే 6. హమీద్ మియా 7. అమెరికా 8. వసుంధర 9. ఆర్థర్ కానన్ డాయల్ 10. మాటి మటాళ

తున్నారు" అని పిలిచాడు.

ప్రభ ఫోనందుకుంది.

"నేను సీతని మాట్లాడుతున్నాను" కొన్నేళ్ళ తరువాత అనూహ్యంగా ఆమె ఫోన్ చెయ్యడంతో ప్రభకి ఏం మాట్లాడాలో తోచలేదు.

"కొన్నేళ్ల మౌనం తర్వాత మాట్లాడ్డానికి మాటలుండవు. కాని నేను చెప్పదలచుకున్నది చెప్పాలిగా? " అంది సీత.

"చెప్పు!"

"జరిగిన దాంట్లో నీ తప్పేమీ లేదని, తనకి లొంగని నీపై కక్షకట్టి నా భర్త అనే నీచుడు నీపై నిందమోపాడని చాలా ఆలస్యంగా తెలిసింది. నిన్ను క్షమాపణ అడగడం చూసేవాళ్ళకి సినిమాటిక్‌గా వుంటుందేమో కాని, క్షమాపణ అడగకుండా ఉండలేకపోతున్నాను. నన్ను క్షమించు"

"మనలో మనకి క్షమాపణలేమిటి సీతా!" అంది ప్రభ.

మరునాటి ఉదయం ప్రయాణమయింది వైదేహి.

"రమ్యకి మాత్రం ఈ నిజాన్ని ఎప్పటికీ తెలియనివ్వనని నాకు మాట ఇయ్యి వైదేహీ!" అంది ప్రభ.

"సరే!" అంది బ్యాగ్ సర్దుకుంటూ.

'ఇప్పటికైనా రమ్యకి నిజం చెప్పకపోతే భగవంతుడు నన్ను క్షమించడు' మనసులో మాత్రం అనుకుంది.

★ ★ ★

"హరీ! చాలా నెలలుగా నీకో విషయం చెప్పాలనుకుంటున్నాను. నువ్వు చిన్నపిల్లాడివని, ఆ విషయాన్ని డైజెస్ట్ చేసుకోలేవని చెప్పలేదు" ఆ రాత్రి హరి తనకి ఫోన్ చేసినప్పుడు, అంది రమ్య.

"పోవే! నువ్వు మహా పెద్దదానివి. నాకంటే అయిదు నిముషాలు పెద్దదానివి. అంతేగా? " హరీ వేళాకోళంగా అన్నాడు.

"హరీ! ఇయామ్ సీరియస్!"

"ఓకే! చెప్పు!"

"నువ్వనుకుంటున్నట్టు మన నాన్న నారాయణరావు కాదు"

"నాకు తెలుసు" నిదానంగా అన్నాడు.

"తెలుసా? " షాకయిపోయింది.

"ఎలా తెలుసు? "

"అక్కా! అందరూ నిన్ను కామేశ్వర్రావు గారమ్మాయివా అని అడుగుతున్నారని ఏడ్చేదానివి కదా! నిన్ను అడిగిన వాళ్ళు నీ తమ్ముడినైన నన్ను అడగలేదనా నీ ఊహ? నేను ఇంజనీరింగ్ చదువుతుం డగా ఒకసారి సెలవులకి ఇంటికొచ్చిన ప్పుడు నువ్వే స్వయంగా నారాయణరావు మన నాన్న కాదు, గార్డియన్ అని చెప్పావు. గుర్తుందా? అప్పుడు నీ మాట లపై నమ్మకం కలిగింది. కాని నాన్నగారు మనపై చూపించిన ప్రేమ ఎవరేమను కున్నా ఆయనే నా తండ్రి అని నా నమ్మ కాన్ని మరింత బలపరిచింది."

"కాదురా! ప్రభ మనని..." రమ్య ఇంకా ఏదో చెప్పబోతుండగా అడ్డుపడ్డాడు.

"అమ్మ తప్పుచేసి వుండదు. ఎందుకంటే ఈ ప్రపంచంలో ఏ అమ్మా తప్పు చెయ్యదు. చేసినా ఏదో బలహీన క్షణంలో చేసి వుండచ్చు. కాని పదే పదే తప్పు చేసేంత నీతి లేనిది కాదు."

"అది కాదురా!" రమ్య ఏదో చెప్పబో యింది.

"అక్కా! నువ్వెన్నయినా చెప్పు, నువ్వెన్ని చెప్పినా నాకు అమ్మానాన్నలపై కోపం రావడం లేదు. నేను వాళ్ళని ద్వేషించ లేను" హరి ఫోన్ పెట్టేసాడు.

రమ్య అసహాయమైన కోపంతో ఉడికి పోతోంది. తనెంత చెప్పినా వినడేం? అసలు తను చెప్పేది పూర్తిగా వినకుండా ఏదేదో మాట్లాడతాడు. ఛ!

రెండురోజుల తరువాత తన దగ్గరకొ చ్చిన వైదేహిని చూసి సంభ్రమంతో తల మునకలవుతూనే చిరునవ్వుతో ఆహ్వానిం చింది.

"హలో ఆంటీ! ఎలా వున్నారు? "

"నువ్వెలా వున్నావు? నీ జాబ్ ఎలా వుంది? "

"బాగుంది ఆంటీ!"

"జీతమెంత? మీ అమ్మనాన్నలు నీపై ఖర్చు పెట్టిన డబ్బుని ఎన్నాళ్లలో తీర్చగ లవ్? "

ఆమె రాకలోని ఆంతర్యాన్ని ఊహిస్తున్న రమ్య, ఆమె అలా అడగడంతో నిటారుగా అయింది.

"ఓ! మీరు నారాయణరావుగారి రాయ బారిగా వచ్చారా? " వ్యంగ్యంగా అడిగింది.

వైదేహి చెయ్యెత్తి ఆమె చెంప ఛెళ్ళుమ నేలా కొట్టింది.

"నన్నెందుకు కొట్టారు? నాపై మీకేం హక్కుంది? " అరిచింది రమ్య.

"నీకు జన్మనిచ్చిన తల్లిగా నిన్ను కొట్టే అధికారం, హక్కు నాకు వున్నాయో లేవో తెలియదు కాని, నీకు కనువిప్పు కలిగించే బాధ్యత మాత్రం వుంది" నిదానంగా తొణ క్కుండా అంది.

"నువ్వు నాజన్మనిచ్చిన తల్లివా? ప్రభని సేవ్ చెయ్యడానికి కొత్త కథ చెబుతు న్నావా? "

"అవును. కథలాంటిదే నా గతం. నిజా నికి నువ్వు మీ అమ్మ డైరీని చదివి ఆమెని అసహ్యించుకుని, ఆమెకి దూరమయిన ప్పుడే చెప్పవలసింది. కాని మీ అమ్మ చెప్ప వద్దని నా దగ్గర మాట తీసుకుంది. అక్రమ సంతానంగా ముద్రపడి లోకం హేళనని ఎదుర్కొని అప్పటికే కుమిలిపో తున్న నువ్వు తండ్రెవరో తెలియని బిడ్డ వని తెలిస్తే తట్టుకోలేవని మీ అమ్మ చెప్ప వద్దంది. రమ్యా! నువ్వు మానసికంగా ఎప్పుడో ఎదిగిపోయావు. మీ అమ్మ గతంతో ముడిపడివున్న నా గతాన్ని విని అర్థం చేసుకోగలవనే అనుకుంటున్నాను" అని వైదేహి చెప్పడం మొదలు పెట్టింది.

రమ్య ముఖంలో రకరకాల భావాలు

# కాప్షన్ మీదే - 13




ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 18

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com

ఉత్తమ వ్యాఖ్య :

అపరేషన్ సక్సెస్
ఫలం దక్కలేదు 'ఛస్!'

-ఎ.పద్మప్రియ,
కూకట్‌పల్లి, హైదరాబాద్



## కాప్షన్ మీదే - 12

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

అనుకున్నదొకటి ఐనదొకటి...
బోల్తాపడ్డావులే బుల్‌బుల్ రాజా!

– నేమాన సుభాష్‌చంద్రబోస్,
ఇలిసిపురం జంక్షన్, శ్రీకాకుళం

ఏమిటో ఈ మాయ!
పండు పడకపాయె
బాణం చిక్కకపాయె!!

– రంగు చక్రపాణి, హన్మకొండ

అదరహో, గురి తప్పలేదు!
అయ్యోపాపం, ఫలం దక్కలేదు!

– టి.ప్రసాద్, చెన్నై

తానొకటి తలచిన
దైవమొకటి తలచును

– అనుముల శివాణి,
కిషన్‌పుర, హన్మకొండ

సుళ్ళు తిరుగుతున్నాయి.

"నీ దగ్గర ఏదీ దాచకుండా నిజం చెప్పేను. ఇన్నేళ్ల తరువాత నేను నీ కన్న తల్లిననే నిజం తెలిసి నన్ను నీ తల్లిగా స్వీకరించమని అడగను. కాని, ఇప్పటికైనా మీ అమ్మానాన్నల పట్ల నువ్వెంత తప్పుచే శావో తెలుసుకుని వాళ్లని క్షమించమని అడగకపోతే భగవంతుడు కూడా నిన్ను క్షమించడు. మాతృత్వం సిగ్గుపడుతుంది. అసలా పదానికి అర్థమే లేకుండా పోతుంది."

అమ్మ! జన్మనివ్వకపోయినా తనకి మాతృ మమకారాన్ని పంచిపెట్టింది. అమ్మ ప్రేమలోని తియ్యదనాన్ని అందిం చింది. తల్లి మమతని, తల్లి మనసుని తెలి యచేసింది. అలాంటి అమ్మపట్ల తనెంత అమానుషంగా ప్రవర్తించానో!

తను అడుగులు వేస్తుంటే చెయ్యి పట్టు కుని ఆసరా ఇచ్చి, తప్పటడుగులు వేసి తను పడిపోయి దెబ్బ తగిలించుకుంటే ఆ దెబ్బ తనకే తగిలిందన్నట్లు విలవిలలాడిన నాన్న మనసుని ఈటెల్లాంటి మాటలతో ఎంత గాయ పరిచానో!

రమ్య వెక్కివెక్కి ఏడుస్తోంది. ఎనిమిది సంవత్సరాలు తన ప్రవర్తనతో వాళ్లని హింసించినందుకు కాదు.. వాళ్ళ ప్రేమని ఆస్వాదించకుండా తనేం కోల్పోయిందో తెలిసి ఏడుస్తోంది. కన్నీటి వెల్లువలో ఆమె మనసులోని ద్వేషం, నిరసన, తిర స్కారంలాంటి ప్రతికూల భావాలన్నీ కొట్టు కుపోయాయి.

★ ★ ★

ప్రభ కిచెన్‌లో పాయసం చేస్తోంది. బెడ్‌రూమ్ తలుపు ఓరగా తీసి, "అమ్మా" అని పిలిచింది రమ్య.

"ఆఁ! వస్తున్నానమ్మా!" ఆమె స్టవ్ సిమ్‌లో పెట్టి వచ్చింది.

"చీర నువ్వు కట్టమ్మా! నాకు సరిగ్గా రావడంలేదు"

"అలాగే" ప్రభ చిరునవ్వుతో లోపలికి వెళ్ళి రమ్యకి అందంగా, పొందిగ్గా చీర కట్టింది. మొదటిసారి చీర కట్టుకున్న రమ్య కుచ్చెళ్లు పాదాలకి అడ్డుపడుతుంటే జాగ్రత్తగా నడుస్తూ హాల్లోకి వచ్చింది. తన గుండెలమీద ఆడుకున్న చిట్టితల్లి, చీర కట్టుకునేంత పెద్దదయిపోయిందా అని కళ్ళ నిండుగా మురిపెంగా చూసుకుంటు న్నాడు నారాయణరావు.

"నాన్నా! ఇలా అమ్మ పక్కన నిలబడు"

"దేనికమ్మా? "

"నిలబడు చెబుతాను"

అతను వచ్చి భార్య పక్కన నిలబడ్డాడు. రమ్య ఆ ఇద్దరికీ పాదాభివందనం చేసింది. కూతురిని మనసులోనే దీవి స్తున్న ఆ ఇద్దరి కళ్లలో ఆనందబాష్పాలు.

ఇంతలో ఫోన్ మోగింది. నారాయణ రావు ఫోన్ తియ్యబోయాడు. "హరి అయి వుంటాడు. నేను ముందు మాట్లాడుతాను నాన్నా, ప్లీజ్"

"సరే!"

రమ్య ఫోన్ ఎత్తింది. ఆమె అంచనా తప్పలేదు. హరి ఫోన్‌లో ఆమె స్వరం విని "అక్కా! నువ్వు ఇక్కడ..." సంభ్రమంగా అడిగేడు.

ఆమె సమాధానం చెప్పకుండా "హేపీ బర్త్‌డేరా! మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే! ఇదిగో నాన్నతో మాట్లాడు" అని,

"నాన్నా. హరి ఫోన్" అంది.

నారాయణరావు ఫోన్ తీసుకున్నాడు. అతను వాడితో మాట్లాడుతుంటే రమ్య ఇవతలికి వచ్చి తన సెల్‌లోంచి నాయన మ్మకి ఫోన్ చేసింది. అవతల ఆవిడ 'హలో!' అనగానే, "బామ్మా! నేను రమ్యని" అంది.

అనూహ్యంగా మనుమరాలు తనకి ఫోన్ చెయ్యడంతో ఆవిడ నిరుత్తరురాల

యింది.

"ఇవాళ నా బర్త్‌డే బామ్మా! నాకేం ప్రెజంటేషనిస్తావ్? "

"నువ్వేం కావాలంటే అది" ఆవిడ స్వరంలో దుఃఖం గరగరలాడింది.

"నువ్విక్కడికి వచ్చెయ్యి బామ్మా! అదే నువ్వు నాకిచ్చే కానుక"

"నేను రాలేనురా తల్లీ!"

"ఎందుకని? "

"చేసిన పాపానికి నాకై నేను విధించు కున్న శిక్ష ఇది" గాద్గదికంగా అంది.

"నువ్వు ఇంతవరకు అనుభవించిన శిక్ష చాలు బామ్మా! నన్నెంతో ప్రేమించే మిమ్మల్ని ద్వేషించి దూరం చేసుకుని నన్ను నేను ఇన్నేళ్ళు శిక్షించుకున్నాను? అది ఎంత నరకమో అనుభవించిన నాకు తెలుసు. వచ్చెయ్యి బామ్మా, ప్లీజ్!"

"సరే"!

"నాన్నా!" రమ్య ఫోన్ ఆఫ్ బటన్ నొక్కి ఆనందాతిరేకంతో పిలిచింది. అప్పటికి అతను హరితో ఫోన్‌లో మాట్లాడ్డం పూర్తయింది.

"ఏమిటమ్మా"

"బామ్మ ఇక్కడికొచ్చేస్తానంటోంది. వెంటనే వెళ్ళి తీసుకొచ్చెయ్యి".

"అలాగేనమ్మా!" అన్నాడతను కన్నీళ్ళతో. దుఃఖంతోనే కాదు ఆనందంతో కూడా కళ్ళు వర్షిస్తాయి.

కిచెన్‌లో ప్రభ పాయసం చేస్తోంది. వైదేహి ఏలకుల్ని పొడిచేస్తోంది.

"రమ్య మళ్ళీ ఇక్కడికొస్తుందని, మాకు చేరువ అవుతుందని కలలో కూడా అనుకోలేదు. నువ్వు దానికి నిజం చెప్పకపోయి వుంటే మా మధ్య అఘాతం ఎప్పటికీ తొలగిపోయేది కాదు" అంది ప్రభ.

"నేనొకటి చెప్తే ఏమీ అనుకోవుగా? "

"చెప్పు"

"మీరు సాధ్యమైనంత తొందరలో ఈ ఊరినుంచి దూరంగా వెళ్ళిపోవడం మంచిది. మీరు చాలా ఏళ్ళ నుంచి ఇక్కడే ఉంటున్నారు. అటు పట్నం, ఇటు పల్లెకాని ఈ ఊళ్ళో చాలామందికి నీ గతం తెలుసు. తెలియని వాళ్ళకి తెలిసినవాళ్ళు చెప్పే ప్రమాదం వుంది. ఈ మనుషుల మధ్య రమ్య ఇమడలేదు."

"నిజమే! ఆయనతో మాట్లాడాలి" అంది ప్రభ సాలోచనగా.

రమ్య వంటింట్లోకొచ్చింది.

"రమ్య చీరలో చాలా బాగుంది కదూ వైదేహీ? " మురిపెంగా కూతుర్ని చూస్తూ అంది ప్రభ.

"బాగుండటమా? చాలా చాలా బాగుంది. పెళ్ళికళ వచ్చేసింది. ఇంక సంబంధాలు చూడడమే తరువాయి. నా సర్కిల్‌లో తెలిసిన సంబంధం చూస్తాను" అంది వైదేహి.

"నాకేం వద్దు" అంది రమ్య మూతిముడిచి.

"రమ్య ప్రభాకర్‌ని ఇష్టపడుతోంది" అంది ప్రభ నవ్వుతూ.

"నీకెలా తెలుసు? " ఆశ్చర్యంగా అడిగింది.

"నా కూతురి, ఇష్టాయిష్టాలేమిటో నాకు తెలియవా? " అంది, ప్రేమగా కూతురిని చూస్తూ. రమ్య బుగ్గలలో పూసిన సిగ్గుల గులాబీలు ప్రభ మాటలు నిజమని నిర్ధారించాయి.

రమ్య ప్రభాకర్‌కి రాసిన సంతకంలేని ప్రేమలేఖని ఆమె గదిలో టేబిల్ మీద చూసిన ప్రభ ఆ ప్రస్తావన తీసుకురావడానికి అదే మంచి సమయం అనుకుంది.

"ఏం రమ్యా? ప్రభాకర్‌తో మాట్లాడమంటావా? "

"పోమ్మా" అని రమ్య సిగ్గుతో ఎర్రబడిన ముఖానికి తల్లి భుజాన్ని ఆచ్ఛాదనగా చేసుకుంది. ©




# జెర్మినల్

**మా**ర్చి, 1866లో ప్రారంభమవుతుంది కథ. ఫ్రెంచి కాలెండర్ ప్రకారం మార్చి రెండోపక్షం, ఏప్రిల్ ప్రథమపక్షం కలిస్తే 'జెర్మినల్' నెల. అప్పటికి వర్షాలు పడి నేల చిత్తడిగా మారుతుంది. విత్తనాలు నాటటానికి అనువైన కాలమది. 'కార్మికులు వర్గచైతన్యంతో, సమిష్టి ఉద్యమాలతో విప్లవ బీజాలు నాటుతున్నారు' అనే దానికి ప్రతీక. రైల్వేలో పనిచేస్తూ పైఅధికారి మీద చేయి చేసుకున్న ఫలితంగా ఉద్యోగం పోగొట్టుకున్న కథానాయకుడు ఎటీన్ లాంటీర్ పొట్ట చేతపట్టుకుని బొగ్గు గనులున్న 'మాంట్సూ' గ్రామానికి చేరుకుంటాడు. కార్మికుల పూరిపాకలతో ఊరంతా అప్పటికే పెద్ద మురికివాడలా మారిపోయింది. వృద్ధ కార్మికుడు మాహూ అతణ్ణి చేరదీసి, బొగ్గు బళ్లులాగే పని ఇప్పిస్తాడు.

ఎటీన్ ఆదర్శ కార్మికుడు. కష్టపడి పని చేస్తాడు. ఉద్యమకారుల పరిచయంతో సోషలిస్టు మూలసూత్రాలు అవగాహన చేసుకుంటాడు. ఓ రష్యన్ అనార్కిస్ట్ విప్లవకారుడు సువారైన్ ద్వారా పోరాటాలలో హింస అనివార్యమని తెలుసుకుంటాడు.

తోటి కార్మికుల మధ్య ఎటీన్‌కు పలుకుబడి పెరుగుతుంది. తమ సమస్యలన్నీ అతడితో చెప్పుకుంటారు. యాజమాన్యంతో చర్చలు జరపాలంటే అతనే వెళ్లాలి. ఎన్నికలు జరగకపోయినా, ఎటీన్‌ను నాయకుడిగా గుర్తించారందరూ. కూలీ పనితో, ఉద్యమ కృషితో, అలసి సొలసి ఇంటికి చేరిన ఈ యువనాయకుడిని ప్రేమగా ఆదరిస్తుంది మాహూ కూతురు కాథరిన్. ఎటీన్ ఆమెతో ప్రేమలో పడతాడు. అయితే మరో కూలీ, వ్యసనపరుడు చవాల్ కూడా ఆమె తనకే కావాలని, ఎటీన్ మీద ద్వేషం పెంచుకుంటాడు. నిత్యం దోపిడీకి గురవుతూ, దుర్భర జీవితాలీడుస్తున్న కార్మికులే నేపథ్యంగా ఈ ముక్కోణపు ప్రేమకథ కొనసాగుతుంది. దయలేని ప్రభువులు పెట్టుబడిదారులు. రోజంతా ఎముకలు అరిగే



# పెట్టుబడికి, శ్రమకు మధ్య సంఘర్షణ

తొలిసారిగా 'జెర్మినల్' నవల జిల్ బ్లాస్ పత్రికలో సీరియల్‌గా అచ్చయింది. జోలా రచనలన్నింటిలోనూ అత్యుత్తమమైంది. కార్మికులకూ, పెట్టుబడిదారులకూ మధ్య ఘర్షణను కథావస్తువుగా మలిచిన ఇది 'లా రూగాన్ మకార్' మాలికలో 13వ నవల. నల్ల బంగారం గని కార్మికుల గురించిన ఈ నవల నేపథ్యంలో ఎప్పుడూ నలుపు పులుముకుని వుంటుంది. నేల నలుపు, పరిసరాలు నలుపు. మనుషుల మొహాలు నలుపు. బొగ్గు పేరుకుపోయిన ఊపిరితిత్తులు నలుపు. ఆకలికి మాడి బొగ్గులా మారిన వాళ్ల జీవితాలే నలుపు. పెట్టుబడిదారుల మొహాలు నిగనిగ మెరిసినా, వాళ్ల ఆలోచనలు నలుపు. సమ్మెకాలంలో మాత్రం, కార్మికుల క్రోధాగ్ని శిఖలతో ఆకాశం ఎరుపెక్కుతుంది. గజగజ వణికించే చలిలోనూ నెత్తురు సలసలా కాగుతుంది. నిజానికి పెట్టుబడిదారులు దుర్మార్గులు కారు. కానీ పెట్టుబడే వాళ్లను కార్మికుల పట్ల జలగలుగా మారుస్తుంది. ఈ నవలలో సగం కంటే ఎక్కువగా సమ్మె సాగిన క్రమాన్నే చిత్రించాడు రచయిత. వ్యక్తులను గురించి కాక, కార్మిక సమూహాల సమిష్టి కార్యాచరణను వర్ణించటంలో ఎమీల్ జోలా ప్రతిభ అసామాన్యమైనదనేది విమర్శకుల ప్రశంస.

టట్టు పనిచేసినా అర్థాకలి బతుకులే. కూలీ దొరకని రోజున పస్తులుండాల్సిందే. ఇక పసిపిల్లల, వృద్ధుల కష్టాలు వర్ణనాతీతం. చివరకు అనివార్య పరిస్థితుల్లో, కూలీ పెంచకపోతే సమ్మె చేస్తామంటారు కొందరు. అయితే కార్మికుల్లో 'నల్లగొర్రెలు' కూడా ఉంటారని స్పష్టం చేస్తాడు రచయిత. అందర్నీ సంతృప్తిపరచాలంటే మొదట యజమానులకు వినతిపత్రం సమర్పించాలి. ఊరేగింపు ఆఫీసు భవనం దిశగా కదుల్తుంది. కొన్ని సెంటైములు పెంచితే చాలు. కాని యజమానులెక్కడ? ఎవరీ అదృశ్య పెట్టుబడిదారులు? ఎవరితో మొరపెట్టుకోవాలి? ఆ వివరాలేవీ తనకు తెలియదంటాడు మేనేజర్ హెనెబూ.

"మా అర్జీ స్వీకరించండి!"




"నాకు ఆ అధికారం లేదు. కంపెనీ స్టాక్ హోల్డర్లు పారిస్‌లో వుంటారు. వాళ్లెవరో నాకూ తెలియదు."

పెట్టుబడి కనిపించని భూతం. దానికి న్యాయం, ధర్మం, జాలి, సానుభూతి లేవు. రోజూ పెరిగే లాభాలు తప్ప మరేమీ దాని ఆకలి తీర్చలేవు.

'కేవలం ఐదు సెంటైములు పెంచండి. మా మొర వినండి' అంటారు. 'అలాగా' అంటూ వికటంగా నవ్వాడు మేనేజర్.

'మీ కోరిక న్యాయసమ్మతమే. కాని కూలీపెంచే అధికారం నాకు లేదు. మొదట నేను ఉద్యోగంలో కొనసాగితే కదా, మీతో పనిచేయించేది. కూలీ పెంచిన మరుక్షణం నన్ను డిస్మిస్ చేస్తారు. రెండేళ్ల క్రితం సమ్మె చేసినప్పుడు




చతుర, విపుల చందా కట్టాలనుకుంటున్నారా?

సంప్రదించండి:

ఈనాడు టోల్ ఫ్రీ నెం: 18004258888

లేదా vipula.chatura@gmail.com



# ఎమీల్ జోలా ( 1840 - 1902 )

సంచలనాత్మక రచయితగా, ఫ్రాన్స్ రాజకీయాల్లో మత ఛాందసానికి వ్యతిరేకంగా ఒంటరి పోరాటం చేసిన సామాజిక విప్లవకారుడు ఎమీల్ జోలా. ఇటాలియన్ తండ్రికీ, ఫ్రెంచి తల్లికీ పారిస్‌లో జన్మించాడు జోలా. ఏడేళ్లప్పుడే తండ్రి మరణించడంతో, నగర జీవితం భారమై గ్రామీణ ప్రాంతమైన అయిక్స్-ఎన్-ప్రావిన్స్‌లో స్థిరపడింది కుటుంబం. 1858లో తిరిగి పారిస్ చేరిన ఎమీల్, ప్రముఖ చిత్రకారుడు పాల్ సిజేన్‌తో స్నేహం చేశాడు.

జోలా కొంతకాలం ప్రచురణకర్త దగ్గర విలేఖరిగా సాహిత్య, కళాసమీక్షలు, రాజకీయ వ్యాఖ్యానాలతో జీవితం ప్రారంభించాడు. విరివిగా కథలూ, నాటకాలూ రాశాడుగానీ పేరు రాలేదు. 1865లో రాసిన ఆత్మకథాత్మక నవల 'కన్‌ఫెషన్స్ ఆఫ్ క్లాడ్' పోలీసుల దృష్టి నాకర్షించడంతో ఉన్న ఉద్యోగం కాస్తా ఊడింది.

'థెరీస్ రాకిన్' నవల 1867లో విమర్శకుల మన్ననలు పొందింది. పబ్లిషర్లు కూడా జోలాను అగ్రశ్రేణి రచయితగా గుర్తించారు. ఆ ఏడాదే ఇరవై సంపుటాల నవలా మాలిక రాయటానికి ఒప్పందం కుదుర్చుకున్నాడు. సెకండ్ ఎంపైర్‌లో 1852-1870 మధ్య నెపోలియన్ పరిపాలనా కాలంలో వచ్చిన ఆర్థిక, సామాజిక, రాజకీయ మార్పులకు అద్దం పడుతూ ఒక కుటుంబంలోని అయిదు తరాల జీవితాల్ని చిత్రించాలి. అదే 'లా రూగాన్ మకార్' సిరీస్. అంతకుముందు తన 'హ్యూమన్ కామెడీ' నవలల్లో కూడా బాల్జాక్ ఇలాంటి ప్రయత్నమే చేశాడు. ఒక పరిశోధకునిగా సామాజిక పరిణామాల్ని పరిశీలించటం జోలా లక్ష్యం. పరిసరాలు, హింస, తాగుడు, వ్యభిచారం ప్రజల జీవితాలను నరకప్రాయం చేశాయి. ఈ రుగ్మతలకు కారణాలను విశ్లేషించాలి. మర్యాదస్తులైన రూగాన్, అప్రతిష్టపాలైన మకార్ కుటుంబసభ్యులే నవలల్లో పాత్రలు.

ఈ సిరీస్‌లో వచ్చిన తొలి నవల 'తాగుబోతు' రచయితకు కాసుల పంట కురిపించింది. అతని రచనలకు విక్టర్ హ్యూగో కన్నా ఎక్కువ పారితోషికం లభించింది. పారిస్ సమీపంలో లగ్జరీ విల్లా కట్టుకున్నాడు. ప్రముఖ రచయితలు గైడిమపాసా, జోరిస్ కార్ల్ హుస్మాన్స్ అతని మిత్రులు. ఆ తర్వాత 1885లో వచ్చిన 'జెర్మినల్', మూడు నగరాల

కూలీరేటు పెంచటం కన్న గనులు మూసెయ్యటమే మేలన్నారు స్టాక్‌హోల్డర్లు. నా మాట విని, ఈసారికి సమ్మె విరమించి పనిలో చేరండి. నేనూ మీలాగ జీతగాణ్ణే. ఎవరికీ అడిగినంత దొరకదు. ఉన్నది చాలనుకునేవాళ్లే పనిలో చేరండి. రక్షణ కల్పిస్తాం' అంటూ కార్మికులను చీల్చటానికి ప్రయత్నించాడు మేనేజర్.

యజమానులకు తొత్తులుగా ఉన్న కొందరు పనిలో చేరటానికి ప్రయత్నించారు గాని తోటి కార్మికులు వాళ్లకు దేహశుద్ధి చేసి పంపించారు.

తుప్పు పట్టిన ఒక ట్రంకు పెట్టె పైకెక్కి 'కామ్రేడ్స్' అన్నాడు ఎటీన్. ఇక తమకు మిగిలిన ఏకైక ఆయుధం సమ్మె.

"మనమంతా వేతన బానిసలం. బొగ్గు వెలికి తీస్తున్నది మనం. అందువల్ల గని మనకే చెందుతుంది. సముద్రం ఎవరిది? మత్స్యకారులది. భూమి ఎవరిది? దున్నేవాడిది. మరి గనులెందుకు మనవి కావు? వాళ్లు డబ్బులతో కొన్నారు. ఏళ్ల తరబడి మన నెత్తురు చెమటలతో తడిసిందే ఈ నేల. దానికి విలువ లేదా..? " అని చైతన్య పరిచాడు.

కూలీ దండు కదిలింది. అందరికీ మార్చింగ్ ఆర్డర్స్ ఇచ్చాడు ఎటీన్. ఒకడు బూర వూదాడు. స్త్రీలు కర్రలు పట్టుకుని నడిచారు. అందరూ చింకి పాతలలో నడు

నవలలు- లార్డ్స్(1894), రోమ్ (1896), పారిస్ (1897)లతో జోలా ప్రసిద్ధికెక్కాడు.

చిత్రకారుల విశృంఖల జీవితసరళిని ఎద్దేవా చేస్తూ రాసిన 'ది మాస్టర్ పీస్'(1886)తో సిజెన్‌తో స్నేహం చెడింది. 'ఇక సాధించవలసిందేమీ లేదు. రచయితగా కీర్తికిరీటం వరించింది. రాయకపోయినా, రాయల్టీలతో సుఖంగా గడిచిపోతుంది' అనుకుంటున్నప్పుడు జీవితాన్ని పణంగా పెట్టి ఓ అమాయకుడి కోసం న్యాయపోరాటం ప్రారంభించాడు జోలా.

'సైనిక రహస్యాలు చోరీచేసిన గూఢచారి' అనే అభియోగంతో ఒక యూదు ఆర్టిలరీ ఆఫీసర్ కెప్టెన్ ఆల్ఫ్రెడ్ డ్రేఫస్‌కు జీవితశిక్ష విధించి, ఫ్రెంచి గయానాలోని డెవిల్స్ ఐలాండ్‌కు బహిష్కరించారు. సమాజంలో చర్చి ప్రభుత్వ అధికారులలో యూదులపట్ల వున్న వ్యతిరేకతవల్లనే దురుద్దేశపూర్వకంగా అతణ్ణి బలిపశువును చేశారని వాదించాడు జోలా. 1898 జనవరి 13న ఫ్రెంచి దినపత్రిక లరోర్‌లో ప్రచురితమైన 'దేశాధ్యక్షుడికి జోలా బహిరంగ లేఖ' రాజకీయాల్లో భూకంపం సృష్టించింది. ఒక వ్యక్తి ప్రభుత్వ సార్వభౌమత్వాన్ని ప్రశ్నించటం అనూహ్యం! అత్యధికులు, ముఖ్యంగా మతగురువులు, సైనికాధికారులు జోలాను 'దేశద్రోహి' అన్నారు. అభ్యుదయవాదులు, ప్రముఖ రచయిత అనతోల్ ఫ్రాన్స్‌లాంటి కొద్దిమంది సమర్థించారు.

జోలా మీద పరువునష్టం దావావేసి, క్రిమినల్ కేసులు పెట్టింది ప్రభుత్వం. వివాదాలు సృష్టించడమే అతడి నైజం. ఫ్రెంచి ప్రముఖుల జాబితా లీజిన్ ఆఫ్ ఆనర్ నుండి పేరు తొలగించారు. జైలుశిక్ష పడుతుందని, దేశం విడిచి ఇంగ్లండులో తలదాచుకున్నాడు. 1899లో ప్రభుత్వ పతనం తర్వాతనే ఫ్రాన్స్‌కు వచ్చాడు. డ్రేఫస్‌కు క్షమాభిక్ష ప్రకటించింది ప్రభుత్వం. అంటే అతడు నేరం అంగీకరించినట్టే.

"ఇది అన్యాయం. అతడు నేరం చేయలేదు. ఎప్పుడో అప్పుడు నిజం బయటపడకతప్పదు" అన్నాడు జోలా. 1906లో సుప్రీంకోర్టు డ్రేఫస్‌ను నిర్దోషిగా ప్రకటించింది.

తన అరవై రెండో ఏట నిద్రలోనే కార్బన్ మోనాక్సైడ్ విషవాయు ప్రయోగంతో మరణించాడు జోలా. ఇది ప్రమాదమో, హత్యో చాలా కాలం తెలియలేదు. కొంతకాలం తర్వాత, రాజకీయ శత్రుత్వం కారణంగానే గాలి చొరబడకుండా పొగగొట్టం మూసివేశానని అంగీకరించాడు రూఫింగ్ కార్మికుడు.

థామస్ పెయిన్ 'రైట్స్ ఆఫ్ మాన్'తో 'జె అక్యూజ్'ను పోలుస్తారు. ఫ్రెంచి సామాజిక, రాజకీయ, సాంస్కృతిక రంగంలో జోలాతో ప్రారంభమైన రచయితల ముఖ్య పాత్ర 1960లలో సార్త్ర్, కామూల దాకా కొనసాగింది.

స్తున్న అస్తి పంజరాలే. ఆత్మవిశ్వాసమే వాళ్ల జెండా. సైనికులు కాల్పులు జరుపుతారా? జరపనీ. ఈనాటితో ఆకలి సమస్య తీరుతుంది. ఎంతమందిని పొట్టన పెట్టుకుంటారు? ఆడవాళ్లమీద కూడా తుపాకులెక్కుపెడతారా? పిరికి పందలు. అందరినోటా ఒకే మాట.

"బ్రెడ్ బ్రెడ్ బ్రెడ్"

మిట్టమధ్యాహ్నామైంది. రోజులతరబడి తిండిలేదు. ఆకలిమంటలు చెలరేగాయి.

గనులు ధ్వంసం చెయ్యాలి. ఇక మనం చెయ్యాల్సింది పనికాదు. బ్రెడ్ సంపాదించటమే. కొందరు ఎండిన బ్రెడ్ ముక్కల్ని దాచుకుని తిన్నారుగాని ఎటీన్ నీళ్లు కూడా ముట్టలేదు.

గని వద్దకు చేరారు.

"నీళ్ల పంపు లాగెయ్యండి" అంటూ అరిచారెవరో.

ఎటీన్ అడ్డు తగలబోయాడు. కాని అతడి మాటలు వినే స్థితిలో లేరు సమ్మెకారులు. పదివేలమంది శ్రామికుల యుద్ధ శంఖారావమది. అందరూ అలసిపోయారు. అయినా ఉత్సాహం వురకలేస్తోంది. అటోయిటో తేలిపోవాలి. లాఠీలు, మాటాలు తమనాపలేవు. అంతిమ విజయం కార్మికులదే.

మాంట్సూ నుండి మార్షీన్స్ వైపు కదిలింది కార్మికసైన్యం. అడ్డు తగిలినవాళ్లను

## వాస్తవాలు రాసి కళ్లు తెరిపించాలి

'తాగుబోతు' (1877) నవలలో కార్మికుల్ని వ్యసనపరులుగా చిత్రించినందుకు సోషలిస్టులు, ఇతర మేధావులు జోలా అవగాహనా రాహిత్యాన్ని విమర్శించారు. అంతకు ముందే 1870-71లో తొలి కమ్యూన్ ఏర్పడినా కమ్యూనిస్టులు అనుకున్న ఫలితాలు సాధించలేకపోయారు. ఎక్కువ కూలీ, తక్కువ పనిగంటలు కావాలంటారు కార్మికులు. ఎవరేమైపోయినా ఫరవాలేదు, లాభాలే తమ పరమావధి అని భీష్మించుక్కూర్చుంటారు కార్పొరేషన్ల షేర్ హోల్డర్లు. 1866లో కార్మికులు నాటిన తిరుగుబాటు విత్తనమే 1870 నాటికి 'పారిస్ కమ్యూన్' మహావృక్షంగా ఎదిగింది.

'సెంటిమెంట్ కాదు. వాస్తవాలు రాసి పాఠకుల కళ్లు తెరిపించాలి' అంటాడు జోలా. కార్మికులు కష్టపడుతున్నారని ప్రత్యేకంగా చెప్పటమెందుకు? దానినుంచి విముక్తి ఎలా అనేది ముఖ్యం. తిండిలేక, చలికి వణుకుతూ, కట్టుకోవటానికీ, కప్పుకోవటానికీ లేక పిల్లలు, వృద్ధులు జబ్బులతో, వైద్య సహాయం కరువై, మానవుడు సృష్టించిన అడవిలో పెట్టుబడిదారులనే క్రూర జంతువులకు ఆహారంగా మారిన సంపద సృష్టికర్తలు కార్మికులు. లాభాలార్జించి పెట్టేవాళ్లే ఆకలికి మాడుతున్నారు. పదునైన ఉపమానాలు వాడటం జోలా ప్రత్యేకత. ఉదాహరణకు 'గని ముఖద్వారం బ్రహ్మరాక్షసి నోరులా తెరుచుకుంది.' అలాగే మాంట్సూకు 'చిల్లర నాణాల కొండ' అనే అర్థమూ ఉంది. కార్మికులు దీన్ని తొలుస్తున్నారు, సెంటైముల కోసం.

తోడేళ్లలా చీల్చేస్తారు వాళ్లు. కూడు పెట్టని కూలీ పనులెందుకు? దారిలో దుకాణాలు తగలబెట్టారు. అద్దాలు పగలగొట్టారు. ఉల్లినాటిన పొలాలు ధ్వంసం చేశారు. తోటలలో చెట్లు పీకేశారు.

"కార్మికులంటే పిండారీ మూకలే" అనుకున్నారు తలుపులు మూసుకున్న మర్యాదస్తులు, వ్యాపారస్తులు.

"కామ్రేడ్స్ హింసకు దిగవద్దు. ఉద్యమం పక్కదారి పడుతుంది. సంయమనం పాటించండి. ఈ సంపద మన శ్రమఫలితమే. మన ఆస్తిని మనమెందుకు నాశనం చేసుకుంటాం? ఉత్పత్తి సాధనాలు మన స్వాధీనంలో ఉన్నంతవరకూ మనమే దీనికి యజమానులం" అంటూ తనకిష్టమైన పల్లవి అందుకున్నాడు ఎటీన్. సమ్మెలన్నీ, మొదలు ఆర్థిక ప్రయోజనాలతో ఎరవేస్తాయి. తరువాత రాజకీయ రంగు పులుముకుని అధికారం మాదే" అంటారు నాయకులు. సంపద సమిష్టిగా అందరికీ చెందాలి. కాని ఆ ఆశయం అమలు జరిగేదెలాగో ఇంతవరకెవరూ స్పష్టంగా చెప్పలేదు. చర్చలు జరుగుతున్నాయి. వ్యాసాలు రాస్తున్నారు. ప్రస్తుతమున్న రాజ్యవ్యవస్థను కూల్చి అధికారంలోకి వస్తే, సంస్కరణలు చేస్తామంటారు. అప్పుడు ఉనికిలో ఉన్న సంకుచిత కుటుంబ వ్యవస్థకు బదులు స్వేచ్ఛా సంబంధాలు ఏర్పడతాయి. అందరికీ విద్య అందుబాటులోకి వస్తుంది. కుళ్లిన సమాజం అంతరించి నూతన మానవుడు ఆవిర్భవిస్తాడు" వివాహ వ్యవస్థను కూడా తీవ్రంగా విమర్శించాడు ఎటీన్. ఇరవయ్యో శతాబ్దంలో సమసమాజ స్థాపన తప్పదు.

ఆనందాతిరేకంతో, సముద్ర కెరటంలా ఉవ్వెత్తున లేచారు కార్మికులు.

"వ్యవస్థ ఇప్పుడే, ఇక్కడే మారాలి" అంటూ ఏక కంఠంతో నినదించారు.

దోపిడీదారులు ఎలుకల్లా కలుగుల్లో తలదాచుకున్నారు. శ్రమశక్తి విజయబావుటా ఎగరేసింది. సాయంత్రం నాల్గింటికే చీకటి పడింది. నాయకుల మనసుల్లో అనేక సందేహాలు! ఎంతకాలం సాగుతుందీ సమ్మె? ఏ పరిణామానికి దారితీస్తుంది? ఊరేగింపు కొనసాగింది.

ఈసారి 'బ్రెడ్, బ్రెడ్' అన్న అరుపులకు జవాబుగా కుక్కలు మాత్రమే మొరిగాయి.

ఈశాన్య ప్రాంతమంతా విస్తరించింది సమ్మె. సమ్మె నాయకుల కోసం అరెస్టు

## పరిశోధనే రచనకు ఆయువుపట్టు

వాస్తవ పరిస్థితులకు కథలు అద్దంపట్టాలంటే పరిశోధన ముఖ్యమని భావించిన తొలితరం రచయిత జోలా. సమాచార సేకరణ కోసం పుస్తక పరిజ్ఞానం మీద ఆధారపడక, కార్మికులతో మమేకమై వాళ్ల సమస్యలు అవగాహన చేసుకున్నాడు రచయిత. ఫిబ్రవరి 1884లో ఫ్రాన్స్, బెల్జియం సరిహద్దులో ఉన్న లాయిర్ ప్రాంతంలో బొగ్గుగని కార్మికుల సమ్మె జరిగింది. జోలా తన వామపక్ష రాజకీయ పరిచయాలతో అక్కడికెళ్లి సమ్మెకారులలో ఒకడిగా మారి ఆ పోరాట తీవ్రతను స్వయంగా అనుభవించాడు. వాళ్ల పూరిపాకల్లోనే నివసించి, రెండువేల అడుగుల లోతున్న గనులలోనికి దిగి, మీటింగులలో పాల్గొని, చవక మద్యం దుకాణాలతో వాళ్లతో కలసి తాగి, కథలు విని, పెట్టుబడిదారుల స్వార్థపూరితమైన కుట్రల విషాద పరిణామాల్ని కళ్లారా చూసి చలించిపోయాడు. 'పెట్టుబడిదారుల మీద కార్మికుల తిరుగుబాటు' గురించిన నవల అని నోట్ బుక్‌లో రాసుకున్నాడు.



వారెంట్లు జారీచేశారు పోలీసులు. పని స్తంభిస్తే, దేశ ఆర్థిక వ్యవస్థ ఏమవుతుంది? ఏ కొద్దిమంది సంపన్నులకో తప్ప, ఎవరికీ రెండు పూటలా తిండిలేదు. చిన్న వ్యాపారస్తులు దివాళా తీశారు. అనేక ఇతర పరిశ్రమలు మూతబడ్డాయి. కార్మికులను బలవంతంగా పనిలోంచి తీసేశారు. బొగ్గులేక కుంపట్లు వెలగలేదు. చలికి, పిల్లలు, వృద్ధులు మరణించారు. దేశ ఆర్థిక వ్యవస్థ పేకమేడలా కూలిపోయింది. అయినా గనుల యజమానులకు చీమకుట్టినట్లైనా లేదు. లాభాలు సంపాదించి పెట్టని ఉత్పత్తి ఎందుకు? సమ్మె చేస్తే విరిగేది కార్మికుల వెన్నెముకే.

సమ్మెకారులు గనుల్ని మూసేశారు. యజమానులు పోలీసుల, సైనికుల సహాయం కోరారు. కార్మికులు తాత్కాలికంగా వెనక్కు తగ్గక తప్పలేదు. ఈ ఓటమికి ఎటీనే బాధ్యుడన్నారు ప్రత్యర్థులు. కోపంతో గని ముఖ ద్వారం వద్దవున్న షాఫ్టు విరిచేశారు. ఎటీన్, కాథరిన్, చవాల్ గనిలో చిక్కుకుపోయారు. వాళ్లను సురక్షితంగా వెలుపలికి తీసుకురావటమే నవలలో క్లైమాక్స్ సన్నివేశం.

బొగ్గు మీద మంచుకురిసి నల్లగా మెరిసింది. గనులకు రక్షణగా నిలబడ్డారు సైనికులు. ఫ్రెంచి కార్మికులు సమ్మె చేస్తున్నారని బెల్జియన్ కార్మికులను దిగుమతి చేసుకున్నారు యజమానులు. సైనికులతో యుద్ధం చేయటం సాధ్యమా?

మాంట్సూలో జరిగిన కాల్పులు పారిస్‌లో ప్రతిధ్వనించాయి. నాలుగు రోజుల పాటు పత్రికల నిండా ఈ వార్తలే పతాక శీర్షికలు. పద్నాలుగు మంది మరణించారు. ఇరవైమంది గాయపడ్డారు. అనేక మందిని అరెస్టు చేశారు. 'ఇది దురదృష్టకరం' అంటూ మొసలి కన్నీళ్లు కార్చింది ప్రభుత్వం. సుదూరంగా, ఎక్కడో దేశ సరిహద్దుల్లో జరిగిన సంఘటన గనక ప్రజలు త్వరగానే మరచిపోతారు.

కంపెనీ డైరెక్టర్లు, కార్మికులకు అప్పీల్ చేస్తూ మాంట్సూలో పోస్టర్లంటించారు.

'జరిగింది మరచిపోండి- పనిలోకి తిరిగి రండి. సామరస్య పూర్వకంగా సమస్యలన్నీ చర్చించుకుందాం. మీరు సహకరిస్తామంటే, గనులు రేపు తిరిగి తెరుస్తాం. మీ సంక్షేమమే మా ధ్యేయం!'

దాని అర్థమేమిటో అందరికీ తెలుసు.

–ఎం.వసంత

# చతుర కతలు



## ఒక ఐడియా

పరంధామయ్య హైస్కూల్ హెడ్ మాస్టారుగా పనిచేసి రిటైరయ్యాడు. ఆయన ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత కూడాను. తను మారుతీనగర్‌లో ఒక మేడ కట్టుకొని, కింద పోర్షన్‌లో తను, పిల్లలు ఉంటూ, పైపోర్షన్‌కు టూలెట్ బోర్డు పెట్టాడు. ఎవరో వచ్చి తలుపు తట్టారు. వెళ్లి తలుపు తీసి చూసేసరికి ఏముంది? ఒకనాటి తన ప్రియ శిష్యుడు సుబ్బారావు. తన దగ్గరే చదువుకున్న వినయ విధేయతలు గల మంచి విద్యార్థి. ఇప్పుడు అతడు స్టేట్ బ్యాంకు మేనేజర్.

"టులెట్ బోర్డు చూసి వచ్చాను సార్" అన్నాడు.

వెంటనే పరంధామయ్య గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశాడు. ఆ గురుశిష్యులు ఇద్దరికీ ఒకేచోట నివసించే అవకాశం దొరికింది.

సుబ్బారావుకు ఏ ఇతర అలవాట్లు లేవు. సాయంత్రం బ్యాంకు పని అవగానే సరాసరి ఇంటికొచ్చేసి స్నానంచేసి, గురువుగారి దగ్గరకొచ్చి కాలక్షేపం చేసేవాడు. అతనొక గొప్ప బ్యాంకు మేనేజరు అయివుండి కూడ, గురువుగారి పట్ల ఎంతో వినయ విధేయతలు చూపించేవాడు. పాత రోజులను నెమరు వేసుకుంటూ, ఆ గురు శిష్యులు సాయం సమయాలు ఎంతో ఆనందంగా గడిపేవారు.

ఒకరోజు అర్ధరాత్రి ఒంటిగంటన్నర సమయంలో ఎవరో సుబ్బారావు ఇంటి తలుపు తట్టారు. సుబ్బారావుకు మెలకువచ్చి, లైటు వేసి, కళ్ళు నులుపుకుంటూ వెళ్లి తలుపు తెరిచాడు. ఇంకేముంది ఇద్దరు దొంగలు, కళ్ళకు నల్లగుడ్డలు కట్టుకొని, చేత్తో కత్తులు పట్టుకొని, సుబ్బారావును తోసుకుంటూ ఇంటిలో ప్రవేశించారు. సుబ్బారావు దంపతుల పీకలమీద కత్తులు పెట్టి, వారిని భయపెట్టి, ఇంట్లో వున్న బంగారం, వెండి, డబ్బు దస్కం మూటలు కట్టుకున్నారు.

అందులో రేపు బ్యాంకులో జమకట్టవలసిన క్యాష్ కూడా రెండు లక్షలు ఉంది. ఒక దొంగ కింద పోర్షన్ దగ్గరకెళ్లి, ఇంట్లో ప్రవేశించడానికి చాలా ప్రయత్నం చేశాడు. కాని వీలుపడలేదు. మరలా సుబ్బారావు దగ్గరకొచ్చి

"కింది పోర్షన్‌లో ఎవరుంటారు? " అని అడిగాడు.

"ఇంటి ఓనరు" చెప్పాడు సుబ్బారావు.

"నువ్వొచ్చి వాళ్ళను లేపు" దొంగ గద్దించాడు.

"చూడు దొంగబాబు, మీరు నా దగ్గర దోచుకున్న సొమ్మే నాలుగు, ఐదు లక్షలు ఉంటుంది. ఇంకా వాళ్ల ఇల్లు కూడ ఎందుకు? దయచేసి, ఈ సొమ్ముతో తృప్తిపడి వెళ్ళిరండి" అన్నాడు సుబ్బారావు. కాని దొంగలుససేమిరా అన్నారు. సుబ్బారావు ఎంత బతిమాలుతున్నా వినిపించుకోకుండా సుబ్బారావు చొక్కా కాలరు పట్టుకొని, కిందకు లాకెళ్లి పరంధామయ్యగారి ఇంటి తలుపు తట్టమన్నారు. ఇంక విధిలేక తలుపు తట్టడానికి ఒప్పుకున్నాడు సుబ్బారావు. అంతలో అతనికి ఒక మెరుపులాంటి ఐడియా వచ్చింది.

"ఒరేయ్ పరంధామయ్యా, ఒరేయ్ పరంధామయ్యా" అంటూ ఏకవచనంతో సంబోధిస్తూ, తలుపు తట్టాడు. పరంధామయ్యకు మెలకువ వచ్చింది.

"ఎవరు? " అన్నాడు పరంధామయ్య

"నేనేరా బ్యాంకు మేనేజరు సుబ్బారావును, మా ఇంటికి చుట్టాలొచ్చారు కాసిని పాలు కావాలి తలుపు తీయరా" అన్నాడు సుబ్బారావు. పరంధామయ్య లైటువేసి, గడియారంవైపు చూసాడు. టైం రెండూ పది.. ఎప్పుడూ తనపట్ల ఎంతో గౌరవం చూపే సుబ్బారావు అంతరాత్రి వేళ తనను 'ఒరేయ్' అని సంబోధించాడంటే, 'సమ్‌థింగ్ రాంగ్' అనుకున్నాడు పరంధామయ్య.

ఆయన మహామేధావికదా! ఆయనకు

# బాస్



తన మాంసం కొట్టులోకి వచ్చిన నల్లటి కుక్కని చూసి, దాన్ని తరమబోయి ఆగిపోయాడు వీరయ్య. దాని నోట్లో ఉన్న కాగితంమీద 'కిలో కోడి మాంసం' అని రాసివుంది. అందుకు సరిపడే డబ్బు కూడా ఆ కాగితానికి పిన్‌చేసి ఉంది. వీరయ్య ఆ డబ్బు తీసుకుని కిలో కోడిమాంసం తూచి, ప్లాస్టిక్‌బ్యాగ్‌లో వుంచి ఇస్తే, ఆ కుక్క బ్యాగ్‌ని నోట కరచుకుని వెళ్ళిపోసాగింది.

వీరయ్యకి ఆ కుక్క ఎవరిదో తెలుసుకోవాలనే ఆసక్తి కలిగి పనివాడిని షాపు చూస్తుండమని చెప్పి, దాన్ని అనుసరించాడు. ఆ కుక్క సరాసరి మూడు సందుల అవతల ఉన్న ఓ ఇంటిముందుకి వెళ్ళి ఆగింది. తలుపు వేసి ఉండటంతో ఓ కాలెత్తి కాలింగ్‌బెల్ నొక్కింది. తలుపు తెరచిన ఓ ముసలాయన ఆ కుక్కవంక కోపంగా చూశాడు. దాని నోట్లోని బ్యాగ్‌ను అందుకున్న ఆ ముసలాయనని వీరయ్య అడిగాడు.

"ఇది మీ కుక్కా? చాలా తెలివిగలది. దీన్ని టి.వి.లో చూపించవచ్చుగా? "

వెంటనే ఆ ముసలాయన కోపంగా చెప్పాడు.

"తెలివా, పాడా? ఇంటి తాళం చెవిని తీసుకెళ్ళమంటే మరచిపోవడం టామీకి ఇది రెండోసారి"

**నీతి:** చూసేవాళ్లకి మీరు చేసే పనులు అద్భుతంగా ఉండవచ్చు కాని, అవి మీ బాస్ అంచనాలకి ఎప్పుడూ తక్కువగానే ఉంటాయి.

– ఎం. ఊహ

---

విషయం అర్థమైంది. "వస్తున్నాను కంగారు పడకు" అన్నాడు.

పడుకొని నిద్రపోతున్న తన ఇద్దరు కొడుకుల్ని, జమాజెట్టిలాంటి తన ఇద్దరు మనవళ్ళను నిద్రలేపి, విషయం వివరించి ఇంట్లో ఉన్న కత్తి, కర్ర చేతికిచ్చి, దొడ్డి దారివెంట వాళ్లను బయటకు పంపించి, వచ్చి తలుపు తీశాడు. దొంగలు కత్తులతో ఇంటిలో ప్రవేశించి ఇంటిలో ఉన్న నగనట్రా మూటలు కట్టసాగారు. పది నిమిషాల్లో, పదిమంది యువకులు, కత్తులు కర్రలతో దొంగల ముందుకొచ్చి నుంచున్నారు. ఒక దొంగ కత్తి చూపించి బెదిరించబోయాడు. ఆంజనేయులు తన రూళ్ల కర్రతో దొంగ పిడికిలి మీద కొట్టాడు. దొంగ చేతిలో కత్తి కిందపడింది. మరలా దొంగ నెత్తిమీద ఒకటి వడ్డించాడు. రెండో దొంగ విషయం అర్థం చేసుకొని, కత్తి కిందపడేసి లొంగిపోయాడు. తరువాత పోలీసులకు ఫోను- విషయం షరా మామూలే. అయితే ఇద్దరు మేధావుల, మూగ ప్రణాళిక ముందు కర్రలు, కత్తులు, కండలు, ఎందుకు కొరగావని నిరూపణ అయింది. ఒక ఐడియా జీవితాన్నే మార్చేస్తుందో లేదో తెలియదుకాని, ప్రస్తుతం గురుశిష్యుల సొమ్ము దొంగలపాలు కాకుండా కాపాడింది.

కొసమెరుపు

(హటాత్తుగా ఆ పదిమంది ఎలా వచ్చారో దొంగలకు అర్థం కాలేదు. వచ్చిన పదిమంది సుబ్బారావు సమయస్ఫూర్తిని, పరంధామయ్యగారి మేధాసంపత్తిని తెగపొగిడారు.)

–డి.వి.భద్రారావు

✍ కథ వెనుక కథ

# మెలుపు నాది.. గెలుపు నాన్నది


డా॥ వేదగిరి రాంబాబు

కథ అంటే అపరిమిత మమకారంగల వ్యక్తి డాక్టర్ వేదగిరి రాంబాబు. ఆయన ప్రతిమాటలో 'కథకు ఏమైనా చేయాలి' అనే తపన వ్యక్తం అవుతుంటుంది. యాభై ఏడేళ్ల రాంబాబు సుమారు మూడున్నర దశాబ్దాల తన సాహితీ ప్రస్థానంలో పత్రికలతో పాటు రేడియో, టీవీ రంగాల్లోనూ కృషిచేశారు. కథానికలే కాక పెద్దకథలు, పేజీ కథలు, కాలమ్ కథలు, గొలుసు కథలు, ఏకాంశ కథలు.. ఎన్నెన్నో రాశారు. ఉత్త'రాల్ల' కథలు, టెలిఫోన్ కథలు, కొసమెరుపు కథలు, చిరుహాస్య కథలు పేరుతో కాలమ్స్ చేపట్టారు.

అంతేకాదు.. కొత్త, సరికొత్త, వినూత్న, ఉత్తమ కథల సంకలనాలు, సంపుటాలకు రాంబాబు సంపాదకులుగా వ్యవహరించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి తెలుగు ఎం.ఏ., ప్రీ పీహెచ్‌డీ రిఫరెన్స్ పుస్తకాలకీ సంపాదకత్వం వహించారు. సంకలనాల ప్రచురణకర్త అయ్యారు. కథానికా సదస్సులు నిర్వహించారు.

'ఏ విషయాన్నయినా వినసొంపుగా చెబితే.. కథలా చెప్పాడంటాం. అంటే పొందికగా, అందరికీ తెలిసేలా, ఆసక్తి కలిగేలా చెప్పేదే కథ. కంటికి వెలుగు, బుద్ధికి పదును, మనసుకి ఉత్తేజం అందించే కథకి ఎప్పుడూ.. వస్తు ప్రాధాన్యమే. ఎత్తుగడ, నడక, ముగింపు అందర్నీ కదిలించేలా ఉండాలి' అంటారు రాంబాబు. ఈ సందర్భంగా దశాబ్దం కిందట 'ఈనాడు ఆదివారం అనుబంధం'లో ప్రచురితమైన 'తేడా' కథ వెనుక కథ గురించి ఇలా చెప్పారాయన...

**మేం** ఆరుగురు అన్నదమ్ములం. నాన్న పూర్ణచంద్రరావుగారికి కథలంటే ఇష్టం. వాటికోసం ఆయన మాతోనే వార పత్రికలు తెప్పించుకునేవారు. నచ్చిన కథలుంటే వాటిని బైండింగ్ చేయించేవారు. ఆయన నుంచే కథాభిమానం వారసత్వంగా నాకబ్బిందేమో? నాన్న దృష్టిలో పడాలంటే కథా రచయిత కావాల్సిందే అని చిన్నప్పుడే అనుకున్నా. అందుకే ఏ మంచి కథ చదివినా 'నేనూ అలా ఆలోచిస్తే?' అనుకునేవాణ్ణి. అదే, ఆ తపనే ఆలోచనా పరిధిని మరింత విస్తృతం చేసింది.

కథాభిమానం కొనసాగుతున్నా పీయూసీ కాగానే మెడిసిన్ చేయాలని ఆశపడ్డా. కానీ నాన్నగారు మా అన్నదమ్ములందర్నీ డిగ్రీ వరకే చదివిస్తానన్నారు.

ఎవరిమీదా హెచ్చుతగ్గులు చూపించరాదని ఆయన భావం. 'నాకన్నా వాడికి ఎక్కువ చదువు చెప్పించావ్, ఎందుకు? ' అని రేపు కొడుకుల్లో ఎవరూ తనను ప్రశ్నించకూడదని ఆయన ఆలోచన. 'అలా ఎవరు నిలదీసి అడిగినా భరించలేను. అందుకే డిగ్రీ దాకా చెప్పిస్తానంటున్నా, అర్థం చేసుకో' అన్నారు నాతో.

బతిమిలాడాను, భంగపడ్డాను, అలిగాను, అన్నం మానేశాను. ఎన్నిచేసినా ఆయన చలించలేదు. పైగా 'చదువుమీద ఆసక్తి ఉంటే చాలు, ఉద్యోగం చేస్తూ కూడా ఏ నైట్ కాలేజీలోనో చదువుకోవచ్చు' అంటూ సలహా ఇచ్చారు. నాలో కోపం, బాధ రెండూ పెరిగాయి. ఆ ఇంటి నుంచి ఎంత తొందరగా బయటికి వెళితే అంత మంచిదని అనిపించింది. అందుకే బీఎస్సీ చేసిన వెంటనే ఉద్యోగ వేటకు హైదరాబాద్ వచ్చేశాను. విద్యాదాహం తీరక మరోపక్క 'ప్రజా సంబంధాలు', జర్నలిజమ్ డిగ్రీలు చేశాను. తెలుగు ఎం.ఏ. అయ్యాను. అప్పటికే రచయితగా కాస్త పేరు రావడంతో, నేరుగా పీహెచ్‌డీలో సీటు లభించింది. 'తెలుగు వారపత్రికలు-రచనా ధోరణులు' గురించి పరిశోధనా పత్రాన్ని సమర్పించాను.

ఓ వారపత్రికకు ఎగ్జిక్యూటివ్ ఎడిటరయ్యాను. నాకు ఆ ఉద్యోగం రావడం, నాన్న రిటైర్ కావడం వరసగా జరిగిపోయాయ్. 'కష్టమో నిష్ఠూరమో..

## ప్రశంసలు

నా దృష్టిలో.. మనసును తాకిన కథ 'తేడా'. తండ్రీకొడుకుల బంధాల గురించి ఎన్నో కథలున్నాయి. వారిమధ్య వైరుధ్యాల గురించీ కథలొచ్చాయి. ఇది మాత్రం తండ్రి హృదయాన్ని అద్దంలో చూపిన కథ. అనుబంధాన్ని, అంతరాన్ని ఒకచోట ఆవిష్కరించినందుకే ఇది మనసును కదిలించింది.

**-పోరంకి దక్షిణామూర్తి**

చక్కని, చిక్కని నిఖార్సయిన కథ 'తేడా'. కథారచనకు ప్రాణమైన క్లుప్తతను అందులో సాధించారు రాంబాబు. బొమ్మకు కళ తేవడమే శిల్పం. అందులో భాగంగా, తండ్రి రెప్పలకింది తడిని సైతం చదువరికి చూపారాయన. స్పందన, అనుభూతి కలిగించి కథాశిల్పప్రయోజనం నెరవేర్చారు.

**-విహారి**


## ఆకట్టుకునే ప్రత్యేకతలెన్నో...

6 తెలుగు కథలు,
3 భారతీయ భాషల కథలు,
3 ప్రపంచ భాషల కథలు...
వెరసి **12 కథలు**
వందేళ్ల తెలుగు కథలో
**ప్రపంచీకరణ ప్రభావం**
ఇంకా.. కార్డు కథలు,
ప్రముఖ సినీ గీతరచయిత చంద్రబోస్
**పరామర్శ**
డా॥ సి.నారాయణరెడ్డి, అరసవిల్లి కృష్ణ
**ముషాయిరా**




ఈనెల **విపుల** కొనండి.. చదవండి...

అమ్మ, నాన్న బాధ్యతల్ని నేనే స్వీకరించాలి' అనుకుని వారిని మా ఇంటికి తెచ్చుకున్నాను. 'నన్ను పైచదువులు చదివించినా.. మెడిసిన్ చేయించినా ఆయనను మరింత బాగా చూసుకునే అవకాశం ఉండేది కదా' అని మనసులో ఓ అసంతృప్తి. దాంతో 'నువ్వు మెడిసిన్ చేయించకపోయినా... స్వయంగా నా అంతట నేను పీజీయేకాదు.. ఏకంగా డాక్టర్




పట్టాయే సంపాదించా.. చూశావా?' అని నాన్నతో ఏనాటికైనా అనాలని అనుకునేవాడ్ని. అదే పంతం, అంతే పట్టుదలతో డాక్టరేట్ సాధనకు సిద్ధమయ్యాను.

వైవాకి బయల్దేరుతుంటే 'బాబూ! బాగా చెయ్' అన్నారు నాన్న. 'వైవా అనేది ఓ ఫార్మాలిటీ, నేను డాక్టర్‌ని అయినట్టే' అన్నాను. అప్పుడు నా గొంతులో ధ్వనించిన అహం గుర్తొస్తే ఇప్పటికీ సిగ్గేస్తుంది. నిజానికి అహం కన్నా నా చదువుకు అడ్డుపడ్డారన్న తీవ్రమైన అసంతృప్తి, అసహనం నాతో ఆనాడు అలా మాట్లాడించాయనుకుంటా. నాన్నను నేను అడిగిన డాక్టరేట్, ఇప్పుడు నేను సాధిస్తున్న డాక్టరేట్ వేర్వేరు కావచ్చు అయినా మొత్తంమీద డాక్టర్ సాధించినట్టే కదా.. అదీ నా ధీమా, నా అహంకారం.

ఆ విషయాన్ని.. ఆయనకి మరింత స్పష్టంగా చూపించి మరీ చెప్పాలని వైవా పూర్తయిన వెంటనే విజిటింగ్ కార్డులు వేయించాను. ఇంటికి వెళ్లగానే 'వైవా అయిందా?' అని ఆసక్తిగా అడిగారు నాన్న. 'వైవా అయింది.. డాక్టరేటూ వచ్చింది' అంటూ జేబునుంచి విజిటింగ్ కార్డుని తీసి, పడక్కుర్చీలో పడుకున్న ఆయన మీదికి విసిరేశాను. పొట్టమీద పడిన దాన్ని తీసుకుని 'డాక్టర్ వేదగిరి రాంబాబు' అని పైకి చదివారు తప్ప, నా అహంకార ప్రదర్శనకు నొచ్చుకోలేదు.. అసలు దాన్ని పట్టించుకోలేదు.. 'దటీజ్ నాన్న' అని ఇప్పుడనిపిస్తుంది.

అసలు నాదెంత అజ్ఞానమో చూడండి.. నాధోరణికి ఆయన ముఖం మాడిపోతుందనుకున్నా. మాడిపోలేదు సరి కదా.. వెయ్యి కాండిల్ బల్బులా వెలిగింది. 'ఈ కార్డుని నా దగ్గరే ఉంచుకుంటాన్రా' అంటూ జేబులో పెట్టుకున్నారు. ఆయన ఉండేది నా ఇంట్లోనే అయినప్పుడు నా అడ్రస్ కోసం విజిటింగ్ కార్డు అక్కర్లేదు. అయినా భద్రంగా దాచుకున్నారంటే, నా పేరు ముందున్న 'డాక్టర్'ను పదేపదే చూడటానికే!

తను చేయలేని పనిని తన కొడుకు చేశాడని గర్వం. ఆయన ప్రేమశక్తి ముందు..

నా అహంభావం ఆనాడే తలవంచింది. ఆర్థికంగా, అధికారికంగా కొడుకుకంటే తండ్రి తక్కువ కావచ్చు. కానీ వాత్సల్యం అందించడంలో, అభిమానాన్ని పంచడంలో ఆయన ఎంత పెద్దవాడో అప్పుడే నాకర్థమైంది. 'నాది అహంకారమైతే, నేను చెప్పించలేకపోయినా నా కొడుకు డాక్టరయ్యాడ'న్న ఆనందం ఆయనది.

**ఎంత తేడా!**

ఇది సినిమా కాదు- 'నాన్నా! నన్ను క్షమించు' అనడానికి. మరి నా పశ్చాత్తాపాన్ని ఆయనకి ఎలా తెలపాలి? నేను పశ్చాత్తాపపడాలని ఆయనలా చేయలేదు. నా అంతట నేనే దాన్ని ఫీలయ్యాను. 'అంతా మీ ఆశీర్వాదబలం నాన్నగారూ! లేకపోతే.. చదువు మానేసి ఉద్యోగం చేసుకుంటున్న నేను.. ఇప్పుడిలా, ఇంత పట్టుదలగా డాక్టరేట్ సాధించగలిగేవాడినా? " అన్నాను చివరికోరోజు.

ఆయన మళ్లీ జేబు నుంచి నా విజిటింగ్ కార్డు తీశారు. 'డాక్టర్..' అంటూ పైకి చదువుతుంటే, ఆ కళ్ళ నుంచి ఆనందబాష్పాలు! నా కళ్లవెంట పశ్చాత్తాప బాష్పాలు!! జరిగిందంతా కథగా రాసి 'తేడా' పేరిట 'ఈనాడు' ఆదివారం అనుబంధానికి పంపాను. ప్రచురితమైంది. ఆ కథని చదివి నాన్న ఎలా ఫీలవుతారో చూడాలనుకున్నా. ఆ రోజున.. ఆయన ఉన్న హాల్లోనే మరో కుర్చీలో కూర్చుని గమనించా. ఆయన ఈ కథని చదివారు, నా వైపు చూశారు. 'పిచ్చి పిల్లాడా' అన్నట్లుంది ఆ చూపు, తర్వాత ఆ మ్యాగజైన్ నాకిచ్చేశారు.

నాన్న నాకేమీ చెప్పలేదు. కానీ ఎంతో మంది తండ్రులు నాకు ఫోన్లుచేసి మరీ చెప్పారు.. 'తండ్రీ కొడుకుల మధ్య తేడాని చిన్న కథలో చాలా బాగా రాశావ'ని.

'తేడా' తర్వాత ఎన్నో కథలు రాశాను. అయినా ఆ కథనే వియోగి, నాగరాజు, రాచపూటి తమ 'రమణీయ కథలు' సంకలనంలో వేయడానికి ఎంపిక చేసుకున్నారు. నేను ఆ కథని రాసింది 1999 లో అయినా అది సంకలనంలో చోటుచేసుకుంది 2007లో. అంటే, ఎన్నేళ్లయినా కూడా ఆ కథాపరిమళాలు వాడిపోలేదని నాకర్థమైంది.

సేకరణ: **శరత్‌బాబు**

## దీటైన ప్రశ్నకు తగిన జవాబు

రాజస్థాన్ ఆళ్వార్ మహారాజుకు విగ్రహారాధనపై నమ్మకం లేదు. ఒకరోజు అతడు వివేకానందుడిని విగ్రహారాధన విశిష్టతను వివరించమన్నాడు. స్వామి దర్బారులో తేరిపార జూచి దివాన్ గారిని పిలిచి, 'ఆ గోడకు తగిలించిన మహారాజు పటాన్ని కిందకు దింపించండి' అన్నాడు. 'ఇది ఎవరి బొమ్మ? ' అని ప్రశ్నించాడు. 'మహానుభావుడైన మహారాజు గారి పటం' అన్నాడు దివాను. 'దానిమీద ఉమ్మండి' అని ఆజ్ఞాపించాడు. దివాను దిగ్భ్రమతో నుంచున్నాడు. దర్బారు అంతా ఆశ్చర్యపోయింది. స్వామీజీ గంభీరంగా, 'ఊ..



ఉమ్మండి దాని మీద. ఎందుకు అంతగా తటపటాయిస్తారు? ' అన్నాడు. అలా చేసేందుకు ఎవరు సాహసించగలరు? అప్పుడు స్వామీజీ 'మీ మహారాజుగారు శారీరకంగా చేతులూ కాళ్లూ ఆడిస్తూ ప్రాణంతో ఆ బొమ్మలో లేరు. అయినా మీలో ఎవ్వరూ దానిమీద ఉమ్మలేకపోయారు. అలాగే రాతి విగ్రహం లోపల దేముడు ఉండడు. ఆ విగ్రహం భగవంతుని ప్రతిరూపం. మహారాజావారి చిత్రపటంలాగే విగ్రహమూ ఎంతో పవిత్రమైనది' అన్నాడు.

యర్రంశెట్టి శాయి

# గూండా నెంబర్ వన్



మా అపార్ట్‌మెంట్స్‌లో ఉన్నట్టుండి ఆ రోజు మాణింగ్ పెద్దగా కేకలు వినిపించే సరికి అందరం ఆ కేకలు వచ్చిన బిల్డింగ్ వేపు పరుగెత్తాం! అక్కడ మా సొసైటీ మెంబరు సూర్యారావ్ చుట్టూరా సూట్లు వేసుకున్న నలుగురు లావుపాటివాళ్ళు చేరి అతనిని బూతులు తిడుతూ కనిపించారు. వాళ్ళ దగ్గర మందు వాసన గుప్పుమంటోంది.

"ఏమనుకుంటున్నావ్ బే! పైసలు పుక్కట్‌గా వస్తయ్యనుకుంటున్నావా? సాలే! ఎన్నిసార్లు ఫోన్‌లో తిట్టాల్రా నిన్ను? బాడుకవ్- తియ్- పైసల్దియ్-"

సూర్యారావ్ బతిమాలుతున్నాడు.

"అలా తిట్టకండి సార్! వచ్చే వారంలో నాకు బాంక్ లోన్ వస్తుంది. ఆ డబ్బుతో మీ క్రెడిట్ కార్డ్ బాకీ కట్టేస్తా!"

"ఎంతొస్తుందిరా లోన్? "

"నలభైవేలు సార్"

"మరి మిగతా ముప్ఫయ్ వేలూ నీ తాత కడతాడేరా? "

"మా తాతెక్కడున్నాడు సార్? ఆయన క్రెడిట్ కార్డ్ బాకీ తీర్చలేకే అండమాన్ వెళ్ళి సెటిలయిపోయాడు. ఇంక నాకేమి స్తాడు? "

వాళ్ళు షాకయ్యారు.

"ఆ! మీ తాతక్కూడా క్రెడిట్ కార్డ్ బాకీ ఎగ్గొట్టే హిస్టరీ ఉందా? "

"హిస్టరీ అంటే ఆయనకు ఇలా అప్పులెగ్గొట్టటం ఇష్టం ఉండదు సార్! కానీ మీ బ్యాంకోళ్ళు ఆయన పదివేలు క్రెడిట్ కార్డులో వాడుకుంటే దానికి అరవైవేలు వడ్డీ వేశారు సార్. అందుకే పారిపోయాడు"

హఠాత్తుగా ఆ సూట్‌వాలాల్లో ఒకడు చటుక్కున కత్తి తీసి సూర్యారావ్ గొంతు మీద పెట్టాడు.

"ఏయ్. మళ్ళీ వచ్చే ఆదివారం వస్తాం! బాకీ తీర్చావా సరే, లేకుంటే ఈడనే ఖతమ్! సమజయిందా? "

"అ...యిం...ది సార్" వణికిపోతూ అన్నాడు సూర్యారావ్.

వాళ్ళు వెళ్ళిపోతూ మా అందర్నీ చూస్తూ తిట్టుకుంటూ వెళ్తున్నారు.

"దొంగ బాడుకవ్‌గాడు! ఎన్నిసార్లడిగినా ఏదోకటి చెప్తున్నాడు. ఇట్ల బాకీలు ఎగ్గొట్టే

బదులు ఆడి పెళ్లాన్ని మార్కెట్‌లో అమ్మ కానికి పెట్టొచ్చుకదా" అందరూ వినేటట్లే అన్నాడొకడు.

ఆ మాటతో మా అందరికీ ఒళ్ళు మండి పోయింది. వెంటనే హమీద్‌మియా కల్పిం చుకున్నాడు.

"హలో మిస్టర్! మీరు ఎడ్యుకేటెడ్‌లాగు న్నయ్. పెళ్ళాం-గిళ్ళాం కర్‌కే గాలియా దేనా- ఖరాబ్ మాటలున్నయ్" అన్నాడు వాళ్ళ వాగుడుకి చెక్ పెడుతూ.

"అవ్! క్రెడిట్ కార్డ్ బాకీ కట్టకుంటే బరాబర్ అంటాం! అంత సిగ్గున్నోడు పైసలు కట్టాలె" అన్నాడు ఇంకో సూట్ వాలా!

దాంతో విజయ్‌యాదవ్ రెచ్చిపో యాడు.

"ఏయ్! మంచిగ మాట్టాడు! గిట్ల గూండాగిరి జేస్తే మీలాంటోళ్ళను జైల్లో వేస్తారు? "

ఆ మాట అనటంతోనే వాడు చటుక్కున కత్తి తీశాడు మళ్ళీ.

"ఏయ్.. ఏంది మాట్టాడుతున్నావ్? గూండాగిరీ అంటున్నావ్. మేము గూండా లెక్క కనబడుతున్నాం బే? మేమెవరిమో ఎరుకనా? నెంబర్‌వన్ ప్రైవేట్ బ్యాంక్‌ల చీఫ్ రికవరీ ఆఫీసర్స్‌మి! ఇగో మా కార్డ్ గిట్ట చూడు. పరేషానవుతావ్ మల్ల" అంటూ జేబులో నుంచి కార్డ్ తీసి విజయ్ యాదవ్ మీదకు విసిరాడు.

మేమందరం షాకులో ఉన్నాం! వాళ్ళు చీఫ్ రికవరీ ఆఫీసర్లంటే నమ్మలేకపో తున్నాం.

అందుకే వాళ్ళు విసిరిన కార్డ్ కింద పడుతూంటే పట్టుకుని చూశాం.

దానిమీద, ఇంటర్నేషనల్ పెన్ ఫ్రెండ్స్ సర్కిల్ - అందమైన అమ్మాయిలతో రాత్రిం బగళ్ళు స్నేహం చేయాలనుందా? విదేశీ, స్వదేశీ గాళ్స్.. 400 ఫొటోల్లో మీకు నచ్చిన వారిని సెలక్ట్ చేసుకోండి! ధరలు




చాలా సరసం! వెంటనే సెల్‌కి సరసం-స్పే స్-లవ్ ఫ్రెండ్స్- అని టైప్ చేసి 63656కు ఎస్సెమెస్ చేయండి- అనిరాసి ఉంది.

"ఓహో మీరు చీఫ్ రికవరీ ఆఫీసర్సా? అంటే మీ పని అమ్మాయిలను సప్లయ్ చేసే బ్రోకరు పనా? " అడిగాడు శంకర మూర్తి.

దాంతో అతను షాకయ్యాడు.

"ఏదీ? ఆ కార్డ్ ఇటివ్వు" అంటూ లాక్కున్నాడు. జేబులోనుంచి ఇంకో కార్డ్ తీస్తూ 'ఆ కార్డ్ నాది కాదులే. ఇది చూడు' అన్నాడు.

అందులో బాంక్ పేరూ, అతని పేరూ, చీఫ్ రికవరీ ఆఫీసర్ అన్న డెజిగ్నేషన్, అన్ని వివరాలూ రాసి ఉన్నయ్.

"నీకు ఏ కార్డు లో ఏం రాసుందో కూడా తెలీదు..నువ్ చీఫ్ రికవరీ ఆఫీసర్‌వా? ఇప్పుడే ఆ బాంక్‌కి ఫోన్ చేసి కను క్కుంటాం" అన్నాడు విజయ్ యాదవ్.

హమీద్‌మియా అప్పటికప్పుడే బ్యాంక్‌కి ఫోన్ కొట్టాడు కానీ మామూలుగానే ఒక టినొక్కండి- నాలుగునొక్కండి- రెండు




నొక్కండి- అంటూ టేప్ వాయిస్ మొదలె ట్టేసరికి కంగారుపడి సెల్ ఆఫ్ చేసేశాడు.

ఎందుకంటే ఒకసారి ఒక బ్యాంక్ కస్ట మర్ సర్వీస్‌కి ఫోన్ చేస్తే కావలసిన ఇన్ ఫర్మేషన్- రకరకాల బటన్స్ నొక్కుతూ-రాబట్టేసరికి ఇరవై నిమిషాల టైమూ-ముప్పయ్ రూపాయల బిల్లూ అయింది. మా హడావుడి చూసి ఎందుకయినా మంచిదని ఆ గూండా రికవరీ ఆఫీసర్లు మెల్లగా జారుకున్నారు.

ఇలా లాభం లేదని మేము వెంటనే ఆ బ్యాంక్‌కి బయల్దేరాం.

మా కాలనీకి దగ్గర్లోనే ఉందది.

మేనేజర్ మమ్మల్ని చాలా సంతోషంగా, గౌరవంగా ఆహ్వానించాడు.

"ఫిక్సెడ్ డిపాజిట్ కోసం వచ్చారా? బాయ్.. అందరికీ కూల్ డ్రింక్స్ తీసు కురా!" అంటూ బాయ్‌కి పురమాయించా డుగాని బాయ్ కదల్లేదు.

"మేము వచ్చింది ఫిక్సెడ్ డిపాజిట్ చేయటానిక్కాదు సార్" అన్నాడు శంకర మూర్తి.

మేనేజర్ మొఖంలోని సంతోషమంతా మాయమయింది.

"అయితే ఎకౌంట్ ఓపెన్ చేయడాని కొచ్చారా? బాయ్.. కూల్‌డ్రింక్ వద్దు-చాయ్ వన్‌బైటూ తీసుకురా"

ఈసారి కూడా బాయ్ అక్కడి నుంచి కదల్లేదు.

"ఎకౌంట్స్ కూడా అక్కర్లేదు సార్"

మేనేజర్ మొఖంలో చిరాకు కనిపించింది.

"మరెందుకొచ్చారు? లోన్స్ ఏమయినా కావాలా? బాయ్.. అలా చూస్తా నిలబడ్డా వేంటి? మంచినీళ్ళు తీసుకొచ్చి ఇవ్వు"

అయినా బాయ్ కదల్లేదు.

"లోన్స్ కూడా అవసరం లేద్సార్. మేమొచ్చిన పనేంటంటే మీ దగ్గర పని చేస్తున్న చీఫ్ రికవరీ ఆఫీసర్స్‌కి క్వాలిఫికే షన్ ఏమిటో కనుక్కుందామని?"

మేనేజర్ కొంచెం కన్‌ఫ్యూజయాడు.

"ఆ విషయం మీకెందుకు?"

"ఎందుకంటే ఆ పోస్ట్‌కి మా అబ్బాయి అప్లయ్ చేస్తున్నాడు, అందుకని?"

"అవన్నీ నాకు తెలీదు. హెచ్‌ఆర్ డిపా ర్ట్‌మెంట్ హెడ్‌ని కలవండి" అన్నాడు ఇంకా చిరాగ్గా. "బాయ్! మంచినీళ్ళు కూడా అక్కర్లేదు. నువ్వెళ్ళి పనిచూసుకో" అన్నాడు బాయ్‌తో.

బాయ్ హాపీగా వెళ్ళిపోయాడు.

అందరం హెచ్‌ఆర్ బాస్ దగ్గరకెళ్ళాం.

"ఫలానా క్వాలిఫికేషన్ అంటూ ఏమీ లేదండీ! టెన్త్ వరకూ చదివితే చాలు!"

"టెన్త్ వరకూ చదివితే చాలా?"

"చాలు-"

"అయితే వాళ్ళకు జీతమెంత?"

"పాతిక వేలు, ప్లస్ కమీషన్"

"కమీషన్ అంటే?"

మొండి బాకీలు ఎంత వసూలు చేస్తే అందులో నాలుగోవంతు"

"అంటే ఆ లెక్కలో కమీషనే నెలకు లక్ష రూపాయలు తగ్గదు కదండీ"

"లక్షేంటి- నాలుగయిదు లక్షలు సంపాదిస్తున్న వాళ్ళు కూడా ఉన్నారు"

"అయితే మేమందరం కూడా గవర్నమెంట్ ఉద్యోగాలు మానేసి మీ బ్యాంక్‌లో రికవరీ ఆఫీసర్స్‌గా చేరిపోతాం సార్" ఉత్సాహంగా అన్నాడు శంకరమూర్తి.

హెచ్‌ఆర్ బాస్ గాబరాపడ్డాడు.

"మీరు చేర్తారుగానీ మేము చేర్చుకోవద్దా? "

"ఎందుకని సార్? వేకెన్సీల్లేవా? "

"ఉన్నాగానీ మాక్కావలసిన అర్హతలు మీకుండాలి కదా? "

"టెన్త్ చదివిన కాండేట్ అయితే చాలన్నారు కద్సార్.. మాలో గ్రాడ్యుయేట్స్, పోస్ట్‌గ్రాడ్యుయేట్స్ కూడా ఉన్నారు"

"అదిగాక ఇంకా చాలా క్వాలిఫికేషన్స్ ఉన్నాయయ్యా? "

"ఏమిటవి? "

"మీరు సిటీలో ఒక ఇంపార్టెంట్ ఏరియాలో దాదా అయ్యుండాలి. మీకింద కనీసం అరడజను మంది మెంబర్లున్న గ్యాంగ్ పనిచేస్తూండాలి. ఇంతకు ముందు బాకీల వసూలు కోసం మర్డర్లు చేసిన ఎక్స్‌పీరియెన్స్ ఉండాలి- మీ దగ్గర కత్తులూ, గన్ లైసెన్స్‌లూ ఉండాలి" హామీద్‌మియా ముందుకొచ్చాడు.

"లేకిన్- బ్యాంక్ బాకీ వసూళ్ళల్లో గుండాలను ఎంప్లాయ్ చేయొద్దు అని రూల్ వచ్చినయ్ కదా? "

ఆ మాటతో హెచ్‌ఆర్ బాస్ తడబడ్డాడు.

"రూల్స్ వచ్చినయ్. అందుకే మేము వాళ్ళనిప్పుడు గూండా ఏజెన్సీలు అనకుండా చీఫ్ రికవరీ ఆఫీసర్స్ అని పేరు పెట్టాం. అదివరకు గుండాలు కేవలం కమీషన్ మీద పనిచేసేవాళ్ళు. ఇప్పుడు వీరీలెవల్లో ఆఫీసర్స్‌గా పని చేస్తున్నారు. అంటే వాళ్ళు కూడా మా స్టాఫే"

"కానీ గూండాలను ఎంగేజ్ చేయటం రూల్స్‌కి వ్యతిరేకం కదా? "

"రూల్సా గాడిదగుడ్డా! ఇండియాలో రూల్సేంటోయ్? మీకేమయినా మెంటలా? రూల్స్ ప్రకారం పని చేస్తే మొత్తం బ్యాంకులన్నీ మట్టికొట్టుకుపోతాయ్, తెల్సా? అయినా మీకేమయినా అబ్జెక్షనుంటే ఆర్‌బిఐ గవర్నర్ దగ్గరకెళ్ళి చెప్పుకోండి..ఫొండి! డోంట్ వేస్ట్ మై టైమ్"

అందరం బయటికొచ్చాం.

"ఇప్పుడేం చేస్తాం? " ఆలోచిస్తూ అన్నాడు హమీద్‌మియా.

"ఈ విషయం ముందు పోలీస్‌కి కంప్లెయింటిస్తే బెటరు" అన్నాడు బోస్. అందరూ బోస్‌ని సపోర్ట్ చేశారు.

వెంటనే పోలీస్‌స్టేషన్ చేరుకున్నాం.

ఇన్‌స్పెక్టర్ మేము చెప్పిందంతా విన్నాడు.

"ఇదిగో.. మీకు పనీపాటా లేదేమో గానీ మాకుంది. మహా మహా ఆయేషా మర్డర్ లాంటి కేస్‌లు మేము పట్టించుకోము. ఇలాంటి చిల్లర కేస్‌లు టేకప్ చేస్తామా? వెళ్ళండి- నీయవ్వ- ప్రతి నా కొడుకూ లీడర్‌గిరీ చేస్తాడు" అన్నాడు గొణుక్కుంటూ.

ఆ మాట వినేసరికి అందరికీ ఒళ్ళు మండిపోయింది.

"ఏంటన్నావ్? ప్రతి నా కొడుకూ లీడర్‌గిరి చేస్తాడా? ఎవర్నంటున్నావా మాటా? " ఎదురు తిరిగాడు విజయ్ యాదవ్.

"అబ్బే, మిమ్మల్ని కాద్సార్! వేరేవాళ్ళని అంటూ భయపడతాననుకున్నావా? ఏరా? మిమ్మల్నే అన్నా! ఏం పీకుతావ్? ఆc.. ఏం పీకుతారు? అనడుగుతున్నా? " ఆవేశంగా, పొగరుగా అరిచాడతను.

"ఏం చేస్తామా? నీ మీద ఎస్పీకి కంప్లె

యింటిస్తాం? "

"అట్లనా? మరింకా చూస్తావేంట్రా? వెళ్ళండి! కంప్లెయింట్ చేసుకోండ్రా? వాడేం పీకుతాడ్రా నన్ను? "

ఇంక అక్కడే నిలబడితే ఇంకేం డామేజింగ్‌గా మాట్లాడుతాడోనని అందరం బయటికొచ్చేశాం.

"ఇది మనకు రెండోసారి. ఇలా కంప్లెయింటివ్వటానికి పోలీస్ స్టేషన్‌కెళ్ళి తిట్లు తినటం" చిరాగ్గా అన్నాడు శంకరమూర్తి.

మా అందరికీ మొదటిసారి పోలీస్ స్టేషన్‌కెళ్ళినప్పటి సీన్ గుర్తుకొచ్చింది.

మా అపార్ట్‌మెంట్స్‌లో పట్టపగలే దొంగ ఒకడు ఒక ఫ్లాట్‌లో దొంగతనం చేస్తూంటే రెడ్‌హాండెడ్‌గా పట్టుకున్నాం- అందరూ వాడిని తలో దెబ్బా కొట్టి పోలీస్ స్టేషన్‌కి ఈడ్చుకుపోయాం.

"సార్.. వీడు పట్టపగలే మా అపార్ట్‌మెంట్స్‌లో దొంగతనం చేస్తూంటే రెడ్ హాండెడ్‌గా పట్టుకున్నాం" అన్నాం వాడిని ఇన్‌స్పెక్టర్ ముందు నిలబెడుతూ.

'ఆహా! మీ అంతటి మీరే దొంగను పట్టుకున్నారా? మేము చేయాల్సిన పని మీరు చేశారా? ఎంత గొప్ప పౌరులు సార్ మీరు? ఎంత గ్రేట్ సిటిజెన్స్ సార్ మీరు? ' అంటూ కౌగిలించుకుని ఆనంద బాష్పాలు రాలుస్తాడని అనుకున్నాం మేము.

కాని ఇన్‌స్పెక్టర్ అలా అనలేదు సరి కదా- మావేపు దావూద్ ఇబ్రహీమ్ గాంగ్ మెంబర్స్‌ని చూసినట్లు చూశాడు.

"వీడిని మీరంతా కలసి కొట్టారా? " అడిగాడు దొంగ ఒళ్ళంతా తేలిన వాపులు చూస్తూ.

"అవున్సార్.. కొంచెం గట్టిగానే వాయించాం" గర్వంగా చెప్పాడు విజయ్ యాదవ్.

"మళ్ళీ మళ్ళీ చేయకుండా!" అందించాడు శంకరమూర్తి.

"మీకేమయినా దమాకుందిరా? దొంగని కొట్టమని ఎవళ్ళు చెప్పారు మీకు? "

మేము షాకయ్యాం. ఎవరికీ నోటమాట రాలేదు.

"ఇగో ఇన్‌స్పెక్టర్.. 'రా', 'గీ' అంటున్నావేంది? మేమెవళనుకుంటున్నావ్ నువ్వు? " అన్నాడు మొహిందర్ సింగ్ కోపంగా.

"రా- అనక ఇంకేమనాలి బే! తోటి మనిషిని గట్ల కుక్కని కొట్టినట్లు కొడతారుబే. చూడండ్రి- మీరు కొట్టిన దెబ్బలకి వాడి ముఖం, ఒళ్ళూ అన్నీ గీరుకుపోయి, ఎట్లా వాచిపోయిందో చూడు. వీడినిలా కొట్టినందుకు అందరిమీదా ఇప్పుడే ఎటెంప్ట్ మర్డర్ కేస్ రిజిస్టర్ చేసి లాకప్‌లోకి తోస్తా!"

అ మాటనేసరికి మాకు భయం వేసింది గానీ పైకి కనబడకుండా జాగ్రత్తపడ్డాం.

"అంటే? చోర్‌ని కొట్టకుండా ముద్దు పెట్టుకుంటయ్? క్యాబాత్ కర్‌తేజీ? " అన్నాడు హమీద్‌మియా.

"మీ ఇంటికి చోర్ వస్తే నువ్ కొట్టకుండా వానికి చాయ్ పానీ ఇస్తయ్? "

ఆ కొశ్చెన్‌తో ఇన్‌స్పెక్టర్‌కి ఇంకా చిరాకేసుకొచ్చింది.

"ఇగో బేకార్ బాత్ వద్దు- సమజైందా? ఇంక పోండి"

"పోవటమేమిటి? కేస్ రిజిస్టర్ చేసుకోరా? " అడిగాడు బోస్.

"ఏంది? కేస్ రిజిస్టర్ చేయాలా? నేనేం పాగల్‌గాని లెక్క కానొస్తున్నానా? రిజిస్టర్ గిజిష్టర్ ఏమీ ఉండదు- మంచిగ వచ్చిన దారిన పోండ్రి"

హమీద్‌మియాకి కోపం వచ్చింది.

"క్యా? కేస్ రిజిష్టర్ నహీకర్‌తే? మేము ఇప్పుడే టి.వి. చానెల్‌కు ఫోన్ చేస్తయ్. మేము చోర్‌ని పట్టితెచ్చినా ఇన్‌స్పెక్టర్ కేస్ రిజిస్టర్ చెయ్యవ్ అని చెప్తయ్"

"ఏంటి? బెదిరిస్తున్నారా? టీవీ చానెల్ పేరు చెప్తే నేను వణికిపోతాననుకు న్నారా? ఇగో- నువ్ పిల్చేదేంటి? టీవీ చానెల్‌ని నేనే పిలుస్తా" అంటూ తన సెల్ తీసి ఓ నెంబర్‌కి డయల్ చేశాడు.

"హలో.. నేను ఎస్సై భీమ్‌ని మాట్లాడు తున్నా. అర్జంటుగా ఈడో కేస్ కవర్ జేయాలె"

మాకు అంతా అయోమయంగా ఉంది.

ఆ ఎస్సై ప్రవర్తన చూస్తూంటే తప్పు మాదో, అతనిదో కూడా అర్థం కావటం లేదు.

"ఇగో టీవీ చానెలోళ్ళువస్తున్నారు. మీ దూల తీరిపోద్ది" అన్నాడు మావంక హేళ నగా చూస్తూ.

"వీడు కొంచెం ఎక్కువలు చేస్తున్నాడు. మనం ఏమయినాసరే, వీడి అంతు తేల్చా ల్సిందే- అవసరమయితే హోమ్ మినిస్టర్ దగ్గరకయినా వెళ్దాం" అన్నాడు విజయ్ యాదవ్.

అందరూ అతనిని సపోర్ట్ చేశారు.

మాలో మేము డిస్కస్ చేసుకుంటాండ గానే తుగ్లక్ టీవీ చానెల్ వాన్ వచ్చే సింది.

కెమెరామెన్, జర్నలిస్ట్ రాజు దిగారు.

"హలో! ఏంటి.. రామ్‌భరోసా అపార్ట్ మెంట్ వాళ్ళంతా పోలీస్ స్టేషన్‌కొ చ్చారు? "

"నేను చెప్తా! డైరెక్ట్ టెలికాస్ట్ చేసుకో" అన్నాడు ఎస్సై కెమెరా ముందుకొచ్చి నిల బడుతూ.

క్షణాల్లో కెమెరా ఆన్ అయింది.

"గజనీ.. మేము ఇప్పుడు దౌర్భాగ్యనగర్ పోలీస్ స్టేషన్‌లో ఉన్నాం గజనీ! ఇక్కడ ఒక విచిత్రమయిన కేస్ వచ్చిందని ఎస్సై భీమ్‌గారంటున్నారు-"

"ఓకే రాజూ.. క్యారీఆన్!"

వెంటనే భీమ్ అందుకున్నాడు.

"న్యూస్ పేపరోళ్ళు- టీవీ చానెలోళ్ళు



ఎప్పుడు ఏ పోలీస్‌స్టేషన్లో ఎవడు ఖర్మ కాలి చచ్చినా, 'అది లాకప్ డెత్' అంటూ పెద్ద న్యూసెన్స్ చేస్తారు గానీ, అసలిది నిజంగా లాకప్ డెత్తా? లేక సహజ మర ణమా? అసలు వాడెందుకు చచ్చాడు? ఎలా చచ్చాడు? అని తెలుసుకునే ముచ్చటే లేదు.

ఇంగో- ఇప్పుడీ రామ్‌భరోసా అపార్ట్ మెంటోళ్ళు ఈ దొంగని పోలీస్ స్టేషన్‌కి తీసుకొచ్చి మాకప్పగిస్తున్నారు. ఎలాంటి కండిషన్లో తీసుకొచ్చారో మీరే చూడండి" అంటూ దొంగవేపు చూపేసరికి కెమెరా దొంగకు క్లోజ్ ఇచ్చింది.

తను టీవీలో కనబడుతున్నాడని తెలిసే సరికి ఆ దొంగలో ఒక్కసారిగా మార్పు వచ్చేసింది.

ఇంకాసేపట్లో చచ్చే వాడిలాగా ఓవరా క్షన్ మొదలుపెట్టాడు. కళ్ళు మూసుకుపో తున్నట్లు, రెండు చేతులూ విరిగిపోయి నట్లూ యాక్షన్ చేస్తూ, మధ్య మధ్యలో ఏడుస్తూ మాట్లాడుతున్నాడు.

*(మిగతా వచ్చే సంచికలో...)*

# మనసున ఉన్నదీ...



★ 'చతుర'లో ఈ నెల వచ్చిన 'వార్ధక్యం' నవల చాలా బావుంది. రచయిత జె.వి.బాబు గారు నేటి సామాజిక సమస్యను కొత్తకోణంలో చూపారు. టాంక్‌బండ్ కథ 'తీర్పు' కూడా చాలా బాగుంది. ఒక్క తొందరపాటు చర్యతో కుటుంబాన్ని సర్వనాశనం చేసుకున్న ఆనంద్‌ను చూసి జాలేసింది. చంద్రప్రతాప్ గారు అభినందనీయులు.

–కె.ఇనాక్, తిరుపతి

★ చతురలో వస్తున్న నవలలు వేటికవే బాగున్నాయి. కొత్తగాలి నవకవులకు వేదిక. ప్రతిమాసం చతురను అందంగా అందిస్తున్న సంపాదకవర్గానికి అభినందనలు.

–ఎస్. వెంకట శేషగిరిరావు, వాకాడు

★ డిసెంబర్ చతురలోని 'వార్ధక్యం' నవల ఆలోచింపజేసింది. ఆశ్చర్యానికి గురిచేసింది. స్వానుభవం తోడవ్వటంతో ఎంతో నచ్చింది. 'కాలాతీతం'లో డిటెక్టివ్ రచన లక్షణాలు ఇవ్వడం పాఠకులకు, రచయితలకు చాలా ఉపయోగపడుతుంది. జ్ఞాన పీఠాలు శీర్షికన ఇచ్చిన గోపినాథ్ మహంతిగారి జీవితం, రచనా చరిత్ర ఆసక్తిదాయకం.

–బి.ఎస్.దామోదరం,
ఆదర్శనగర్, అనంతపురం

★ 'వార్ధక్యం' నవల బాగానే ఉంది. కానీ రచయితతో పూర్తిగా ఏకీభవించలేను. మంచి చదువులు చదువుకున్న పిల్లలు కెరీర్‌కు సుదూర ప్రదేశాలకు, దేశాలకు వెళ్లడం తప్పుకాదు. ఆర్థికంగా అన్నీ బాగావుండి, తల్లి దండ్రుల్ని పిల్లలు పట్టించుకోకపోతే అది తప్పవుతుంది. తల్లిదండ్రుల్ని చక్కగా చూసుకుంటున్న ఎన్.ఆర్.ఐలు ఎందరో మన సమాజంలో ఉన్నారు. రచయిత స్పృశించిన కొన్ని సంఘటనలు, రచనా సంవిధానం బాగున్నాయి.

–మంచాళ శ్రీలక్ష్మి,
సాగర్ నగర్, విశాఖపట్నం

★ జె.వి.బాబు 'వార్ధక్యం' నవలలో వచ్చిన అందమైన వాక్యాలు కొన్ని మమ్మల్ని బాగా ఆకట్టుకున్నాయి. ఉదాహరణకు- 'సంపాదనతో ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. కాని ఆత్మవిశ్వాసం ఒక్కోసారి ఎదుటి వారితో నిర్లక్ష్యంగా మాట్లాడిస్తుంది', 'బర్త్‌డే పార్టీకి ఆరొందలమంది రావచ్చు కాని వారిలో అరవైమంది కూడా అంతిమ యాత్రలో అడుగేస్తారా? ఆలోచించరెవ్వరూ', 'చేతలు బాగున్నప్పుడే మాటలకూ బలం వస్తుంది' తదితరాలు. కోటి ఆశలతో పెంచుకున్న బిడ్డల మమతానురాగాలకు దూరమైన వృద్ధ తల్లిదండ్రుల వ్యథలనూ, గాథలనూ హృద్యంగా, సందేశాత్మకంగా, చిత్రీకరించిన రచయిత రచనా విన్యాసానికి జోహార్లు.

–రమణమూర్తి, అచ్యుతాపురం, కాకినాడ

★ మానవతా దృక్పథం అంశంగా నడిచిన డిసెంబరు చతుర నవల 'వార్ధక్యం' గుండెల్లో సున్నితత్వాన్ని తాకింది. రచయిత సంకల్పానికి ధన్యవాదాలు.

– జి.గోపాలకృష్ణ, అరసవిల్లి

★ డిసెంబరు చతుర పేజీ 44లో నా 'కొత్తగాలి' ప్రచురించినందుకు సంతోషించనా? నాపేరు తెన్నేటి శ్యామకృష్ణకు బదులు తెన్నేటి రామకృష్ణ అని ప్రచురించినందుకు విచారించనా? కనీసం నా పేరును సవరిస్తూ ఈ లేఖనైనా ప్రచురించ ప్రార్థన.

– తెన్నేటి శ్యామకృష్ణ, హైదరాబాద్

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు,
చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా:
vipula.chatura@gmail.com



# రచయితలకు సూచనలు

**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టిపెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**

# చతుర ప్రవేశిక




## జనవరి - 10

జనవరి 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. రమ్యకు జన్మనిచ్చిన తల్లి ఎవరు?
2. అనాఘ్రాత పుష్పమైనా పతితగా అపఖ్యాతి పాలయింది?
3. కొడుకులోని లోపాన్ని కప్పిపుచ్చి పెళ్లి చేసిందెవరు?
4. ప్రభాకర్‌ను ప్రేమిస్తున్నట్లుగా అజ్ఞాత లేఖలు రాసింది?
5. సీత భర్త ఎవరు?
6. ఖాండేకర్ ఏ రచనకు జ్ఞానపీఠం పొందారు?
7. శరణ్యను సుధాకర్ ఏ విగ్రహం దగ్గర దింపాడు?
8. ఫ్రాంటియర్ మెయిల్ ప్రారంభమైన రోజు?
9. తెల్లదొరకు సరైన గుణపాఠం నేర్పిన స్వామిజీ?
10. జర్మినల్ నవలలో కథానాయకుడు?

---

పంపినవారి పేరు: ---------------------------- వయసు (   )

చిరునామా: --------------------------------------------

--------------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర,
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

ప్రవేశికలకు చివరి తేదీ 18

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

# వారేవ్వా!




పండ్లు, కూరగాయలతో
తయారు చేసిన
తమాషా బొమ్మలివి..







CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78


# సంతాన సాఫల్యతకు సృష్టి IVF ICSI






✆ 998943 2345, 998946 2345

- పేద, మధ్యతరగతి వారికి అందుబాటులో, అత్యాధునిక సౌకర్యాలతో
- 45 సం॥లు పైబడిన స్త్రీలలో కూడా సంతానం పొందే అవకాశం
- కుటుంబ నియంత్రణ ఆపరేషన్ అయినవారిలో కూడా సంతాన సాఫల్యత
- IUI, IVF, ICSI, సరోగసి, ఎగ్ డొనేషన్ సౌకర్యం

# సృష్టి టెస్ట్ ట్యూబ్ బేబి సెంటర్

www.srushtiivf.com

4వ లైన్, కె.పి.హెచ్.బి., కుకట్‌పల్లి, హైదరాబాద్ - 72

Z.P. జంక్షన్, మహారాణిపేట, విశాఖపట్నం - 2

వెంకటరత్నం వీధి, సూర్యారావుపేట, విజయవాడ - 2

లిటిల్ కృష్ణా థియేటర్ ఎదురుగా, కొత్తపేట, గుంటూరు - 2